ఆంధ్రసచిత్రవారపత్రిక

సంపుటం -83 విజయవాడ వెల రు. 4/-

శక. సం. 1912 ఆశ్వయుజ మాసం 27వ తేదీ

సంచిక -9 19-10-1990 పేజీలు: 76

## విషయానుక్రమణిక

### సీరియల్స్:



### కథలు :



### శీర్షికలు :



### శుభాకాంక్షలు

పాఠకులకు, ఏజెంట్ లకి, ప్రకటన కర్తలకు రచయితలకు అందరికీ ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి శుభాకాంక్షలు.

-ఎడిటర్

ముఖచిత్రం : సమరరంగాన సత్యభామ

చిత్రకారుడు - కాశీ

Editorial Adviser: S.RADHAKRISHNA, Editor: VEERAJI,
and Published by S.NAGESWARARAO for NageswaraRao Estates Ltd.,
at the Andhra Patrika Press, Gandhi Nagar, Vijayawada-520 003.
Phones: Editorial: 75667, Business: 61247, 61248

## సంపాదకీయం

# ఉద్యమాలా? ఇవి?

పరిగెడుతున్న రైలు బండీలో పగలంతా పట్నంలో రకరకాల కష్టాలు పడి - ఆ శ్రమను మరిచి సేదదీర్చుకుంటూ - రైలు జోలకు హాయిగా సాయం కలలు కంటూ - గూటికి చేరనున్న అమాయక ప్రయాణీకులు యీ దారుణాన్ని ఎట్లా వూహించగలరు? - మూర్ఖశిఖామణులు - ఉన్మాద పిశాచాలు అయిన వారి 'సాడిస్టు' చర్య దావానలమై నిలువునా దహించివేస్తుందని ఎట్లా అనుమానించగలరు. సభ్య ప్రపంచంలో - ఆధునిక మానవయుగం యిటువంటి ఘోరకలిని యింత పిసరు వూహించడం కష్టం. సికింద్రాబాద్ నుంచి - పాతిక కిలో మీటర్ల దూరంలో - యింకా చీకట్లు లోకాన్ని కౌగిలించుకోడం పూర్తి కాకమునుపే యీ ప్రపంచంలో వర్తమాన చరిత్రలో ఎక్కడా జరగని ఒక దారుణ దహనకాండ జరిగిపోయి జాతియావత్తుని తలదించుకొనేలా చేస్తుందని - మన చుట్టూరా యిటీవల జరుగుతున్న హింసాయుత దౌర్జన్యపూరిత ప్రదర్శనలు చూసిన తరువాత కూడా మనం వూహించలేకపోయాము! "పోగులగూడ" అనే చిన్న గ్రామం ప్రక్కగా పరిగెత్తే రైలుపట్టాల మీద ఒక అరవంద మంది ప్రయాణీకులను "ప్రేగులు ఎముకలు" గుట్టగా - మార్చి - మానవ చరిత్రకే తీరని కళంకంగా నిలిచిపోయే ఘోరకలి జరిగిపోతుందని హృదయమున్న వారెవ్వరూ అనుకోలేరు. కాని అటువంటి ఘోరహత్యాకాండ - మన రాజధాని శివారు ప్రాంతంలోనే జరిగిపోయింది.

కాకతీయ పాసింజెర్ రైలు బండీని త్రోవకడాకు - ఎవ్వరికి కావల్సిన చోట వారు నిలిపివేసి దిగిపోతూ వుంటారని విన్నాము. కాని యీ ఉన్మాద పైశాచిక దహనకాండ జరిగిన 9వ తేదీ సాయంకాలం - ఆ రైలు బండీలోని ఆఖరు 'బోగీలలో' నిస్సహాయంగా మంటల మధ్య కాలిమసి అయిపోతున్నప్పటికీ వారిలో ఎవ్వరూ ఆ రైలుని ఆపలేకపోయారు - దుండగులు దుష్టులు [వీరిని కసాయి వారనడం - కిరాతకులు అనడం ఘోర అపచారం - కసాయి వారు నరకడం తోటి మానవుల తిండి కోసం - కిరాతకుడు ఆకలేస్తేనే పిట్టని నేలకూలుస్తాడు] చెర్లపల్లి స్టేష

ఒరులేయని యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులు సంపాదకులు: శివలెంక శంభుప్రసాద్ (1938-1972)

ఎడిటోరియల్ ఎడ్వయిజర్ శివలెంక రాధాకృష్ణ ఎడిటర్. వీరాజీ ముద్రాపకుడు ప్రచురణకర్త శివలెంక నాగేశ్వరరావు

న్‌లో రైలుబండీ ఎక్కినప్పుడు ఎవ్వరూ అనుమానించకపోవడం చూడగా - ప్రయాణీకులంతా బేఫికర్‌గా యింటి ధ్యాసలో వున్నారు అని స్పష్టమవుతున్నది - అందులో మహిళలు -పిల్లలు - వృద్ధులూ ఉన్నారు - పేద వారున్నారు - వీరందరిని రైలు పెట్టెలో బంధించి - యింధన తైలంలో తడిపి - ఆ రైలు పెట్టెనే "చితి" గా మార్చి దగ్ధం చేయవలసిన అవసరం ఎవరికుంటుంది? వారు పైశాచికపిచ్చి వారే అయి వుండాలి? సిద్ధాంత వైరం వల్ల - జాతి వైరం మీద - యిటువంటి ఘోరకృత్యం చేయగల మనుషులుంటారా? కొంత కాలంగా మన దేశంలో చెలరేగుతున్న - పెట్రేగుతున్న దహనకాండలు - ఉద్యమాల పేరిట లూటీలు - దోపిడీలు మనం చూస్తూ గవర్నమెంటు మీద - గత్యంతరం లేక ఆశలు పెట్టుకున్నాం. శాంతి భద్రతల పరిరక్షణకి - ప్రజాస్వామ్య వ్యవస్థలో మొట్ట మొదట బాధ్యత. ఎన్నుకోబడిన ప్రభుత్వానిదేనని మనం ఎవ్వరికీ చెప్పలేని నిస్సహాయ స్థితిలో వున్నాం. బస్సులో భద్రత లేదు - రైలులో, విమానంలో ఎక్కడ ఏ విధంగా ఒక చోటు నుంచి మరో ప్రాంతానికి పెళ్లాలన్నా - గండం గట్టెక్కి గమ్యం చేరాల్సిందే తప్ప సాఫీగా చేయగల సదుపాయాలే లేవు మనకి -

ధరలు మండిపోతూంటే చూశాం - ప్రభుత్వ ఆస్తులుగా చెలామణీ అవుతున్న ప్రజల ఆస్తులు పరశురామప్రీతి అవుతూండగా లెక్కలు పెట్టుకుంటూ గమనిస్తున్నాం సిద్ధాంతాలు మట్టేని కొట్టుకుపోగా, వాటి పేరుతో పరస్పరం నాశనం చేసుకుంటున్న వర్గాలను చూశాం, మండల్ కమిషన్ మంటలలో కాలిపోతున్న యువతీయువకుల దుర్మరణాలను నిర్లక్ష్యం చేస్తున్న దౌర్భాగ్య కాలంలో వున్నాం. బంద్‌ల యిబ్బందులను - తలదించుకొని సహిస్తున్నాం - చివరికి దాదర్ ఎక్స్‌ప్రెస్‌లో జరిగిన అత్యాచారం మీద సినిమా కథలు కూడా అల్లగలిగాం కాని యీ ఉన్మాద బీభత్సకాండకు బరితెగించిన నరరూప రాక్షసుల చర్యను - రక్తపిపాసులను ఎవ్వరూ చివరికి - వారి అనుయాయులు కూడా హర్షించడం దాకా ఎందుకు? భరించలేరు కూడా - రైలు బండీలో "చైను" లాగి వాళ్లింటి గుమ్మంలో ఆపుకొని ఆగిపోయే వారున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఏరులై పారుతున్న యీ దేశంలో - నాడు దాదర్ ఎక్స్‌ప్రెస్‌ను కాని నేడు కాకతీయ రైలును కాని ఆపలేక పోయాం. సజీవంగా మనుషులు కాలి బుగ్గి అయిపోతూంటే ఎవ్వరూ ఆపలేని కర్మభూమి యిది - ప్రజాధనాన్ని విచ్చలవిడిగా వ్యయం చేసి రకరకాల రక్షక భటులను పోషిస్తున్న గవర్నమెంటు యింత వరకు యే "టాస్క్‌ఫోర్స్" నీ కూడా సరిగా వుపయోగించుకోలేకపోయింది!

తలుపులు మూసేసి - పెట్రోలుతో తడుపుతున్నప్పుడు సామన్లను మాత్రం కాల్చి తమను బయటకు దింపి - నిప్పు పెడతారు అనుకొని వుంటారు అమాయక ప్రయాణీకులు - బస్సు దహనకాండ లాంటిదే యిదీ అయి వుంటుంది అని భావించి వుంటారు. కాని లాగటానికి గొలుసు లేని ఆ కంపార్ట్‌మెంటులో బంధించి అందర్నీ కాల్చి బూడిద చేస్తారని అనుకొని వుండరు. ఇది మా చర్య కాదన్నారు "రాడికల్స్" - యిది మాది కాదనే అందరూ అంటున్నారు - అయితే యీ ఉన్మాద చర్యకు కారకులెవ్వరు?

మృతుల కుటుంబాల కన్నీరు; హృదయగాయం; మాన్పగల శక్తి ఎవ్వరికున్నది? ప్రభుత్వం న్యాయవిచారణ ఉత్తర్వులు జారీ చేసింది. అది అవసరమే కాని యీ విచారణ పూర్తి అయ్యేసరికి యీ ఉన్మాదుల జాడ దొరికే సరికి ఎంతో కాలం పట్టకూడదు.

ఈ మాదిరి 'సాడిస్టు' చేష్టలకు మరికొందరు బలికాక మునుపే మేలుకొని యీ ఉన్మాద వాదులను పట్టి ప్రజల ముందు పెట్టాలి - చూయింగ్ గమ్ నములుతూ వెండి తెర మీద ఘోరకలి దృశ్యాలు చూసే సంస్కృతి - నంబరపడిపోతూ "పెర్వర్షన్స్"ని అచ్చులో చదవటాన్ని ప్రోత్సహించే ఔదార్యం మనది. కాని అట్టి సోకాల్డ్ ప్రగతి కాముకులు కూడా యిటువంటి పిచ్చికి ప్రేరణ కాగల అన్నిరకాల బలహీనతలను నిర్ద్వంద్వంగా ఖండించాల్సిన 'కళంకం' యిది. దోషులను పట్టగలగాలి - దోషానికి దోహదించే నానా రకాల ధోరణులను విద్యావైజ్ఞానిక రాజకీయ వాణిజ్యరంగాలన్నింటా - కలుపు మొక్కలను ఏరివేసినట్లు ఏరివేయాలి. ఉద్యమాలు - ఉన్మాదాలు రెండు వేర్వేరు అర్థాలు గల మాటలు - వీటికి అర్థంలో భావంలో ఆచరణలో ఎట్టి సారూప్య సామ్యాలు వుండరాదు అని అందరూ గ్రహించాలి.

[12-10-'90]

# అందరినీ ఆనందడోలికలలో అలరించే దీపావళి...!

శరన్నవరాత్రులతో ప్రారంభించిన ఆశ్వీయుజ మాసం దీపావళి ఉత్సవాలతో అంతం అవుతోంది. దేశ వ్యాప్తంగా భారతదేశంలోని



హిందువులందరూ చేసుకొనే పండుగల్లో దీపావళి ఒకటి. కొన్ని ప్రాంతాలలో నాలుగు రోజుల పండుగగాను, మరికొన్ని ప్రాంతాలలో అయిదు రోజుల పండుగగాను చెప్పబడుతున్నా, ఆంధ్రాలో మాత్రం నరక చతుర్దశి, దీపావళి అమావాశ్య రెండే ముఖ్యమైన దీపావళి పండుగ రోజులు.

ఉత్తరాదిన దీపావళి లక్ష్మిపూజగాను, వంగదేశంలో కాళీ పూజగాను, దక్షిణాదిన రావణవధానంతరం శ్రీరాముడు తిరిగి అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడైన పండుగగాను, లక్ష్మిపూజగాను భావిస్తారు.

నరకుని సంహారాన్ని సూచించే పండుగ నరక చతుర్దశి. మర్నాడు నరకుని సంహారానంతరం లక్ష్మీదేవి రాకను ఉద్దేశించి దీపాలను దీప మాలికలుగా అలంకరించి ఆ దేవిని ఆరాధించడమే దీపావళి.

## వేడుకలు : వినోదాలు

దీపావళి వేడుకలలో మొదటిది నరకాసుర దహనం. త్రయోదశి నాటి రాత్రే పిల్లలు గడ్డితోను, కర్రలతోను, కాగితాలతోను భయంకరంగా కనిపించే నరకాసురుని బొమ్మను తయారు చేసి వుంచుకుంటారు. తెల్లవారు ఝామున లేచి ఈ నరకాసుర బొమ్మను వూరేగింపుగా వూరి బయటికి తీసుకువెళ్ళి దహనం చేసి, వచ్చి, తలంటు స్నానాలు చేసి, కొత్త బట్టలు కట్టుకొని ఫలహారాలు ఆరగిస్తారు. ఆ రోజు టపాసులు కాల్చుకోవడం బాలలకు అమితోత్సాహమైన కార్యక్రమం. పెద్దలు వారి ఆనందాలలో పాలు పంచుకుంటారు. ఆ రోజు రాత్రి తారాజువ్వలు, చిచ్చుబుడ్లు, మతాబులతోను పట్టపగలుగా వెలిగిపోతుంది.

ఇప్పుడయితే ఇంతింత ఖర్చుపెట్టి టపాకాయలు బజార్లో కొంటున్నారు గాని వెనుకటి వారు తామే బాణాసంచాని గంధకం, సూరేకారం లాంటి ముడి పదార్థాలు తీసుకు వచ్చి ఇంట్లోనే స్వయంగా చేసుకునే వారు. అందువల్ల వారికి తక్కువ డబ్బుకి ఎక్కువగా వచ్చేవి. తామే స్వయంగా తయారు చేసుకున్నామనే తృప్తి వారికి మిగిలేది. పిల్లలు, పెద్దలు కూడా వేడుకగా చేసుకునే పండుగ దీపావళి.





## వైజ్ఞానికపరంగా...

సైన్సు పరంగా చూసుకున్నా ఆశ్వీయుజ, కార్తీక మాసాలలో వర్షాల మూలంగా దోమలు, పురుగులు మొదలైన క్రిమికీటకాలు ఎక్కువగా వుంటాయి. ఇప్పుడయితే ఇన్ని రకాలయిన క్రిమి సంహారక మందులొచ్చాయి గాని ఆ కాలంలో యిన్ని మందులు లేవు. అందువల్ల ఆ కాలంలో బాణాసంచా వేడుక రూపంలో సూరేకారం, గంధకం వంటి క్రిమిసంహారక పదార్థాలతో కూడిన టపాకాయలను కాలిస్తే దోమలు, మొదలైన కీటకాలు నశించి పోతాయనే ఉద్దేశంతో మన పూర్వీకులు దీపావళి సందర్భంగా బాణాసంచా వేడుక ఆనవాయితీగా పెట్టారేమో! అనిపించక మానదు.

– ప్రమీల

# ద్రౌపది వ్యాస రచన పోటీలో "గోడ గడియారం"
# బహుమతి గెలుచుకున్న ఉత్తమమైన వ్యాసం!

**జూద మందిరంలో "ద్రౌపది"కి జరిగిన అవమానానికి ముఖ్య కారకులు ఎవరు?**

జూద మందిరంలో ద్రౌపదికి జరిగిన అవమానానికి ముఖ్య కారకులు ఎవరూ అన్న ప్రశ్నకు ముందుగా అందరి మదిలో స్ఫురించేది దుర్యోధన,దుశ్శాసనులే. కాని తరచి లోతుగా ఆలోచింప జేస్తే ఈ ప్రశ్నకు సరి అయిన సమాధానం సేకరించ వచ్చును. మొదటిది జూదంలో రాజ్యాన్ని తన తమ్ముళ్ళనే పణంగా పెట్టడమే గాక అగ్ని సాక్షిగా వివాహ మాడిన అబలకు అండగా నిలబడవలసిన భర్త భార్యను కూడ పణంగా పెట్టి ఓడిపోయి, పరాధీనం గావించిన ధర్మరాజు ధర్మాన్ని వేలెత్తి చూపవలసి వస్తుంది. అది మాయాజూదం గాని ఏమైనా గాని వారు జయించుకున్న సొత్తు అయిన ద్రౌపదిపై అన్ని అధికారాలు పొంది వారి ప్రతీకారం తీర్చుకొనుటకు అవమానించే అవకాశం దుర్యోధ నాదులు పొంద గలిగారు. అంటే ద్రౌపది పొందిన అవమానానికి ధర్మరాజు ఒకవిధంగా కారకుడవుతే దుర్యోధ నాదులు మరొక విధంగా కారకులు కాగలిగారు. అందరికంటె ప్రబలమైన కారకుడు అసలైన సూత్రధారుడు ద్రౌపదికి జరిగిన అవమానానికి ముఖ్య కారకుడు ధృతరాష్ట్రుడు.

## రక్షణ యివ్వగల వారి చేతనే అవమానం!

ధృతరాష్ట్రుడు హస్తినా పురానికి రాజు. రాజు సింహాసనం అధిష్టించడం అంటే ప్రజల కష్ట సుఖాలను పరిశీలించి పరీక్షించి వారికి తగిన రక్షణ యివ్వగలగాలి. లేనినాడు అతడు రాజు అన్న పదాన్నే అవమాన పరచినట్లు లెక్క. అటువంటిది నిండు సభలో తన తమ్ముడి కోడలును అంత అసభ్యంగా తన కుమారులు అవమానించుటకు పూనుకుంటుంటే ఏమాత్రం కూడ రాజుగా ఉండి పుత్ర వ్యామోహంతో అరికట్టలేక పోయాడు. అది పుత్ర వ్యామోహమా లేక రాచరికపు రాక్షసత్వమా? అతడు నేత్ర హీనుడే కావచ్చు కాని హృదయ హీనుడు కాగలగడం ఆశ్చర్య దాయకం. నిండు సభలో అబల ఆక్రందనను కూడ లెక్కచేయక వివస్త్రగా చేయచూసిన అసభ్యకరమైన కార్యంను అరికట్టలేని రాజు నేత్రహీనుడితో పాటు జ్ఞానహీనుడని చెప్పవచ్చును. శ్రీకృష్ణ భగవానుడే ద్రౌపదికి రక్షణ యివ్వగలిగి ఉండకపోతే ద్రౌపది గతి ఏమయ్యేది? ఇంతటి విహ్వామైన దుర్ఘటన జరుగుటకు మూలకారకుడు ధృతరాష్ట్రుడనే ముమ్మాటికి నొక్కి చెప్పవచ్చును.

**ద్రౌపదికి కర్ణుడి మీద కోపం ఎక్కువా? దుర్యోధనుడి మీద కోపం ఎక్కువా?**

ద్రౌపదికి కర్ణుడి మీదే కోపం ఎక్కువ. తమకు జరిగిన అన్యాయాలకు కార్య ప్రేరేపణ కర్ణుడవుతే కార్యకర్త దుర్యోధను డయ్యాడు. కర్ణుడు తన ప్రియభర్త అయిన అర్జునితో సమాన విలుకాడు. ఏనాటికైనా అర్జునికి కర్ణుని వలన అపాయం చేకూరవచ్చుని ద్రౌపది భయం. ఆ నాడు నిండు సభలో మాలో ఏ ఒక్కరినైనా నీ ఆరవ భర్తగా స్వీకరించమని అనిన కర్ణుని కఠోర పదాలు ఏనాటికి మరువలేను. కర్ణుని సలహా సహాయం లేకపోతే దుర్యోధనుడు యింత విజృంభించేవాడు కాదు. ఇన్ని కారణాలకు కారకుడైన కర్ణుడంటేనే ద్రౌపదికి కోపం ఎక్కువని చెప్పవచ్చును.

—సామినేని సావిత్రి, హైదరాబాద్

### శ్రీమతి సామినేని సావిత్రి పరిచయం



'ద్రౌపది' వ్యాస రచన పోటీలో 'గోడ గడియారం' బహుమతి పొందిన వ్యాస రచయిత్రి శ్రీమతి సామినేని సావిత్రి జన్మస్థలం ఒరిస్సాలోని బరంపురం.

వివాహానంతరం ఆంధ్రకు వచ్చి ప్రస్తుతం బరువు, బాధ్యతలు అన్నీ తీరాక హైదరాబాద్‌లో వుంటున్నారు. భార్యగా, ముగ్గురు బిడ్డల తల్లిగా బాధ్యతలు నిర్వహిస్తున్నా రచనా పఠనానికి ఆమె మనసు పరుగులు తీస్తుందట. శ్రీ యండమూరి రచనలన్నా శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి రచనలన్నా ప్రీతి.

ఇది వరకు ఆంధ్రసచిత్ర వారపత్రికలో దీపావళి వ్యాసరచన పోటీలో ప్రథమ బహుమతి పొందారు. తన ఈ రచనలకు భర్త, పిల్లల ప్రోత్సాహం ఎంతో వుందంటున్నారు శ్రీమతి సామినేని సావిత్రి.

# ద్రౌపది వ్యాసరచన పోటీలో

# ట్రాన్సిస్టర్ బహుమతి గెలుచుకున్న

# ఉత్తమమైన వ్యాసం!

## భీముడంటేనే ప్రీతి

ద్రౌపదికి ఐదుగురు భర్తలలో ఎవరిమీద మక్కువ ఎక్కువ?

స్త్రీ తన పురుషునిలో కోరుకునే సర్వ లక్షణాలు సంతరించుకున్న పురుష పుంగవుడు భీముడు. పాండవులందరిలో శారీరకముగానే గాక రూపమున కూడా మిన్నందినవాడు. దుర్యోధనుడు ద్రౌపదిని తన తొడలపై కూర్చుండుమని నిండు సభలో అవమానించేడు. అట్టి సమయాన పాండవులలో భీముడు తక్క తక్కిన వారెవ్వరూ కిక్కురు మనలేదు. భీముడూరకొనలేదు. యుద్ధమున దుర్యోధనుని తొడలు విరుగ గొట్టి, ద్రౌపదికి కలిగిన అవమానమును తీర్చ ప్రతిజ్ఞ చేసేడు. సౌగంధిక పుష్పముల తెచ్చి ఇమ్మని ద్రౌపది కోరింది. ప్రాణములకు తెగించి, వాటిని తెచ్చి ఆమెకిచ్చి ఆమెకు సంతోషము కలిగించేడు. హిడింబుని బారి నుండి అందరిని కాపాడిన వీరాధి వీరుడు. అజ్ఞాతవాస కాలమున కీచకుని కబంధ హస్తముల పడ్డది ద్రౌపది. ఆ సమయమున తన శీలమును భీముడు మాత్రమే కాపాడ గలిగిన వాడని ద్రౌపదికి తెలుసు. అందుకే భీముని అండతోనే తన శీలమును కాపాడుకొనగలిగింది.

ఈ విధముగా తన నన్ని విధముల నాదుకొని, తన రక్షణ భారమును వహించిన భీముని మీదనే ద్రౌపదికి మక్కువ ఎక్కువ.

ద్రౌపదికి కర్ణుడు మీద కోపం ఎక్కువా? దుర్యోధనుడు మీద కోపం ఎక్కువా?

అవకాశం దొరికినప్పుడల్లా ద్రౌపదిని చులకన . భావంతో చూసేవాడు అవమానించుటకు వెనుకాడే వాడుకాడు. ఏక వస్త్రనని మొరపెట్టుకున్నా, పెదచెవిని పెట్టి కురువృద్ధులంతా వున్న సభకు ఈడ్పించి వలువలిప్పింప బూనిన కిరాతకుడు మయసభ వింతలు నవ్వించుట సహజము. ఆ సభలో తన్ను జూచినవ్వినదను నెపమున ద్రౌపది నవమానింప తలపెట్టిన తుచ్చుడు. తన్ను, తన భర్తల పదరాని పాట్లు పెట్టిన పగతుడు. అజ్ఞాతవాస కాలము ముగిసిన తరువాతనే తాము బయటపడ్డా, ముందే బయట పెట్టినట్లు వాదించిన దుష్టుడు క్రౌర్యము మూర్తీభవించిన క్రూర కర్ముడు దుర్యోధనుడు. అట్టి దుర్యోధనుడు మీద ద్రౌపదికి కోపము ఎక్కువనుట కెట్టి సందేహమూ లేదు.

—వింజమూరి వెంకటపార్వతీశం,
వరంగల్

## ద్రౌపది కష్టాలు విలక్షణమైనవి!

ద్రౌపదికి ఐదుగురు భర్తలలో ఎవరిమీద మక్కువ ఎక్కువ?

అర్జును డంటేనే ఆమెకు మక్కువ ఎక్కువ. ఈ విషయం పాండవుల 'మహాప్రస్థానం'లో విదితమైంది. అతడికోసం జీవితంలో పెద్ద త్యాగం చేసి మిగిలిన నలుగురు పాండవులతో సంబంధం తన ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా పంచుకోవలసి వచ్చింది. ఆమె పలుకులలోనే! "నీకు తెలుసా విజయా! కేవలం నిన్ను దక్కించు కోవడానికే అమాయకంగా మీ అమ్మ తన కొడుకు లయిదుగురికీ నేను భార్యను కావాలన్నా ఒప్పుకున్నాను. నా ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా మూర్ఖంగా మీ అయిదుగురూ నన్ను పంచుకొన్నారు. మిమ్మల్ని మందలించ డానికి బదులు ఇదంతా విధి నిర్ణయమని వ్యాసుడు తీర్పు చెప్పాడు. నన్ను కన్న నా తండ్రి అదంతా నిజమే అనుకొని నేనేదో దేవకార్యం సఫలం చెయ్యడం కోసం ఉద్భవించిన మహనీయ మూర్తినని భ్రమసి నా గొంతు కోశాడు. నిజం చెప్పు అర్జునా— వంతుల ప్రకారం అయిదుగురితో కాపురం చెయ్యడం ఏ ఆడదానికైనా సహజ మంటావా? .......

నీకోసమే పుట్టి, నీకోసమే కలలుకని, నిన్ను రప్పించు కోవటం కోసమే స్వయంవరాన్ని, మత్స్య యంత్రాన్ని ఏర్పాటు చేసుకుంటే నీతోపాటు నీ అన్నలూ, తమ్ముళ్ళూ కూడా నన్ను బలవంతంగా చుట్టేసు కున్నారు. ప్రేమించే ఆడదాని మనసు చాలా ఇరుకు అర్జునా! అందులో ఒక్కడికే చోటు వుంటుంది. అలాంటిది ఒక్కరి చోటులో అయిదుగుర్ని ఇముడ్చు కొన్నాను" అన్న మాటతో స్పష్టమైంది. కృష్ణ పడిపోయిందన్న భీముని మాటకు

ద్రౌపది వ్యాస రచన పోటీలో "చిన్న కెమెరా" బహుమతి పొందిన వ్యాస రచయిత శ్రీ బొడ్డపాటి రాజేశ్వరమూర్తి బి.ఎ.బి.కాం., బందరులో కో ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారుగా చేస్తూ 1989లో ఉద్యోగ విరమణ చేసారు. వీరు గేయ రచయితగా ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకు సుపరిచితులే. వీరి రచనలు వివిధ పత్రికలలో పడ్డాయి. వీరు నాటకాలు వ్రాయడమే గాక స్వయంగా నటించారు కూడా. తను రచించిన 'ఎదురు చూడని పెళ్లి కొడుకు' నాటకంలో తానే నటించారు. అంతేగాక "ఇందిరా వసంతం" నాటకంలో నటించడంతో పాటు దర్శకత్వం కూడా వహించారు. "కాళిదాసు" నాటకంలో నటించారు.

పుస్తకాలు విరివిగా చదవడం, సాంఘిక ప్రయోజనం కొరకు రచనలు చేయడం వీరి హాబీ. ఆంధ్రసచిత్ర వారపత్రిక వారికి,శ్రీ నాగేశ్వరి పబ్లికేషన్స్ వారికి వీరు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నారు.



శ్రీ బి. రాజేశ్వరమూర్తి పరిచయం

# ద్రౌపది వ్యాస రచన పోటీలో "చిన్న కెమెరా" బహుమతి గెలుచుకున్న ఉత్తమమైన వ్యాసం!

ధర్మరాజు "పడనీ" అని "అర్జునుడంటేనే ఇష్టం తనకు. ఆ పక్షపాత బుద్ధివల్లే ఆవిడ సుకృతాలు ఫలించలేదు" అన్న మాటల్లో అర్జునుడంటేనే మక్కువ అని రూఢి అయింది. ప్రయాగవారన్నట్టు ద్రౌపది జీవన విషాదం ధర్మరాజుకు అర్థమైతేగా అన్నది అక్షరాలా సత్యం.

## ద్రౌపది – కుంతిలలో పోలిక?

మహాభారత కథలో ఈ ఇద్దరూ అంతులేని కష్టాలు పడ్డారు. ద్రౌపది ఆఖరిలో మహాప్రస్థానంలో మరణిస్తే ఆమెకు ముందుగానే కుంతి తపస్సు కొరకు అరణ్యాలకు వెళ్లి అగ్ని కీలలలో ఆహుతైంది. ధర్మరాజుకు పట్టాభిషేకం జరిగి, అశ్వమేధయాగం పూర్తి చేసి అనంతభోగాలు అనుభవించ వలసిన కాలంలో కుంతి తపోవనానికి వెళ్ళడం త్యాగం కదా! ఆమెను మించిన త్యాగం ద్రౌపది చేసింది. ఎలాగంటే ఒక్క అర్జునుడి కోసం మిగిలిన నలుగురు పాండవులతో కూడా జీవితం పంచుకొన్న మహాత్యాగి. కుంతి పడ్డ కష్టాలు వేరు. కాని ద్రౌపదికి నిండు కొలువులో ఘోర అవమానం, వస్త్రాపహరణం, అడుగడుగునా ఎన్నో కష్టాలు ఎదురైనాయి. కుంతి చనిపోయిందన్న వార్త నారదుని ద్వారా విని ధర్మరాజు ఆమె అస్థికా నిమజ్జనం చేసి కర్మకాండలు నిర్వహించాడు యధా విధిగా. మహాప్రస్థానంలో ధర్మజుడు ద్రౌపది పడిపోయిందని, భీముడు చెప్పగా విని "పడనీ" అని నిర్లిప్తంగా



అని తమ అందరితో కష్ట సుఖాలు అనుభవించిన ద్రౌపదిని "అర్జునుడంటే ఇష్టం ఆ పక్షపాత బుద్ధివల్ల ఆవిడ సుకృతాలు ఫలించ లేదు" అన్న వాక్యంతో నిందించడం ద్రౌపదిపై మనకు కుంతికంటే ఎక్కువ సానుభూతి, ప్రేమ కల్గుతాయి. "ద్రౌపది జీవన విషాదం ధర్మరాజుకు అర్థమైతేగా నిలబడి రెండు కన్నీటి చుక్కలు వదలడానికి" అన్న రచయిత ఆఖరి వాక్యాలు ఆమెను కుంతికంటే వెయ్యి రెట్లు ఉన్నత పథంలో నిలబెట్టాయి. ఉత్తర బిడ్డడిని రక్షించడంలో కృష్ణుణ్ణి ప్రాధేయ పడిన తీరు ద్రౌపది సౌశీల్యము, ప్రియత్వం, ఉగ్గడింప జేస్తాయి (ఉప పాండవులు అశ్వత్థామ ద్వారా ఘోరంగా, కసాయి తనంగా వధింప బడినా స్వల్ప కాలంలోనే ఆ బాధను మరవ గల్గిన సాధ్వి ద్రౌపది) (పిల్లవాడి ప్రాణాలు రక్షణకై తహతహ). కుంతి కష్టాలు కంటే ద్రౌపది కష్టాలు విలక్షణం, ఏ ఆడదానికీ రాకూడనివి అన్న వాక్యాలు రూఢి జేస్తూ ప్రయాగ వారు 'ద్రౌపదిని' హైలైట్ చేశారు.

–బొడ్డపాటి రాజేశ్వరమూర్తి,
మచిలీపట్నం–2

# ద్రౌపది వ్యాస రచన పోటీలో "బ్రీఫ్‌కేస్" బహుమతి గెలుచుకున్న ఉత్తమమైన వ్యాసం

## కుంతీ, ద్రౌపదుల జీవనవిధానాల సామ్యం

జూద మందిరంలో ద్రౌపదికి జరిగిన అన్యాయానికి ముఖ్య కారకుడు ధృతరాష్ట్రుడు. ఎందుచేత ననగా అతడు రాజు. అతడికి సర్వాధికారాలు ఉన్నాయి. అతడు తలుచుకుంటే ఆ అన్యాయాన్ని నిరోధించ గలడు. అతడి నేత్రాలు పుట్టుకతో గుడ్డివే! కాని, అతడి మనోనేత్రం మాత్రం పుత్ర వ్యామోహంతో, రాజ్య కాంక్షతో, పక్షపాతంతో స్వార్థంతో, పాండురాజు ఎడల, పాండవుల ఎడల అసూయతో గుడ్డిదయింది. అందుకే గురువులు కృపాచార్యుడు, ద్రోణాచార్యుడు చేసిన బోధలు గాని, పెద తండ్రి భీష్మలవారు చెప్పిన మాటలు గాని అతడి తలకెక్కలేదు. విదురనీతి బోధ కూడా అతడిని మార్చలేక పోయింది. పుత్ర వాత్సల్యానికే అతడు ప్రాధాన్యత నిచ్చాడు. అందుకే దుర్యోధన, దుశ్శాశన, కర్ణ, శకునిలను అదుపులో పెట్టలేక పోయాడు. ద్రౌపది శాపానికి భయపడి తిరిగి రాజ్యాన్నిచ్చాడే తప్ప లేకపోతే ఇచ్చివుండేవాడు కాదు. అందుకే తిరిగి జూదానికి పిలిపించి అన్యాయమని తెలిసి పాండవులను అడవుల పాలు చేశాడు. అతడు నేత్ర హీనుడే కాదు. బుద్ధి హీనుడు కూడా అనడంలో సందేహం లేదు.

వర ప్రభావంతో ఐదుగురు భర్తలను శాశ్వతంగా పొందింది ద్రౌపది. కుంతికి శాశ్వతంగా ఒక భర్తే (పాండురాజు) అయినప్పటికీ సంతానం కోసం మంత్ర పఠనంతో మరొక నలుగురిని (సూర్య, యమ, వాయు, ఇంద్రులను) ఆహ్వానించింది కాబట్టి మొత్తం ఆమెకు కూడా ఐదుగురు భర్తలని చెప్పవచ్చు.

ద్రౌపదికి సంతానం ఉపపాండవులు ఐదుగురు. కుంతికి అసలు సంతానం కర్ణుడితో కలిసి నలుగురే. అయినప్పటికీ కర్ణుడు పుట్టిన వెంటనే దూరమవడం, మాద్రి సుతులైన నకుల సహదేవులని తన బిడ్డలుగానే పెంచడం వలన ఆమెకు పాండవు లైదుగురు సంతానం. లాక్షా గృహదహనం తర్వాత అడవుల పాలైన పాండవులకి కుంతి అండగా నిలిచింది.

మాయా జూదంలో ఓడి అడవుల పాలైన పాండవులకి ద్రౌపది తోడు నీడై సంచరించింది.

కుంతి సహనశీలి. అందుకే లాక్షా గృహదహనాన్నీ, భీముడికి దుర్యోధనాదులు విషం పెట్టడాన్నీ, నీటిలో త్రోయడాన్నీ అన్నిటినీ సహించ గలిగింది అంతరంగంలో ఆవేదన నిండినా.

ద్రౌపది ఆత్మాభిమాని. ఆమె అన్యాయాన్ని చూస్తూ ఊరుకోలేదు. అవమానాన్ని సహించలేదు. అందుకే తన కురులను పట్టి సభకి ఈడ్చిన దుశ్శాసనుడి రక్తంతో తప్ప తన కురులను ముడివేసుకొనని శపథం చేసి తీర్చుకుంది.

"నన్ను ఓడి తనను ఓడెనా? తను ఓడి నన్ను ఒడ్డెనా?" అని ధర్మరాజుకే ధర్మ సంకటపు ప్రశ్న వేసిన ఆత్మస్థైర్యం ద్రౌపదిది.

కుంతి, ద్రౌపది ఇద్దరూ కృష్ణ భక్తులే! ఇద్దరికీ కృష్ణుడిపై భక్తి, గౌరవం, ఆరాధన ఉన్నాయి:

కుంతి కన్యగా కన్న సంతానం కర్ణుడికి దూరమై, పాండవులకి పదమూడు సంవత్సరములు దూరమై విలపించింది.

ద్రౌపది ఉపపాండవులకి శాశ్వతంగా దూరమై విలపించింది. పోల్చి చూస్తే ఇలా చాలా కనపడతాయి ద్రౌపదికీ, కుంతికీ పోలికలు

—ఆర్. ఎస్. హైమవతి, మద్రాసు



శ్రీమతి ఆర్. ఎస్. హైమవతి

### పరిచయం

ద్రౌపది వ్యాస రచన పోటీలో 'బ్రీఫ్‌కేస్' బహుమతి పొందిన వ్యాస రచయిత్రి శ్రీమతి ఆర్. ఎస్. హైమవతి, బి. ఎ., ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకు సుపరిచితులే. పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురం తాలూకా భీమలాపురంలో 15-8-'42న జన్మించారు.

శ్రీమతి హైమవతి భర్త శ్రీ రెట్టిగంటి సీతారామ సత్యనారాయణరావు ప్రస్తుతం యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్సు కంపెనీ హెడ్ ఆఫీసులో మేనేజరుగా చేస్తున్నారు. ఈ దంపతులకు ముగ్గురు సంతానం.

రేడియోలో ప్రసారమైన కథలు, నాటకాలు వివిధ పత్రికలలో వచ్చిన కథలు, మినీ కథలు, వ్యాసాలు, గేయాలు అన్నీ కలిపి అరవైకి పైగా వెలుగు చూశాయి.

ఈ బహుమతులు నాగేశ్వరి పబ్లికేషన్స్, విజయవాడ వారు సమర్పించారు

# భారత మహా కావిత్రేయం

## భాగవతుల సుబ్రహ్మణ్యం

సకల ప్రాణికోటికీ జవ జీవాలను, శక్తి ఉత్సాహాలను ప్రసాదించే సూర్య భగవానుని ఆగమన సూచకంగా తూర్పు దిక్కున అరుణ కాంతులు ప్రాతః కాలపు చిరుచీకట్లను పారద్రోలుతున్నాయి.

ప్రభాత ప్రశాంతతకు చిరు అంతరాయం కలిగిస్తూ, కోటలో ంచి తొలిఝాము గడిచినట్టు తెలిపే ఘటికారావం వినవచ్చింది.

ప్రజలు తమ తమ విధివిహిత కార్యక్రమాల నిర్వహణకు ఆయత్త మవుతున్నారు.

ఒక్కసారిగా ప్రకృతిలోకి చైతన్యం ప్రసరించినట్టు పశు పక్ష్యాదులు జాగృతమయ్యాయి.

పావన గౌతమీ నదిలో చిరు కెంజాయ కాంతులు ప్రతిఫలించి జలాలు మిలమిల మెరుస్తున్నాయి.

నదీ తీరాన జంబూ, చూత వనాల్లో పక్షుల సవ్వడి అధికమైంది.

వాటితో పోటీపడుతూ, శ్రావ్యంగా సుమధురంగా సుస్వర మొకటి రసాతలాన్నుంటే అతిశయంతో ఆ రసాల వనాంతర్భాగంలో ంచి వినవస్తోంది.

ఆ స్వరం ఓంకార సహిత వేదనాదం....

అనునిత్యం వేదపఠనాన్ని ఆకర్ణించే భాగ్యానికి నోచుకున్న ఆ తరు సంపదదే అదృష్టం... ఆ వేదోచ్చారణతో నే భగవధ్యానం కూడా....

"త్రైలోక్య చైతన్యమయాద్యదేవ
శ్రీనాథ విష్ణోభవదాజ్ఞయైవ!
ప్రాతః సముత్థాయతవ
ప్రియార్థం
సంసార యాత్రా
మనవర్తయిష్యే!!"

ఆ స్వరకర్త పట్ల ప్రకృతికి సహితం భక్తి ప్రపత్తులున్నాయా అన్పించేట్టు నీటిమీదుగా తేలుతూ వస్తున్న పిల్లగాలులు ఒక విధమైన ఆహ్లాదవీచికలను విసురుతున్నాయి.

లేత ఎరుపు కలిసిన పచ్చని దేహకాంతితో ప్రకాశిస్తున్న వాడు, సువర్ణ హస్త ఘంటాకంకణ కుండలధారి, నడుముకు ఉత్తరీయం చుట్టిన పట్టు వస్త్రం, నున్నని గుండు, గోష్పాదమంత పిలక, అంతపొట్టీ పొడుగూ కాక మధ్యస్థంగా వున్న ఒక దివ్య తేజో విరాజితుడు ఆ అరుణోదయ సమయాన స్నానార్థం మామిడితోపు మధ్య సన్నని కాలిబాట గుండా పయః గోదావరీ తీరానికి విచ్చేస్తున్నాడు.

అవిరళ జపహోమ తత్పరుడు, ఋషితుల్యుడు, నిత్యసత్య వచనుడు, కారణజన్ముడు, ఉభయ భాషాభిజ్ఞుడు, రచనాభి శోభితుడు అయిన ఆ మహానుభావుడే నన్నయ భట్టారకుడు. చాళుక్య భూపతి రాజరాజనరేంద్రుని ప్రస్తుత రాజధాని రాజమహేంద్రి ఆయన నివాసము.

వసంతాగమ చైత్రమాస ఉషోదయ వేళ...

గోదావరిలో నీరు కొద్దిగానే ప్రవహిస్తోంది. పూర్ణ ప్రవాహం లేని కొన్ని చోట్ల ఇసుక మేటలున్నా, స్నాన సంధ్యాద్యనుష్ఠానాలకు ఆటంకంగా మాత్రం లేదు.

దక్షిణగంగగా వినుతికెక్కిన గోదావరిలో రోజూ స్నానం

చేసి, నిత్యపూజా విధి నిర్వర్తించాకనే ఇతర కార్యక్రమాల నిర్వహణకు నన్నయ సమాయత్తమయ్యేది.

కాని గతమాసం రోజులుగా ఏదో తెలియని కలవరం...

ఏదో ప్రశాంత రాహిత్యం...

అది భౌతిక సంబంధి కాదు. ఆత్మసంబంధి....

ఏదో ఒక అంతః ప్రేరణ.... అదేమిటో అస్పష్టం....

అలాగని చిత్త చాంచల్యం కాదు. ఐహిక వాంఛానురక్తి కాదు....

తనలో తనకే తెలియని ఒక విచిత్రావస్థ....

ఇటీవల ఫాల్గుణ పూర్ణిమ రోజున, ఈ అకారణ చిత్త విభ్రమ కారణమేమిటో దాని అంతు చూడాలనుకున్నాడు. ఏకాగ్రచిత్తంతో భగవధ్ధ్యాన నిమగ్నుడయ్యాడు

లిప్తపాటు కాలంలో తనలో ఏదో తళుక్కున మెరిసిందో తటిల్లత. మళ్లీ అంతలో నే మాయం....

షోడశ బీజ సంపుటిని అతడాక్షణంలో దర్శించాడు.

సంహితాభ్యాసుడు, మత్యమరాధిపాచార్యుడు అయిన నన్నయ శ్రీవిద్యోపాసకుడు. శ్రీవిద్యకు నామాంతరం చంద్ర విద్య. షోడశ కళాత్మకపూర్ణ పురుషుడు చంద్రుడు. పూర్ణిమ రోజున ఈ షోడశ బీజ సంపుటిని ధ్యానంలో రేఖా మాత్రంగా హృదయంతో దర్శించడం శుభ సూచకమే గాక, త్వరలో ఒక కార్యభార నిర్వహణకు కూడా సూచిక.

తనవల్ల కాదగ్గ మహాకార్య కరణం ఇంకేముంది?

కవిగా తానిప్పటికే సుప్రసిద్ధుడు. చౌడేశ్వరీ విలాసం, ఇంద్ర విజయం, రాఘవాభ్యుదయం వంటి గ్రంధాలకు కృతికర్తగా తన పేరు ఇటు కర్ణాట రాజ్య సరిహద్దు నుండి, అటు ఉత్కళ రాజ్యపు ఎల్లలను తాకుతోంది.

ఇక చంద్రవంశ క్షత్రియుడైన చాళుక్య ప్రభువు రాజరాజ నరేంద్రుల వారికి సాక్షాత్తూ 'కుల బ్రాహ్మణుడై' విశేష మన్నన లందిన వాడు తాను. వారి కుల





విద్య అయిన చంద్రవిద్యని ఆరాధించి, ఉపాసించి సంరక్షించే సుబ్రాహ్మణుడు – అనురక్తుడూనూ. పితృ పితామహ క్రమంగా తర తరాలుగా వచ్చిన మంత్రిత్వం ఉండనే వుంది. ఇక ఏ విధంగా చూసినా తన వల్ల జరగనున్న ఆ సత్కార్య మేమిటో ఊహకు అందడం లేదు. కాని ఒక్కటి మాత్రం స్పష్టం. ధ్యాన నిష్ఠలో తనకా పూర్ణ శారదరాత్రి షోడశ బీజసందర్శనం జరగడం అనేది శాశ్వత యశో కారక మైన, కీలక మైన భావి బృహత్కార్యా చరణకు మూలం. అది నిస్సంశయం....

కానీ, అది ఏమై వుండునో కదా!...

కానున్నది కాక మానదు... పోనిమ్ము!...

...–ఇలా ఆలోచిస్తూనే చిరువెచ్చని జలాల్లోకి ప్రవేశించాడు నన్నయ.

"అపవిత్రః పవిత్రో వా
సర్వావస్థాంగతో పివా
యః స్మరేత్ పుండరీకాక్షం
స బాహ్యాభ్యాంతరం శుచిః"

క్రమరీగా నడుము లోతు వరకు వెళ్ళి స్నానం చేశాడు నన్నయ.

ఇంతలో – పూర్తిగా పైకొచ్చిన రవి బింబం, తూర్పు దిక్కును ఎర్రబరిచింది.

అర్ఘ్యం ఇస్తూ, "ఓ సూర్య నారాయణ మూర్తీ! ప్రపంచ మంతటికీ, విరాట్పురుషుడికీ నేత్ర స్వరూప మైన వాడా! ఈ అర్ఘ్యాన్ని గ్రహించు!" అని దోసిలితో నీటిని నదిలో జార విడిచాడు నన్నయ భట్టు.

"ఓం నమః సహస్ర బాహవే
ఆదిత్యాయ నమోనమః!
నమస్తే పద్మ హస్తాయ
వరుణాయ నమోనమః!!"

–అంటూ, అరచేతు ల్లోకి మళ్ళీ నీటిని తీసుకుని తదేక ధ్యానంతో దోసిట్లో జలాల వంక చూశాడు నన్నయ.

హృదయ వీధిలో ఏదో సవ్వడి

# భాగవతుల స్వపరిచయం



32 ఏళ్ల కిందట శ్రీకాకుళం జిల్లా వీరఘట్టంలో పుట్టి పెరిగి, ఆ పక్కనే వున్న పాలకొండలో విద్యాభ్యాసం చేసి, బతుకు తెరువు వెతుక్కుంటూ పన్నెండేళ్ల కిందట హైదరాబాద్ చేరి, 'చిత్రభూమి'లో సబ్-ఎడిటర్‌గా జాయిన్ అయిన దగ్గర్నుంచి నా అసలైన సారస్వత జీవితం ప్రారంభమైంది. హైస్కూలు స్థాయి నుంచే కథలూ- కవితలూ రాయడం ప్రారంభించి ఇంతవరకు 30 కథలు, డజనున్నర కవితలు, మూడు నవలికలు, వందలాది వ్యాసాలు అచ్చులో కొచ్చాయి. వీటిలో ఎక్కువ భాగం ఆంధ్ర పత్రికలోనే వచ్చాయని చెప్పడం నాకు గర్వ కారణం. హైదరాబాద్ ఆల్ ఇండియా రేడియోలో వివిధ విషయాల మీద నేను చేసిన ప్రోగ్రాములు దాదాపు అర వంద ప్రసారమయ్యాయి.

ఇటీవలే ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 'తెలుగు సాహిత్యంలో పేరడీలు' అనే అంశంపై జరిగిన ఒక పరిశోధనలో నా పేరడీలను ఉదహరిస్తూ ప్రత్యేకంగా ఒక అధ్యాయం కేటాయించారు. టి.వి. సీరియల్స్- స్పాన్సర్డ్ ప్రోగ్రామ్‌లతో కూడా ప్రత్యక్షంగా- పరోక్షంగా సంబంధ బాంధవ్యా లున్నాయి. ప్రస్తుతం ఒక ప్రముఖ దినపత్రికలో ఉప సంపాదకునిగా ఉద్యోగం. ఈ సీరియల్‌పై ప్రత్యేకంగా పరిశోధన చేయించి, తమ అమూల్య సలహా లిచ్చిన ఆంధ్ర పత్రిక వీక్లీ ఎడిటర్ వీరాజీ గారికి శత సహస్రానీక కృతజ్ఞతలతో ....

– భాగవతుల సుబ్రహ్మణ్యం

మనో వేదిక మీద వివిధ రసానుభూతుల సమ్మిశ్రిత మైన సాగర ఘోష...

ఆలోచనా లోచనాలు తెరుచుకుంటూ, తన భావాంబర సీమలో వ్యక్తావ్యక్తంగా పాత్రలు ఏవేవో విహరిస్తూ సందడి చేస్తున్నాయి...

తదేకంగా ఆ జల బిందువుల వంక చూశాడు....

నీరు కాదది... వివిధ వర్ణ సమామ్నాయం. పలు వర్ణాల సమావృతం. రాసి పోసినట్టున్న ఓ అద్భుత కావ్యం లోంచి చెల్లా చెదురైన పద సంపదలా గోచరించిందా క్షణంలో ...

"ఈ పదాల కూర్పుతో ఏ మహా కావ్య రచనకీ మానవ మాత్రుడిని ప్రేరేపిస్తున్నావు ఆది దేవా?" ఆర్తిగా ప్రశ్నించాడు నన్నయ.

పరిసరాలు మైమరచి తానూ తనువూ ఉన్న స్థితిని మరచి పోయి ఏదో ఆర్తితో, ఆర్ద్రతతో ఎదుట భగవత్ స్వరూపాన్ని దర్శిస్తున్న భ్రాంతితో ఆ జగస్సాక్షిని అడిగేడు నన్నయ.

'ఆది కవిగా ఘన యశస్సు పొంద గల మహత్కావ్య నిర్మాణం నీ వల్ల కానున్నది నన్నయా!' అని ఏదో అదృశ్య శక్తి, తన వీనుల్లో ఊది వెళ్లి పోయిన అనుభూతికి లోనయ్యాడు.

అంతే!....

## భారత మహా కవిత్రయం

అంతలోనే మళ్లీ ఈ మాయా మేయ జగత్తులోనికి వచ్చేశాడు. అలౌకిక స్థితి అంతర్ధాన మైంది....

మళ్లీ అటు వంటి మధురానుభూతిని ఆశించాడు గాని, అది సాధ్య పడలేదు. ప్రకృతి సహకారం లోపించింది. పరిసర వాతావరణంలో క్రమంగా లౌకిక రణగొణ ధ్వనులు అధికం కాసాగాయి. నిశ్చలైకాగ్ర చిత్తుడైన నన్నయ నిత్య ధ్యానానికి అవి అడ్డంకి కాలేదు గాని, ఒక అపూర్వ మైన తేజో విరాజిత మయిన పారలౌకిక దర్శనానికి మాత్రం మళ్లీ అవకాశం లేక పోయింది.

ఆ మధుర స్మృతినే మననం చేసుకుంటూ

"ఓం భాస్కరాయ విద్మహే<br>ద్యుతికరాయ<br>ధీ మహిః, తన్నో ఆదిత్య<br>ప్రచోదయాత్"

–అనే సూర్య గాయత్రీ మంత్రాన్ని ఎనిమిది సార్లు పఠించి, అర్ఘ్య సంపూర్తిగావించి సైకత స్థలి పైకి వచ్చాడు నన్నయ.

గన్నేరు పువ్వు ఛాయ నీరుకావి ధోవతి ధరించి, గొజ్జంగిపూ నీటితో కలిపి మేదించిన గంగ మట్టి తళుకు చెంగావి వలువ భుజాన వేసుకుని గాయత్రీ, సంధ్యా వందన ఇష్ట దేవతా ప్రార్థనానురక్తుడయ్యాడు.

ఆయన ధ్యానం లోంచి లేచేసరికి బారెడు పొద్దెక్కింది.

రేవులో ఇతర జాతుల కలకలం అధికమైంది.

★ ★ ★ ★ ★ ★

విభవ నామ సంవత్సరం.

శాలివాహన శకం 891.....

మొదట 'వేంగి' రాజధానిగా చాళుక్య సామ్రాజ్య స్థాపన జరగింద

చాళుక్య చక్రవర్తుల్లో అఖండ విస్తార యశశ్చంద్రిక లందిన వాడు రాజరాజనరేంద్రుని తండ్రి విమలాదిత్యుడు. దేశికవితనీ, దేశభాషనీ ప్రోత్సహించి 'తెలుగు'ను నిలపడానికి ప్రయత్నించిన వారు చాళుక్య ప్రభువులు. అంతకు పూర్వం తెలుగు భాష ఎప్పుడు పుట్టిందో, ఎలాంటి స్థితిలో వుందో చెప్పడం కష్టం. కాని తెలుగుకు కావ్య గౌరవం, సభా మర్యాద, రాజపూజ్యత కల్పించిన మహారాజులు చాళుక్యులు.

అంతకు పూర్వం సంస్కృత ప్రాకృతాలే

రాజ భాషలు. క్రమ పరిణామంలో దేశభాషలు వికసించాయి. ఆ వికాస క్రమంలో తెలుగు భాషకు ఔన్నత్యం కల్పించి, భాషాభివృద్ధికి దోహదం చేసింది నిస్సంశయంగా చాళుక్య రాజులే!

రాజ రాజ నరేంద్రుడు శక సంవత్సరం 944, దుందుభి నామ సంవత్సరం భాద్రపద బహుళ విదియా గురువారం ఉదయం ఉత్తరా భాద్రా నక్షత్రయుక్త, తులా లగ్నంలో పట్టాభిషిక్తుడయ్యాడు. అరివీర భయంకర మైన ఆ లగ్నబలంతో, ప్రజలకు సుఖశాంతులు, కవి పండితులకు ప్రాపకంతో పాటు దేశంలో భాషా వికాసం అపూర్వంగా సాగాయి. అంతకు ముందే యువరాజుగా రాజరాజు రాజ్యభారం వహిస్తూ తండ్రికి చేదోడు వాదోడుగా వుండేవాడు. శక సంవత్సరం 940లో విమలాదిత్యుడు స్వర్గస్తుడైనప్పటి నుండి రాజరాజుకు మూడేళ్ళు శత్రు పీడ, దాయాదుల బాధ తప్పలేదు.

విమలాదిత్యుడు భూప మహేంద్ర, ముమ్మడి భీమ, బిరుదంక భీమ, త్రిభువనాంకుశ, విష్ణువర్ధన, సత్యాశ్రయ బిరుదాంకితుడు. పట్టపు రాణి కుందవా దేవీ- విమలాదిత్యుల తనయుడే రాజరాజు. చిన్న భార్య మేడాంబ వల్ల వీర విజయాదిత్యుడు కలిగాడు. వీర విజయాదిత్యుడికి సింహాసన కాంక్ష మెండు. తండ్రి మరణించినప్పుడే కాక, తర్వాత కూడా అవకాశం దొరికి నప్పుడల్లా రాజరాజు మీద కయ్యానికి కాలు దువ్వుతూండే వాడు. అతడికి పశ్చిమ చాళుక్యుల సహాయం ఎక్కువగావుంది. జ్యేష్ఠుడు రాజ్యానికి వారసుడు కనుక, రాజరాజు సింహాసన స్థితుడు కావడం సహజమే! అయినా రాజ్యకాంక్ష ఎక్కువగా వున్న సవతి తమ్ముడిని చులకనగా చూడకుండా, ఒక పరగణాకు రాజ ప్రతినిధిగా చేయాలని సంకల్పించాడు రాజరాజు. ఆ ఊహే తనమీద తిరుగుబాటుకు మార్గ మవుతుందని రాజరాజు ఆలోచించ లేక పోయాడు.

కలిదిండి వరకు తూర్పు చాళుక్యుల ప్రాబల్యం ఎక్కువగా వుండేది. అక్కడి నుండి త్రిపురాంతకం వరకు పశ్చిమ చాళుక్యుల ఆధిపత్యం కొనసాగుతోంది. ఈ జ్ఞాతి వైరం విజయాదిత్యుడికి ఆసరా కల్పించేటంత వరకు ఎదిగింది.

అయితే, రాజ రాజ నరేంద్రుడికి చోళుల సహాయం మొదటి నుంచీ వుంది. వారి అండ ఉండడానికి కారణం- తండ్రి తాతల దగ్గర్నుంచీ చోళరాజ పుత్రికలు చాళుక్యుల ఇంటి కోడళ్ళు కావడమే! విమలాదిత్యుడి, పట్టపు రాణి కుందవాదేవి, చోళరాజ పుత్రి. ఇక రాజ రాజేంద్రుడూ ఆ వార్షికం పాటించాడు. చోళ రాకుమారి రాణీ అమ్మంగదేవిని తన పట్టమహిషిగా చేసుకున్నాడు. అంచేత చోళ మండలం, వేంగీ రాజ్యంతో మైత్రి మాత్రమే కాక సంబంధ బాంధవ్యాలు కూడా కలిగి సమరాది అవసర సమయాల్లో సహాయ కారిగా నిలిచేది.

ఇటు కర్ణాట రాజు జగదేక త్రైలోక్య మల్లుడు, అటు కళింగాధిపతి మధుకార్ణవుడు రాజరాజుతో శత్రుత్వం నెరపుతున్న విజయాదిత్యుడి పక్షం చేరి అతడికి మిత్రు లయ్యారు. వారి అండతోనే విజయాదిత్యుడు అన్న మీద తిరుగుబాటు లేవదీశాడు. కలిదిండి దగ్గర జరిగిన ఘోర యుద్ధంలో విజయాదిత్యుడు ఓడిపోయాడు. కేవలం రాజరాజు దయావాత్సల్య గుణాల చేత అతడి ప్రాణాలు నిలిచాయి. కళింగ కర్ణాట రాజుల సహాయం చివరికి అసమర్థ సహాయంగా పరిణమించింది.

అంతఃకలహాలు అణచి వేశాక, రాజ్యపాలనా భారాన్ని స్వాస్థ్య చిత్తంతో నిర్వహించడానికి ఉపక్రమించి సర్వజన రంజకంగా పట్టాభిషిక్తుడయ్యాడు రాజరాజు. కాని రాజ్యంలో మత కల్లోలాలు తలెత్తి ఈసారిఅతడి భుజశక్తికి గాక మేధాశక్తికి పరీక్షగా నిలిచాయి.

బార్హస్పతులు, లోకాయతులు, చార్వాకులు వివిధ ప్రాంతాల్లో ఉద్యమాలు లేవదీశారు. మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా ఉద్యమం లేవదీసిన వాడు బృహస్పతి. అతడి మతాన్ని అనుసరించిన వారే

బార్హస్పతులు. మరో వైపు పూర్ణ కశ్యపుడు, కకుథ కాత్యాయనుడు, కంబలాశ్వాతుడు లాంటి లోకాయతులు

వైదిక సాంప్రదాయాల్నీ వర్ణ వ్యవస్థనీ స్వర్గలోక కల్పనల్నీ విమర్శించడం ప్రారంభించారు. ఈ దశలోనే ఆకర్షణీయంగా, ప్రసంగించే నేర్పున్న సార్థక నామధేయుడు చార్వాకుడు తర్కతత్వ్వం ప్రతిపాదించాడు. అదే 'చార్వాక దర్శనం' సమకాలీనుల దృష్టిని చార్వాకుడు అతని అనుయాయులు బాగానే ఆకర్షించినా కేవలం వైదిక మత ఖండన వాళ్ల ప్రధాన లక్ష్యం కావడంతో ప్రజల్లో అసంతృప్తి బయల్దేరింది. చార్వాక సిద్ధాంతాలు ప్రజలకు కంటక ప్రాయాలయ్యాయి.

'పరలోకానికి పయనించే ఆత్మ అనేది అసలు లేనేలేదు. అగ్నిహోత్రం, సన్యాసం, విభూతి ధారణ తిరుచూర్ణ ధారణ నిష్ప్రయోజనాలు. వర్ణాశ్రమ ధర్మాలు అర్థంలేని వ్యవస్థా స్వరూపాలు. కర్మకాండ యాగబలి నిరర్థకం'....

## భారత మహో కవిత్రయం

ఇలాంటి ప్రచారాలు సహజంగా ప్రజానీకానికి ఆగ్రహం తెప్పించాయి.

చార్వాక మతాన్ని ప్రతిపాదించిన చార్వాకుడ్ని, అతడి శిష్య ప్రశిష్యులైన భాగుర, భట్ట ఉద్భటుడు, పురందరుడ్ని వైదిక మతస్తులు తరిమి కొట్టారు.

ఈ మత కలహాలు కలిగించిన శిరోవేదనకు తోడు విజయాదిత్యుడు, అజ్ఞాతంగా మళ్లీ యుద్ధ సన్నాహాలు చేస్తున్నాడన్న వార్త చారుల ద్వారా తెలిసింది రాజరాజనరేంద్రునికి.

* * * * * * *

అది రాజరాజ నరేంద్రుని ఏకాంత మందిరం. అభేద్యమైన దుర్గాంత ర్భాగంలో వుంది.

రాజమహేంద్రి దుర్గం అనన్యసామాన్యమైనది.

చుట్టూ వున్న కందకం, సప్తపాతాళాలకీ ప్రయాణించదగ్గ రాజ మార్గమా అన్నంత లోతుగా వుంటుంది.

కోట గోడలు నక్షత్రాలను తాకుతున్నాయా అన్నంత ఎత్తుగా వుండి, తారలు తోరణాలుగా కట్టిన పూలగుత్తులా అన్నట్టుంటాయి.

బంగారు తాపడం చేసిన తలుపులున్న కోటగుమ్మం మెరిసే రెక్కలున్న మేరు పర్వతమా అన్నట్టుంటుంది.

కోట లోపల అశ్వ, గజ, కాల్బలాలు అంతులేనంతగా వున్నాయి. కోటలోనే ప్రముఖ, రాజోద్యోగుల ప్రాసాదాలున్నాయి. చిత్ర విచిత్ర నిర్మాణ రీతులతో రాజ భవనాలున్నాయి. ఏకాంత, విశ్రాంత, మంత్రాంగ, ద్యూత మందిరాల కవతల అంతఃపురం వుంది.

అంతఃపురానికి అతి చేరువగా వున్నదే రాజరాజనరేంద్రుని ఏకాంత మందిరం. ముందుగా అనుమతి లేనిదే కీటకానికి కూడా ప్రవేశం లేదా మందిరంలో.

మందిర కావలి భటులిద్దరికీ, కొన్ని ప్రత్యేక ఆజ్ఞలున్నాయి. హద్దు మీరి ప్రవేశించ బోయే వారెవ్వరైనా సరే... వారి



కఠోర కరవాలాల కెరగాక పోరు. రాజముద్రిక చేత ధరించిన వారికే అందులో నికి ప్రవేశము.

అప్పుడే వచ్చి వెళ్ళిన గూఢచార దళాధిపతిని, వివిధ విషయాల మీద ప్రశ్నించి, రాజ్య పరిస్థితిని సమీక్షించుకుంటూ ఆలోచనా నిమగ్నుడై వున్నాడు రాజరాజు.

గత మాసం రోజులుగా వేగులు తెస్తున్న వార్తలు కించిత్ కలవర పాటును కలిగిస్తున్నాయి.

విజయాదిత్యుడు తనకు రక్త సంబంధి కావడం, తన తండ్రి రక్తం సవతి తమ్ముడిలో ప్రవహిస్తున్నదన్న జాలీ, మమకారం, అతడు తనని తక్కువగా అంచనా వేసుకోవడానికి పురికొల్పాయా?....

ఇటీవల ఏవో కొన్ని నీలివార్తలు వినిపిస్తున్నాయి. దాయాదులే అయినా విరోధుల నడకలు పసిగట్టాలి...

మళ్ళీ పోరు తప్పేట్టు లేదు....

రాజరాజు మందిరంలో ఎంతసేపు ఆలోచనాంతరంగుడై గడిపితే, అంతసేపూ వారికి అంతరాయం కలిగించే ధైర్యం ఎవరికీ లేదు. అనుమతి అంతకంటే లేదు.

శ్రీ జయ విభాసి వినమ్రరాజన్య కిరీట విరాజిత పాదాం భోజుడు, ప్రచండ ప్రతాప భాసురుడు, జగజ్జేగీయ మాన యశో విశాలుడు, కమనీయ గుణగణ భరితుడు, నానావనీ నాథ కిరీట తటీ విలసద్రత్న సంఘటిత పద కమలుడు, గుణ సింధురహయ శిక్షా రూఢుడు, ఘోరారి మద కుంభి కుంభ విదారణ దారుణ కృపాణ దక్షిణ హస్తుడు అయిన శ్రీ రాజరాజనరేంద్రుల వారి ఏకాంతానికి భంగం కలిగించే సాహసం చేయగల వారెవ్వరైనా వున్నారా?

వున్నారు....

కేవలం ముగ్గురు మాత్రమే అందుకు సమర్థులు....

ప్రభువుల వారి పట్ట మహిషి అమ్మంగదేవి, మంత్రాంగ చతురుడు మహామాత్యుడు వజ్జియ ప్రెగడ, నానా రుచిరార్థ సూక్తినిధి కుల బ్రాహ్మణుడు నన్నయభట్టు.

ఏకాంత మందిరమే కాదు.... రాణి వాసాల్లోకి, అంతఃపురాంతర్భాగాల్లోకి సైతం నిరాటంకంగా ప్రవేశించగల చొరవ- అవకాశం ఈ ముగ్గురికి మాత్రమే వున్నాయి.

నాడు భానువారము.

అక్షయ నామ సంవత్సర చైత్ర శుద్ధ త్రయోదశి....

మొగసాల మీద ఘటికా రావము మోగుచున్నది. పది గంటలు కొట్టారు.

ఘంటికాశబ్దం చిరు అంతరాయం కల్గించడంతో, ఆసనంపై నుంచి లేచి మందిరంలో అటూ ఇటూ పచార్లు చేయసాగాడు రాజరాజ నరేంద్రుడు.

ద్వారం వద్ద అలికిడైంది....

మరుక్షణం ఓ గంభీర తేజోమూర్తి లోనికి ప్రవేశిస్తూ, దర్భాంకురాలతో అలంకృతమైన కరకమలాలతో కర్ణము లంటి "వీరో గ్రాజి విజయా! ఆపస్తంభ సూత్రుడను, ముద్గల గోత్ర జాతుడను, నన్నభట్టు నామధేయుడను ప్రభువులకు అభి వాదము చేయుచున్నాను" అన్నాడు.

ప్రత్యభివాదం చేసి చిరునవ్వుతో 'అత్రిసమానా! అదే సముచితాసనము అలంకరింప వేడుచున్నాను" అని, నన్నయ కూర్చున్నాక, తాను కూడా కూర్చుంటూ "రావలసిన సమయంలో నే

## వంటింటి పజ్యాలు ★★★

### సండే ప్రాబ్లమ్!

మా పని మనిషి మహా మంచిది
ఆదివారమైనా టంచన్‌గా వస్తుంది
వస్తుంది అనకూడదు 'సారీ!' అది "పొస్టైన్సు"
మహాభారతం రోజుల్లో మాత్రం వచ్చి వెళ్లేదిది!
భారతం ముగిసింది ఆదివారం ఆదివారం
నాగా మీద నాగా పెట్టేస్తోంది మా అప్పలసూరి
-"ఆదివారమేనా మార్నింగ్ షో లేదా జాలీగా
నా బ్రతుక్కి?" అంటాడు హబ్బీ జాలిగా
అక్కడ అంట్లు తోమకపోతే అయ్యగారికి బువ్వరాదుగా
అంటాను అసింటాత్రోసేసి పోతూ నేను గేలిగా!

'సండే' మీకు మాత్రమేనా జాలీ హాలీడే
మేం కూడా మనుసులమే అది మా "కాఫ్ డే"
అంటుంది. అడ్డమైన పొట్లాల కాయితాలు
అటుయిటూ తిప్పి సినిమాలు వెతికే అ॥ సూరి!

ఐనా అన్నాను: నీళ్లు నములుతూ దాంతో వోమారు
"సండేకి మారుగా మండే యాప్నింగ్ ఆఫ్ ఎత్తుకోరాదా?
దీన్ని కాదన లేరు ఏ ట్రేడ్‌యూనియన్ లీడర్లైనా!"

"అమ్మా! మాకు" మాత్తరం మార్నింగ్ షోలుండవేంటి?
అనేసిందది వోరగా
సో హబ్బీ మైడియర్ అబ్బీ
సన్‌డే, సన్‌డే బెస్టాఫ్‌గా బెటర్ హాఫ్‌గా
ఇద్దరం ఒక్కటై పాడుకుంటూ డ్యూయిట్‌లు
తోముకుంటున్నాం అంట్లు పోసుకుంటున్నాంఆనక, తలంట్లు!

వేంచేశారు" అన్నాడు రాజేంద్రుడు.

"ఏమిటి విశేషం?" కుతూహలంగా అడిగాడు నన్నయ.

"ఘన యశ శ్చంద్రికలతో దిగ్దిగంత విశ్రాంత యశస్కమై విరాజిల్లు రాజమహేంద్రిని చూసి శత్రు రాజ్యాలకు కన్ను కుట్టుగా వుంది. రాజనీతి జ్ఞులు, మహామహో పాధ్యాయులు మీకు తెలీని దేమున్నది?"

"దండితాహిత వైరి వీరా! రాజేంద్రా!విరోధి విజయాదిత్యుని ఉపేక్షించడం ప్రమాదమని నేనానాడే హెచ్చరించాను. రక్త స్పర్శ అనీ, పిన్నవయస్సనీ, దుడుకు చేష్టితాలనీ రకరకాలుగా తామే తమ మనస్సునకు సర్ది చెప్పుకున్నారు. సంగ్రామ సీమలో చేజిక్కిన వైరి శిరస్సు చేజేతులా కరవాలాని కెర గాకుండా వదిలేశారు. ఇప్పుడు అతడు మళ్లీ తల ఎత్తడంలో ఆశ్చర్యమేముంది?"

"నేనది పొరపాటుగా భావించలేదు. ఔదార్యమని యోచించినందుకు ఫలిత మిది!"

"వైరి అల్పుడని ఉపేక్షించకూడదు. అది రాజనీతి. రేణువే కదా అని అగ్నిని అలక్ష్యం చేయరాదు. రేణువే చెలరేగి సర్వాన్నీ దహిస్తుంది. సామ దాన భేద దండోపాయాల్లో సామ దానాలు సాగితే సర్వత్రా శ్రేయమే కానప్పుడు మిగిలినవే శరణీయాలు"

## భారత మహా కవిత్రయం

ఇంతలో 'ప్రభువులకు అభివాదము" అంటూ మహామంత్రి వజ్జియ ప్రెగడ వేం చేశాడు.

చిరునగవుతో ఆసనం చూపించాడు రాజరాజేంద్రుడు.

"నేడీ ఏకాంత మందిరమే మంత్రాంగ మందిరమై నట్టుంది" అని వజ్జియ చమత్కరిస్తూ "అవిరళ జపహోమ తత్పరులు నన్న పార్యుల కిదే అంజలి" అని వినమ్రంగా శిరసు వంచాడు.

"దీర్ఘాయురస్తు" దీవించాడు నన్నయ

"వేగుల వార్తలు మీకూ చేరి వుంటాయను కుంటాను" రాజ రాజ నరేంద్రుడు వజ్జియను క్రీగంట చూస్తూ అన్నాడు.

"విజయాదిత్యుడీ పరి ద్విగుణీకృత బలో పేతుడై దండెత్తనున్నట్టు తెలియ వచ్చింది. అయితే అదంతా అతడి బలం కాదు. పూర్వం వలె కర్ణాట ప్రభువు త్రైలోక్య మల్లుడు, అతడి సామంతరాజు దడిగదేవుడు రెండు శిఖరాల్లా అతడికి కొమ్ము కాస్తున్నారు"

"ఆ విషయం మేమూ విన్నాం! స్వపరాక్రమ హీనుడు కనుకనే మన శత్రు రాజుల్ని శరణు వేడాడు..." రాజరాజ నరేంద్రుడి దక్షిణ హస్తం కరవాలాన్ని స్పర్శించిందోసారి.

"లోక కంటకులను- పిరికి పందలను మన నివ్వడం ప్రాజ్ఞత కాదు" నన్నయభట్టు సెలవిచ్చాడు.

"ఇక జరగనున్నదదే! ప్రభువుల ఖడ్గ ధారా సంఘట్టన సంజనిత విస్ఫులింగములు, విజయా దిత్యుని ఉసురులు దగ్ధం చేయగలవు" వజ్జియ అన్నాడు.

రాజేంద్రుని వామహస్తం అలవోకగా శ్మశ్రువుల మీదకి పోయింది

"వీరాతి వీరలోక భుజ బల పరిసేవిత మున చాళుక్య రాజ్య లక్ష్మి. దిగంత విశ్రాంత యశచ్ఛత్ర ఛాయా కమనీయ సింహ పీఠి మన చాళుక్య రాజ్యలక్ష్మి. ఇక రణమే శరణం. యుద్ధ సన్నాహాలు ప్రారంభించ డానికి ఇదే మా ఆనతి"- ఒక స్థిర నిశ్చయానికి వచ్చిన వాడిలా అన్నాడు రాజేంద్రుడు.

"బుద్ధి మదగ్ర గణ్యా!నన్నయా!మీరొక కార్య భారం నిర్వహించాలి. కబురందిన తక్షణం కార్య సంసిద్ధులై కదలి రావాలని మా మాటగా, మా పట్టపు రాణి అనుంగు సోదరులు మా బావగార్లు అయిన రాజాధి రాజునకూ, రాజేంద్ర దేవుడికీ లేఖలు రాయించండి..."

ప్రభువు అనుజ్ఞకు నన్నయ "అవశ్యం! అది తక్షణ కర్తవ్యంగా భావిస్తాను" అన్నాడు.

"యుద్ధ వార్త ప్రజానీకానికి తెలియజేసి, వారిని అప్రమత్తుల్ని గావించండి. నగర రక్షణ, దుర్గ రక్షణతో పాటు ప్రజా సంక్షేమ బృహద్బాధ్యత తమదేనని విస్మరించకండి" వజ్జియ నుద్దేశిస్తూ అన్నాడు రాజేంద్రుడు.

"ఎంత మాట? ప్రభువుల అభీష్టానుసారం వ్యవహరించడమే మా వంశాచారం" వజ్జియ అన్నాడు.

మలి ఝాము గడిచిన సూచనగా కోట మీద నగారా మోగడంతో, సెలవు తీసుకున్నారు నన్నయ వజ్జియలు.

(ఇంకావుంది)



సికింద్రాబాద్- బీబీనగర్ మధ్యగల పోగులగూడెం రైల్వే లెవెల్ క్రాసింగ్ వద్ద 9-10-'90 సాయంత్రం కాకతీయ పాసెంజరుకు అమానుషంగా నిప్పు పెట్టగా దాదాపు ఏభైమంది ప్రయాణీకులు సజీవ దహనమై మాంసపు ముద్దలుగా మిగిలి పోయిన దృశ్యం.

రైలు చర్లపల్లి దాటిన తరువాత పోగుల గూడెం క్రాసింగ్ వద్ద వేగం తగ్గిందని రిజర్వేషన్లకు వ్యతిరేకంగా అగ్రకులాల వారు అనుసరిస్తున్న దురహంకారానికి నిరసనగా ఈ పని చేస్తున్నట్టు తాము పీపుల్స్‌వార్ కార్యకర్తలమని నినాదాలు చేసి, కరపత్రాలు పంచిపెట్టినవారు రైలు బోగీలో పెట్రో లుపోసి నిప్పు పెట్టినట్లు ఈ ప్రమాదం నుంచి బయటపడి సికింద్రాబాద్‌లోని గాంధీ హాస్పిటల్‌లో చికిత్స పొందుతున్న ప్రత్యక్ష సాక్షులు చెపుతున్నారు.

ఈ దారుణ మారణ హోమంలో 15 మంది వొళ్లు కాలిపోయి ప్రమాదస్థితిలో వున్నారు- ప్రభుత్వం న్యాయ విచారణకు ఉత్తర్వులు చేసింది.



## మీకు తెలుసా?

### ఆస్కార్‌కు ఎన్నికైన మొదటి చిత్రం

ఆస్కార్ అవార్డుకు సంబంధించి విదేశీ చిత్రాల క్యాటగిరీలో ఎన్నికైన మొట్టమొదటి భారతీయ చిత్రం నర్గీస్ నటించిన 'మదర్ ఇండియా' మెహబూబ్ ఈ చిత్రాన్ని నిర్మించారు.

### మిర్రర్ స్క్రీన్ థియేటర్

ఈ మిర్రర్ స్క్రీన్ థియేటర్ మనదేశంలో బొంబాయిలో వుంది. ప్రేక్షకులు తమ సీట్లలో ఎటు వైపు అయినా కూర్చొని సినిమాను వీక్షించవచ్చు. ఇంతకీ ఆ థియేటర్ పేరు టో పీవాలా.

### మొదటి సినిమా అడ్వర్‌టైజ్‌మెంట్

ఇప్పుడు ఏ పత్రికలో చూసినా సినిమా అడ్వర్‌టైజ్‌మెంట్లే మనకు దర్శన మిస్తున్నాయి. కాని మొట్ట మొదటి సినిమా అడ్వర్‌టైజ్‌మెంటు వేసిన ఘనత 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా'కు దక్కుతుంది. 1896లో జులై 7న ఆ అడ్వర్‌టైజ్‌మెంటు పడింది.

### అంతర్జాతీయ అవార్డు పొందిన ప్రథమనటి

చలనచిత్ర రంగంలో అనేకమంది నటీనటులు జాతీయంగాను,



అంతర్జాతీయంగాను ఎన్నో అవార్డులు స్వీకరించి వుంటారు. కాని అంతర్జాతీయ అవార్డు పొందిన మహిళ మాత్రం నర్గీస్‌దత్. 'కార్లోవివారీ ఫెస్టివల్ అవార్డు' నర్గీస్‌కు దక్కింది. అదీ 1958లో 'మదర్ ఇండియా'లో నటనకు గుర్తింపుగా.

### ఎక్కువ చిత్రాల ఎగుమతి

1986-87లో 241 హిందీ చిత్రాలు విదేశాలకు ఎగుమతి చేయబడినాయి. వాటిలో ప్రాంతీయ చిత్రాలు, 74 తమిళ చిత్రాలు, 61 మళయాళ చిత్రాలు వున్నాయి. వీటిలో ఎక్కువ చిత్రాలు అంటే 107 చిత్రాలు దుబాయ్‌కి ఎగుమతి అయ్యాయి.

### ఒకే భాషలో ఎక్కువ చిత్రాలు

1987లో 806 చిత్రాలు నిర్మించబడినాయి. దానిలో తమిళంలోనే నిర్మించిన చిత్రాల సంఖ్య ఎక్కువ. ఈ భాషలో 167 చిత్రాలు నిర్మించబడగా, తెలుగులో 163 చిత్రాలు నిర్మించబడినాయి.

-తిలక్

# అడ్వాంచర్

## వెన్న జగదీష్

ఈ రోజు లేచిన ఘడియ విశేషమేమోగాని నాకీ అనుభవం ఎదురై వొంటి నిండా గాయాలతో, కట్లతో మంచమెక్కాను. లేకుంటే రోజు ఈపాటికి క్లబ్బులో టి. టి. ప్రాక్టీసు చేసుకునేవాడ్ని. అప్పుడే వీళ్లందరికి ఎలా తెలిసిందో? మధ్యాహ్నం నుండి ఒక్కొక్కరొచ్చి పరామర్శించి వెళ్తున్నారు.

జరిగింది చెబితే, విని జాలి పడాల్సింది పోయి, భలే పని చేశావా! అంటూ అదేదో హాస్య కథ విన్నట్టుగా పళ్లికిలించటం నాకు మరీ చిర్రెత్తుకొచ్చింది. అసలు చెప్పుకోవాలంటేనే మహా సిగ్గుగా వుంది కాని, ఏం చేస్తాం? అడుగుతుంటే చెప్పక తప్పుతుందా?

ఛ! మిగతా అందరిలా నేనూ గమ్మున వుంటే సరిపోయేది. కళ్లెదుట అన్యాయం జరుగుతుందేయని తొందరపడి తలదూర్చి నందుకు ప్రతిఫలం ఇలా ఏడ్చింది. ఐనా నేనేమైన తప్పుడు పని చేయబోయి తన్నులు తిన్నానా? నాకీ రోజు ఇది రాసిపెట్టి వుంది కాబట్టి వ్యవహారం బెడిసికొట్టి దేహశుద్ధి జరిగింది.

లేని ఓపిక తెచ్చిపెట్టుకుని టీ కాచుకుందామని స్టౌ వెలిగించాను. కిటికీలో నుండి అప్పుడే ఎంకన్నగాడు స్కూటరు పార్కు చేసి, గేటు తోసుకుని లోనికి రావటం కంటబడింది. ఎంకన్న అంటే నా కొలీగ్. నాకున్న మంచి మిత్రులలో ఒకడు. అసలు పేరు వెంకటేశ్వరరావు. నేను ముద్దుగా వాడికి పెట్టుకున్న నిక్‌నేమ్ 'ఎంకన్న'. ఈ మధ్య వాడికి కథల పిచ్చి పట్టుకుంది. ఈ రెండు నెలల్లో కనీసం పదికి పైగా కథలు వ్రాసి వివిధ పత్రికలకు పంపించాడు. కాని ఇంతవరకు ఒక్క కథ కూడా ప్రచురించబడలేదు. ఎడిటర్లను కలవాలంటూ మూడు, నాలుగుసార్లు నా ప్రయాణ ఖర్చులు భరించి కూడా తీసుకెళ్లాడు. మా వాడి కథలన్నీ చదివి, కథ బాగున్నా శైలీ కుదరలేదని, ఇంకాస్త ఇంప్రూవ్ చేసి రాసుకురమ్మని కొందరంటే, అసలు తీసుకున్న సబ్జెక్టులో ఏమాత్రం పసలేదని మరికొందరు ప్రచురణకు నిరాకరించారు. ఇక అప్పటి నుండి వాది కథలు తిరుగుముఖం పట్టినప్పుడల్లా మేం వాడ్ని తెగ ఏడ్పిస్తుంటాము. ఇప్పుడు నన్నేడిపించటానికి వాడికిది మంచి అవకాశంగా దొరికింది కాబోలు.

"రా నాన్న! రా! నువ్వొక్కడివే మిగిలిపోయావు, ఇంకా రాలేదేమిట్రా అని చూస్తున్నాను". వ్యంగ్యంగా అన్నాను.

"అదేంట్రా! అలాగంటావు. ఏదో అడ్వెంచర్ చేసి, భంగపడ్డావని తెలిసి, మిత్రుడివి కదా పరామర్శించి వెళ్దామని వచ్చాను".

"అడ్వెంచరా? పాడా! అంతా నా తలరాత".

"అసలేం జరిగింది? ఎలా జరిగింది?కాస్త వివరంగా చెప్పు".

"చెప్తాను. చెప్పక చస్తానా!నువ్వడిగినపుడు. నీ వంతు కూడా పూర్తి చేస్తే నీతో ఈ రోజుకు డజనుమంది పూర్తవుతారం"టూ చెప్పడం మొదలెట్టాను.

* * *

బస్సు వెనుక భాగం దేనినో 'ఢీ' కొన్నట్టు 'ఫట్' మన్న శబ్దంతో గట్టిగా ఒక్క కుదుపు నివ్వడంతో కళ్ళు తెరిచి చూశాను. డ్రైవరుతో సహా బస్సులోని మిగతా ప్రయాణీకులంతా కిటికీలగుండా వెనక్కి తొంగి చూడటం కన్పించింది. అప్పటికే బస్సు ఊరి పొలిమేరల్లోకొచ్చేసింది.

ఏం జరిగిందబ్బా? అనుకుని నేనూ ఆ వంక చూశాను. ఓ ఫర్లాంగు దూరం వెనకాల రెండు రోడ్ల కూడలివద్ద రోడ్డుమీద ఒక మోటారు సైకిలు అడ్డంగా పడివుంటే, దాని ప్రక్కన ఒక వ్యక్తి బోర్లా పడి వున్నాడు. రోడ్డు దిగువలో సైకిల్‌వాలా అప్పుడే లేచి దుమ్ము కొట్టిన తన బట్టల్ని దులుపుకుంటూ సైకిల్ ఎత్తే ప్రయత్నంలో వున్నాడు.

డ్రైవరు బస్సు వేగం తగ్గించి, "వాళ్ళు మన బస్సును కాని ఢీ కొనలేదుగదా!" అని బస్సులో వెనుక సీట్లలో కూర్చున్న వారి నడిగారు.

"అబ్బే అదేం లేదు. ఆ మోటారు సైక్లిస్టు సైకిల్‌వాలా ఒకరి నొకరు గుద్దుకుని పడిపోయారంతే. మన బస్సు ఎవర్నీ ఢీ కొనలేదు."

వారి సమాధానం విని డ్రైవరు సంతృప్తి చెంది బస్సు వేగం పెంచడానికి ఉద్యుక్తుడయ్యాడు. నా కెందుకో అనుమానమొచ్చి, ఆ మోటారు సైక్లిస్టును తదేకంగా గమనిస్తే అతనిలో కించిత్తు కూడా చలనం లేకపోవటం కన్పించింది. ఎందుకైనా మంచిది దిగి చూసొద్దామని డ్రైవర్ని బస్సు కాస్త పక్కకు తీసుకుని ఆపు చేయమని కోరాను.

చూసివద్దామని ధైర్యంగా బస్సు ఆపు చేయించానే గాని తీరా బస్సు దిగి అంతా ముందు కెళితే నేను మాత్రం ధైర్యం

చాలక రోడ్డు చివరినుండే దృష్టి సారించాను. ఆ మోటారు సైక్లిస్టు అప్పటికే మరణించాడు. అప్పటి వరకు సైకిల్‌వాలా బాగానే వున్నవాడల్లా మేమంతా బస్సు దిగిరావటం చూచి, కుంటడం మొదలు పెట్టాడు. ఆ సైకిల్ వాలాను వివరాలు అడిగితే, ఆ మోటారు సైక్లిస్టు వేగంగా మలుపు తిరిగి తన సైకిల్‌ను 'ఢీ' కొన్నాడని, అంతా మోటారు సైక్లిస్టుదే తప్పయినట్లు వివరించాడు.

ఇక చేసేదేమి లేక ఆలస్య మవుతున్నదని మేమంతా బస్సు ఎక్కడానికి ముందుకు కదిలాము. అంతలోకే ఎక్కడ నుండి వచ్చారో గాని పది మంది దాక డ్రైవరు మీద పడి బూతులు తిడుతూ కొట్టడం మొదలు పెట్టారు. నేను పరుగెత్తుకెళ్ళి వారి మధ్యలో దూరి కొట్టకుండా అడ్డుపడ్డాను.

"అసలెందుకు డ్రైవర్ని కొడుతున్నారు? ఇందులో అయన పొరపాటేమీ లేదు. ఆ సైక్లిస్టు, మోటారు సైక్లిస్టు ఒకరినొకరు గుద్దుకుని పడ్డారంతే కాని, మా బస్సేమీ వారిని 'ఢీ' కొనలేద"ని వాదించాను. దానికి వారు మరింత కోపంతో నా చొక్కా కాలరు పట్టుకుని బరబరా నన్ను లాక్కెళ్ళారు, ఆ శవం పడున్న చోటికి.

"నీకు కళ్ళు సరిగ్గా కనబడు తున్నాయా? అటు చూడు! బస్సేమీ 'ఢీ' కొన లేదన్నావ్‌గా!" దబాయించారు.

అప్పుడు చూసాను క్షుణ్ణంగా, హతుడు ధరించిన తెల్లటి ప్యాంటు మీద నల్లగా టైరు మరకలు అస్పష్టంగా కన్పిస్తున్నాయి. బస్సు వెనుక చక్రం అతడి వీపు మీదుగా తలపై నుండి జారిపోయింది. తల పగిలి టమాటా చిట్లినట్టుగా మెదడు ముక్కలు, ముక్కలుగా పడివుంది రోడ్డుమీద. నా కళ్ళు ఆ సైకిల్ వాలా కొరకు వెతికాయి. వాడెప్పుడో చల్లగా జారుకున్నాడు.



## దంతారోగ్య క్విజ్ (౨)

1. పల్లుతోము కోవడానికి వుపయోగించుకొనే అతి సాధారణ పదార్థం.

(ఎ) బొగ్గుపొడి (బి) ఇటుక పొడి (సి) పిడక పొడి (కాల్చిన)

2. పైసా ఖర్చుకాని టూత్ బ్రష్.

(ఎ) ఏంగ్యులార్ బ్రష్ (బి) ట్రిగార్డ్ బ్రష్ (సి) మెత్తగా నమిలిన పంటి పుల్ల.

3. ప్రతి యింట్లోనూ లభించే మౌత్ వాష్.

(ఎ) ఉప్పు కలిపిన నీళ్ళు (బి) క్లోరోహెక్సిడెన్ (సి) డెట్టాలిన్.

4. ఈ దురలవాటు వల్ల పల్లల్లోనే కాదు, దౌడలలో కూడ మార్పు వస్తుంది.

(ఎ) గోళ్ళు కొరకడం (బి) బొటన వ్రేలు చీకడం (సి) దుస్తులు నమలడం.

5. చిన్నగా వుండే దవుడను యిలా పిలుస్తారు.

(ఎ) మైక్రోగ్నాథియా (బి) మేక్రోగ్నాథియా (సి) ఎగ్నాథియా.

6. పంటి గట్టితనానికి వుపయోగపడే, వుచితంగా లభించు, ప్రకృతి సిద్ధమైన విటమిన్.

(ఎ) విటమిన్- సి (బి) విటమిన్- బి (సి) విటమిన్- డి.

7. ఈ విటమిను లోపిస్తే, పంటి చిగుళ్ళు వాచి, రక్తం వస్తుంది.

(ఎ) విటమిన్- బి12 (బి) విటమిన్- సి (సి) విటమిన్- కె.

8. పుట్టుకతోనే పల్లుండడాన్ని యీ విధంగా పిలుస్తారు.

(ఎ) ప్రి- డెసిడ్యుయస్ టీత్ (బి) మిల్క్ టీత్ (సి) ప్రయిమరి టీత్.

9. అమ్లాలవల్ల పన్ను కరిగి పోవడాన్ని యీ విధంగా పిలుస్తారు.

(ఎ)అట్రిషన్ (బి) అబ్రేషన్ (సి) ఇరోసన్.

10. మానవ జీవిత కాలంలో సాధారణంగా ఎన్ని రకాల పల్లు చూడగలుగుతాం.

(ఎ) మూడు రకాలు (బి) రెండు రకాలు (సి) ఒకే రకం.

– డా. కె. ఎల్. వి. ప్రసాద్

జవాబులు:-

1. (సి)
2. (సి)
3. (ఎ)
4. (బి)
5. (ఎ)
6. (సి)
7. (బి)
8. (ఎ)
9. (సి)
10. (బి)

## అడ్వెంచర్

ఈ లోగా ఇదే మంచి అవకాశమనుకుని డ్రైవరు, అందరి కళ్ళు కప్పి పోలీసు స్టేషను వైపు పరుగు లంకించుకున్నాడు. ఇక వెంటపడి తరిమినా, వాడ్ని పట్టుకోలేమని తెలుసుకున్న ఆ పది మంది రెచ్చిపోయిన కోపంతో నాపై బడ్డారు. నా మూలంగానే డ్రైవరు తప్పించుకుని పారిపోయాడని. ఒకే ఒక్క నిముషంలో కనీసం ఓ పాతిక చేతులయినా నా వొంటి మీద నాట్యం చేసి వుంటాయి. వాళ్ళ ఆవేశం తగ్గే వరకు నా వొళ్ళు హూనం చేసి ఎక్కడి వారక్కడ తప్పుకున్నారు. వాళ్ళు వెళ్ళిన కొన్ని నిముషాలకు నా కళ్ళ చుట్టూ ఏర్పడిన చీకటి వలయాలు తొలిగిపోయి, బలాన్నంతా కాళ్ళలోకి కూడదీసుకుని ఇంటి ముఖంపట్టాను.

ప్రైవేటు నర్సింగ్ హోంలో టి. టి ఇంజక్షను చేయించుకుని, కట్టు కట్టించుకుని ఉసూరు మంటూ మంచంలో కూలబడ్డాను. ఇక ఆ రోజుకు వంట ప్రయత్నానికి స్వస్తి చెప్పి, ఆక్సిడెంటు తాలూకు దృశ్యాలు కళ్ళముందు కదులూ వుంటే నీరసంతో కళ్ళు మూసుకున్నాను.

* * * * * *

చప్పటం పూర్తయ్యిందో లేదో, "మరి నే వస్తాన్రా!" అంటూ కుర్చీ లోంచి లేచాడు ఎంకన్న.

"వెల్దువు గాని! ఏమా తొందర!"

"కాస్త అర్జంటు పనుందిరా! అందుకే.....!"

"ఇప్పటి వరకు తాపీగానే కూర్చున్నావు గదరా! ఇంతలోకే అంత కొంప లంటుకు పోయే పనేమి గుర్తొచ్చింది నీకు?"

"మరేం లేదురా? ఈ రోజు పత్రికలో చదివాను, "ఉగాది మినీ కథల పోటీ" ప్రకటన. ఇంకా రెండు రోజుల వ్యవధి మాత్రమే వుంది, కథలు పంపించడానికి. వస్తాను! బై" అంటూ బయట పడ్డాడు.

○

# ఈవారం లో మీ యోగం

19-10-1990 శుక్రవారం మొదలు
25-10-1990 గురువారం వరకు

**మేషం:** బహు శుభదాయకమైన వారం. సగంలో ఆపిన వ్యవహారాలు సానుకూలం కావటం, వృత్తి యందు వికాసం కనిపించటం, రాజకీయంగా అభివృద్ధి కనిపించటం, చాలకాలంగా తటపటా యించే వ్యవహారాలు ఒక రేవునకు రావటం, గమనించగలరు. స్త్రీలకు: అభివృద్ధి, శుభ ప్రస్తావనలు, బంధుప్రీతి.

**వృషభం:** ముందు వెనుకలాలోచించి, కార్యరంగానికి దిగండి. చలనచిత్ర రంగాన శ్రమించి ముందడుగు వేయటం న్యాయం లాభదాయకం. యోగప్రదం. మీ ఆలోచన ప్రకారమే ముందుకు సాగండి గుణవంతుల, పాత మిత్రుల సహాయ సహకారాలను పొందండి. వృత్తి యందు సుకరమైన మార్పులు రానున్నవి స్త్రీలకు: అభిమాన మిత్రాదరణ. వృత్తి యందు మేలు.

**మిధునం:** నాటి నాటికి మీ అభివృద్ధి సంతోషింపదగినది అవుతుంది. ప్రజా రంగాన మీ శక్తియుక్తులు, చాకచక్యం ప్రశంసనీయం. పదిమందిలో ప్రతిష్ఠ ఏర్పడనున్నది. వ్యాపారం శుభదాయకం. వృత్తి యందు పెంపు చేకూరుట శుభదాయక మగుట మీరే గమనిస్తారు. 'గురు' గ్రహాశీర్బలమున్నది గదా! స్త్రీలకు: వృత్తి యందు వికాసం, ఆదాయ వృద్ధి

**కర్కాటకం:** బహు విలువ గల వస్తువులు, వస్త్రములు సేకరించుకో గలరు. సర్వరంగాలలో అభివృద్ధికరమైన మార్పులు రానున్నవి సాంఘికంగా ముందుకు సాగిపోవలసి యున్నది. రాజకీయవాదుల పరిచయ భాగ్యం, వారాంతాన లాభదాయకమవుతుంది. కొందరకు ' స్త్రీలకు, పురుషులకు పయాణ సూచన యున్నది. స్త్రీలకు: వాహన సేకరణ, ధనలబ్ధి.

**సింహం:** ధనధాన్య వ్యాపార విస్తరణ సభా మర్యాదలకు ఆస్కారమైన యోగ వారం. లలిత కళా ప్రావీణ్యత వికసింప నున్నది. రచనారంగాన మీకు వికాస మున్నది. అభివృద్ధికరమైన మార్పు సర్వవిధాలా యోగదాయకం. శుభ సమయం, గ్రహించాలి స్త్రీలకు: అధిక విద్యా యోగ్యత, అనవసర గొడవలు

**కన్య:** విరోధివర్గమున్నది. బంధువులందే యిబ్బంది పెట్టదలచిన వారుంటారు. 'చిత్తా' నక్షత్ర జాతకులకు మరీ యిబ్బంది. 'అర్ధాష్టమ' శని బాధ కనిపించక పోదు. ఇక, వ్యాపారమా? సాఫీగా సాగుటకు యిబ్బంది లేదు. అధిక లాభాపేక్షకై పెనుగులాడరాదు. స్త్రీలకు: వృత్తి యందు వికాసం, రాజకీయంగా మేలున్నది, గ్రహింపగలరు.

**తుల:** ఏది ముందో ఏది తర్వాతనో తెలియక సతమతమవుతారు. 'శని' మీ రాశికి యోగదాయకుడు. 'వక్ర' నివృత్తి, తృతీయ స్థితి, ఏం కావాలి? సర్వ విధాలా అనుకూలుడు. వృత్తి, ఉద్యోగా లందు లాభప్రదుడు. స్త్రీలకు వస్తు, వస్త్ర లాభం, నూతన వృత్తి ప్రాప్తి.

**వృశ్చికం:** సమానులతో పరిచయమో, స్నేహమో, బాంధవ్యమో, మేలుగాని, అసమానులతో చేరరాదు. ఆపద వెన్నాడుతుంది. ఏ పని చేసినా ముందు వెనుకలు ఆలోచించాలి. సభా మర్యాద యున్నది. మీ వ్యాపారం భారీదయిందా? మంచి రోజులొచ్చాయి. ముందుకు జరగటమే ధ్యేయం.స్త్రీలకు: వారాంతాన మేలున్నది.

**ధనుస్సు:** ఆప్త మిత్ర సమాగమం. ఆదాయమందు అధిక ఆదరణ, అపూర్వ వస్తు సేకరణకు ఆస్కారం. వృత్తి యందు మెరుగు, ఆటపాటల ప్రావీణ్యతకు రాణింపు, గుర్తింపు, చేసే పత్రికా రంగాన గల చాకచక్యానికి ప్రశంస, యిత్యాది శుభ ఫలితాలు. కుమార్తె కుమారులకై చేసిన ఉద్యోగ యత్నా లందు సానుకూలత. స్త్రీలకు: వృత్తి యందు పెంపు.

**మకరం:** సాహిత్య సభలందు మీ ప్రావీణ్యత వికసింపనున్నది. విద్యా విషయంగా ఈ వారమంతా యోగాఢ్యమే. దాయాదుల వలన యిబ్బందులు రావచ్చు, గ్రహించాలి. ఉద్యోగ వృత్తు లందు అనుకూలత యున్నది. అయిన వారితో కానివారితో, యిబ్బందులు, మాట పట్టింపులు రావచ్చు, జాగ్రత్తగా చూచుకోండి. స్త్రీలకు: సాహితీ రంగాన యోగాభివృద్ధి.

**కుంభం:** మీ వృత్తి యందలి వికాసం మీరే గమనింపగలుగుతారు. రాజకీయ, సాహితీరంగాన మేలు చేకూరుట కూడ గమనింపదగిన అంశం. స్థితియందు పెంపు చేకూరుట, ముద్రణా యంత్రాంగాన శ్రమించు వారికి, పాత్రికేయులకు మేలు. స్త్రీలకు: రచనా వ్యాసంగాన యోగమున్నది.

**మీనం:** చాల విలువగల వస్తువులు సేకరింతురు. బంధువుల యిండ్లకు వెళ్లటం కూడ సంభవించనున్నది. సభారంగాన ప్రసిద్ధి యేర్పడనున్నది. చిత్రరంగ నిర్మాతలకు, దర్శక వర్గానికి, ఛాయాగ్రాహకులకు, పంపిణీదారులకు 'గురుని' ఆశీర్వ బలం యోగదాయకం. స్త్రీలకు. సర్వ విధాలా, సర్వ రంగాలందు మేలున్నది. యోగదాయక వారం.

- విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి

### ప్రేక్షకుల్లేని నాటక ప్రదర్శన

ఒక థియేటర్‌లో జరిగిన నాటక ప్రదర్శనకు అసలు ఒక్క ప్రేక్షకుడుకూడా లేడట, ఆ నాటకంలోని పాత్రధారులు తప్ప. అలా ఖాళీగావున్న థియేటర్‌లో హాస్య నాటికను ప్రదర్శించిన ఘనత ఆ పాత్ర ధారులకే దక్కుతుంది. ఇంతకీ ఆనాటిక పేరు 'బ్యాగ్'. ఇది 1983లో గ్రాంతమ్‌లో జరిగింది. ఈ అపూర్వమైన నాటక ప్రదర్శనకు ప్రేక్షకులు రాకపోతే రాకపోయారు కాని పాత్రధారులు మాత్రం రికార్డుల్లోకి ఎక్కారు ఈ నాటిక పుణ్యమా అని.

సీరియల్

# సాగరమథనం

## అడివి సూర్యకుమారి

**ఇంతవరకూ సాగిన కథ 10 :** శ్రీలంక ఉగ్రవాదులను అరికట్టడంలో మవంతు కర్తవ్యాన్ని నెరవేర్చి స్వదేశం తిరిగి వెళ్తున్న భారత శాంతిసేనకు వీడ్కోలిచ్చేందుకు వచ్చిన ముగ్గురు అధికారులు హత్యచేయబడతారు. ట్రింకోమలిలో శక్తి నెలకొల్పిన సేవాగ్రామంలో జయసూర్య డాక్టరుగా చేరతాడు. ...సింఘె పారిపోవటంలో నిర్లక్ష్యం చూపిన పోలీసుల్ని, ఇన్‌స్పెక్టరును డి.జి.పి. ...ఘువర్ణ కాల్చి చంపుతాడు. హెడ్‌క్వార్టర్సుకు తీసుకువెళ్తున్న ముగ్గురు వ్యాన్ ...వర్లను ఎత్తుకు వెళ్లిన వారిని అగ్ని పట్టుకుంటాడు కాని డ్రైవర్లు పరారీ ...వుతారు.

(గత సంచిక తరువాయి)

...రత రాజధానీ నగరం 'ఢిల్లీ ...్వదేశీయులతో విదేశీయులతో ...దడిగా కోలాహలంగా ...టుంది.

...విజిటర్స్ ఎట్రాక్ట్" టీ స్టాల్ రష్‌గా ...పి. టీస్టాల్‌లో కూర్చొని టీ ...తున్నాడు అగ్ని. కొత్తగా ...నట్టున్నారు.

... మధ్య కాలంలో చూసిన గుర్తు ... టీ చాలా బాగుంది. మరో కప్పు ...ంచుకొన్నాడు. టీ తాగుతూ దృష్టి ...సారించాడు.

...ర కిలో మీటరు దూరంలో ఎత్తుగా ... అందాలు సంతరించుకుంటున్న ...రెన్స్ బిల్డింగ్ కన్పడుతోంది.

...రం రోజుల్లో అక్కడొక మీటింగ్ ...బోతోంది. దానికై సన్నాహాలు ...త్వరగా జరుగుతున్నాయి. అగ్ని దృష్టి అటునుండి టీస్టాల్‌లోకి వచ్చింది. కౌంటర్ దగ్గర కూర్చున్న వ్యక్తి వృద్ధుడు. జొన్న పీచు లాంటి గెడ్డం, లాల్చీ పైజమా, పైన నీలం రంగు మొహమల్ వెస్ట్ కోటు ధరించాడు.

టీ అందించే వాళ్ళు నల్గురున్నారు. వారి వయస్సు దాదాపు ఇరవై ఐదుకి, ముప్పైకి మధ్యలో వుండొచ్చు.

ఆ టీ స్టాల్‌కి నల్గురు సర్వర్లు అనవసరం అన్పించింది అగ్నికి.

అగ్ని లేచి డబ్బివ్వటానికొచ్చాడు కౌంటర్ దగ్గరికి. పది రూపాయల నోటు అతనికిస్తూ యథాలాపంగా పక్కకి చూశాడు.

సర్వర్స్ నల్గురిలో నల్లగా సన్నగా చువ్వలా వున్న వ్యక్తి తనని తదేకంగా చూడటం గమనించి చూపు మరల్చుకున్నాడు.

చిల్లర తీసుకొని బైటికొచ్చాడు అగ్ని. ప్యాంట్ జేబులో చేతులు పెట్టుకొని ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

అతని ఆలోచనల వేగానికి టీస్టాల్‌లోని వ్యక్తి మరుగునపడ్డాడు.

పది రోజుల క్రిందట–

శ్రీలంకలోని తమిళుల సమస్య గురించి చర్చించేందుకు భారత రాష్ట్రపతి పంపిన ఆహ్వానం శ్రీలంకలోని భారత హైకమీషనర్ కందింది. భారత హైకమీషనర్ ఆ లెటర్‌ని శ్రీలంక ప్రెసిడెంటుకు అందచేశారు.

ఆ లెటర్‌లో ఇలా వుంది–

"భారత శ్రీలంక స్నేహ సంబంధాలు కేవలం ఇరుగు పొరుగు దేశాలని మాత్రమే కాకుండా ప్రత్యేకించి మీ దేశంలో, భారతీయుడైన ఓ మహోన్నత వ్యక్తి స్థాపించిన మతానికి మీ దేశీయులు అధిక సంఖ్యలో వారసులవటం మన మధ్య స్నేహ బంధాల్ని మరింతగా గట్టి పరుస్తున్నాయి. ప్రస్తుతం జరుగుతున్న పోరాటంలో కొద్దికాలం క్రితం భారతదేశం నుండి వలస వెళ్ళిన అనేకమంది తమిళులు ప్రధాన కారణం కావటం భారత్‌కి ఎంతో మనస్తాపం కల్గిస్తున్న చర్య. మీ క్షేమాన్ని కోరే భారత శాంతి సేనని మేం పంపడం జరిగింది. కొన్ని రాజకీయ కారణాల వల్ల

పూర్తి శాంతి చేకూర్చక మునుపే శాం
దళాన్ని మీరు భారత్‌కి పంపడ
మారెరిగున్నదే. అయితే శ్రీలంకలో
అలజడులకు కారణం అ
చెప్పుకుంటున్న కొన్ని వర్గాల వా
భారత్ శాంతి సేన వెళ్ళిపోతే చాలు మే
శాంతియుతంగా పరిష్కార
చేసుకుంటాం అని చెప్పారు. కా

అందుకు భిన్నంగా ఈ రోజు ద
జరుగుతున్న మారణకాండ చూస్తు
వారంతా మన ఇరు దేశాల వారిని త
దోవ పట్టించారేమోనని పిస్తోంది.
ఆర్థికంగా, సామాజికంగా అమా

ప్రజలు మోసపోతున్న తీరు చ
అనతికాలంలో ఒక పరిష్కార
రావడానికి వెంటనే ఇండ
సంబంధించిన ప్రభుత్వ కార్యాచ

[redacted]

ప్రశ్నావళి:

# రచయిత్రి జవాబులు

శ్రీలంకలో ప్రస్తుత రాజకీయ పరిణామాల మీద, జాతి విద్వే ?లమీద పాఠకులు అడిగే ప్రశ్నలకు రచయిత్రి శ్రీమతి అడివి ?ార్యకుమారి ఆంధ్ర సచిత్ర వారపత్రికలో జవాబులు యిస్తారు. ?ఠకులు తమ ప్రశ్నలను కార్డుమీద వ్రాసి -

"సాగర మథనం ప్రశ్నావళి", ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయ ?డ-3 అన్న చిరునామాకు పంపాలి: వ్యక్తిగత ప్రశ్నలు, చొప్పదంటు ప్రశ్నలు ?వని మనవి. - ఎడిటర్



...న్ని ఇక్కడకు పంపినచో ...త్వరలో శ్రీలంకలో శాంతిని ...ంచవచ్చుని మేం నమ్ముతున్నాం"

ఆహ్వానాన్ని సమ్మతించి వారు ...గ్గురు సభ్యులున్న ఓ కార్యాచరణ ...న్ని పంప నిశ్చయించారు.

సంఘంలో ప్రధాని, విదేశాంగ ...తి కాక స్థితబోధి చేరటం ఒక్కసారి ...రినీ ఆశ్చర్యపరిచింది.

జి. పి.గా స్థితబోధి కార్యనిర్వహణ అతను శాంతి స్థాపనకై సల్పిన కృషి, ...ర్థతలకి ఫలితంగా అతణ్ణి హోమ్ కార్యదర్శిగా నియమించారు. కనుక ...తో పాటు స్థితబోధి కూడా ఇండియా ...న్న వారిలో ఉన్నాడు.

ముగ్గురూ చర్చలకై ఇండియా ...న్నట్లుగా లెటర్ భారత్ ...షనర్‌కి వెళ్ళిపోయింది.

## సాగర మథనం

సడన్‌గా జీప్ పక్కన ఆగటంతో తలెత్తి చూశాడు అగ్ని. అతని ఆలోచనలకి ఫుల్ స్టాప్ పడింది.

లోపలున్న వ్యక్తి అతణ్ణి చూస్తూ 'ఇదేమిటి కాలి నడకన వస్తున్నారు. రండి' అన్నాడు.

అగ్ని జీప్ ఎక్కి కూర్చున్నాడు.

అతను సీరియస్‌గా ఆలోచిస్తుండటం చేత అవతలి వ్యక్తి పలకరించలేదు.

వారం తిరిగొచ్చింది-

ఆ రోజు-

ఇందిరాగాంధీ ఇంటర్నేషనల్ ఎయిర్ పోర్టులో శ్రీలంక ఎయిర్‌లైన్స్ విమానం ఆగింది.

ప్రొటో కాల్‌ను అనుసరించి భారత్




ప్రధాని విదేశాంగ శాఖా మంత్రి ఇతర కార్యదర్శులు సాదరంగా వచ్చిన వారిని ఆహ్వానించారు.

ఎయిర్ పోర్టు అంతా పత్రికా ప్రతినిధులతో నిండింది.

కెమెరాల 'క్లిక్' శబ్దాలు- సందడిలో కలిసిపోయాయి. సాధారణ సంభాషణల తర్వాత అతిథుల్ని తీసుకొని కార్లు వెళ్ళిపోతున్నాయి.

దారి పొడవునా పిల్లలు భారత్ శ్రీలంకల జెండాలు పట్టుకొని నిలబడి వున్నారు.

శ్రీలంక ప్రధాని వారి వైపు చూస్తూ చిరునవ్వులతో చేతులూపారు.

ఆ మధ్యాహ్నం నుండే చర్చలు ప్రారంభమయ్యాయి.

కాన్ఫరెన్స్ హాల్ చుట్టూ బ్రహ్మాండమైన కట్టుదిట్టాలు చేయబడ్డాయి.

మిలిటరీ చుట్టూరా కాపలా వుంది. పంజాబ్ సమస్యతో నే సతమతమవుతున్న ప్రభుత్వం ఇప్పుడేదైనా గొడవ జరిగితే శ్రీలంకతో శాశ్వత వైరం కొనితెచ్చుకున్నట్లవుతుంది.

ఓ పక్క నెత్తిపై కుంపటిలా కాశ్మీరు సమస్య. కాశ్మీర్‌ని తన దేశంలో కలుపుకోవాలని పాకిస్తాన్ శతధా ప్రయత్నిస్తోంది. ఆ ప్రయత్నాల్లోని భాగాలే కాశ్మీర్‌లో అల్లర్లు, లూటీలు, దహనకాండలు. ఓ ప్రక్క పంజాబ్ టెర్రరిస్టులకు, మరో ప్రక్క కాశ్మీర్ ఉగ్రవాదులకు శిక్షణ ఇచ్చి భారత్

ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకుంటూ భారత్‌లో ఆందోళనలకి దారి తీసింది.

పైన ఈ విధంగా వుంటే క్రింద శ్రీలంక సమస్య. తమిళుల ఊచకోతకి నిరసన తెలిపాము. శ్రీలంక కోరిక మీదే శాంతి సేన పంపబడింది. తిరిగి వారు వద్దనగానే చాలా మటుకు తిరిగి స్వదేశానికి రప్పించారు.

అయినా అల్లర్లు తగ్గలేదు. శ్రీలంక మండే అగ్ని గుండంలా వుంది.

అన్ని విషయాల్ని చర్చించేందుకే ఇప్పుడీ సమావేశం.

ఇండియాలోని స్పెషల్ ఇంటెలిజన్స్ రిపోర్టుల్ని బట్టి చూస్తే, కొన్ని విదేశీ శక్తులు శ్రీలంక ఆంతరంగిక విషయాల్లో జోక్యం. చేసుకొని అక్కడి ప్రభుత్వాన్ని బలహీన పరిచి తర్వాత అచట తమ సార్వభౌమాధికారాన్ని స్థిరపరుచుకొని అతి సమీపంగా వున్న ఇండియాకి పక్కలో బల్లెం కావటమేనని తెలిపారు.

దీనికి కారకులెవరో తెలిసిపోయింది. కాని... అక్కడ ఆయా దేశాల ఏజెంట్స్‌ని గుర్తించి బైటపెట్టడమే ఇండియా ప్రధాన కర్తవ్యంగా భావిస్తోంది. తద్వారా శ్రీలంక తమ సార్వభౌమాధికారాన్ని నిలబెట్టుకొనేట్లు చేయటమే తమ లక్ష్యమని, హిందూ మహాసముద్రంలో శాంతి పరిరక్షణే తమ ధ్యేయమని భారత నాయకులు స్పష్టంగా తెలియజేశారు.

ఈ చర్చలకి ఇరు ప్రభుత్వాలు ఎంతో ప్రాముఖ్యాన్నిచ్చాయి.

అందుకే-

## రంజిత్ ప్రేమలో అనూ అగర్వాల్



'ఆషికి' హీరోయిన్ అనూ అగర్వాల్ రంజిత్ ప్రేమలో పడింది. రంజిత్ అంటే యిప్పుడు విలన్‌గా వస్తున్న అతను కాదట. సితారాదేవి కొడుకు రంజిత్ బారోట్. వీళ్ళిద్దరికీ చాలా రోజుల క్రితమే పరిచయమై అది ప్రేమగా మారింది. ఒకళ్ళున్నచోటికి మరొకళ్ళు రాకపోకలు సాగించటం కూడా మొదలెట్టారు. ప్రస్తుతం రంజిత్ న్యూయార్క్‌లో వున్నాడు. ప్రతి రాత్రి వాళ్ళిద్దరూ ఫోనులో వసంత రాత్రుల్ని చవి చూస్తున్నారట. •

కాన్ఫరెన్స్ హాల్ చుట్టూ గట్టి బందోబస్తు ఏర్పాటు చేయబడింది.

హాల్ చుట్టూ 'సెన్సర్స్' పెట్టారు.

సోనార్ సెన్సర్స్ గ్యాస్ సెన్సర్స్ అమర్చారు.

చీఫ్ సెక్యూరిటీ ఆఫీసర్ బ్రిగెంజాతో మాట్లాడుతున్నాడు అగ్ని.

"నేనే సెన్సర్స్ హాల్ చుట్టూతా ఎందుకు పెట్టమన్నానో మీకీపాటికి అర్థమై ఉండాలి. లోపలకి పాయిజెనెస్ గ్యాసెస్ గాని, ఎక్స్‌ప్లోజివ్ మెటీరియల్ గాని ఆ ప్రాంగణంలోకి రాబోతోంటే ఈ సెన్సర్స్ సౌండ్ ద్వారా తెలియచేస్తాయి.'

'ఔను. బాగుంది- ఇదే కాకుండా మీరు చెప్పిన ఏర్పాట్లు కూడా చేశాను. రండి. చూపిస్తాను' అన్నాడు బ్రిగెంజా.

'పదండి' నడిచాడు అతనితో అగ్ని.

ఓ గదిలో నాలుగు కుక్కలు, ఒక పిల్లి ఉన్నాయి.

అవి ప్రత్యేకంగా శిక్షణ ఇవ్వబడ్డవి.

'గుడ్- ఇంకో పది నిముషాల తర్వాత వీటిని విడిచి పెట్టండి. బిల్డింగ్ అంతా ఓ' రౌండు కొట్టి వస్తాయి. అనుమానితులెవరైనా వుంటే పసిగట్టి పట్టిస్తాయి' అంటూ పిల్లి దగ్గరికి వెళ్ళాడు'అగ్ని.

'ఇది ఆస్ట్రేలియాకి చెందిన సిల్వర్ క్యాట్. దీనికి కూడా ప్రత్యేకంగా శిక్షణ ఇవ్వటం జరిగింది' అంటూ దానితో పని చేయించుకోవటానికి ఇవ్వవలసిన గుర్తులు, సూచనలు చెప్పాడు అగ్ని.

ఫ్రెండ్లీ మూవ్‌మెంటు చూపించాడు అగ్ని. పిల్లి అతని వైపు ఒకసారి చూసి దగ్గరికొచ్చింది. అగ్ని చెయ్యి చాచి దాన్నెత్తుకున్నాడు.

'హాయ్. లిటిల్ మాస్టర్! హౌ ఆర్ యూ!' అన్నాడు.

సిల్వర్ క్యాట్ సమాధానంగా అతని చేతిపై మూతితో రాచింది

'బాగున్నానన్నట్టు

అగ్ని నవ్వి దాన్ని దించి సెక్యూరిటీ ఆఫీసర్‌తో బైటికి నడిచాడు.

సిల్వర్ క్యాట్ అతనితో పాటు అతనెక్కడికెళ్తే అక్కడికొస్తోంది.

మిగతా ఏర్పాట్లు చూస్తూ వెళుతున్నాడు అగ్ని. అతనలా పిల్లిని వెంటబెట్టుకొని తిరగటం కొందరికి ఆశ్చర్యాన్ని, కుతూహలాన్ని కల్గించింది.

అక్కడ ఎవరికీ అగ్ని ఎవరో తెలీదు.

సెక్యూరిటీ ఆఫీసర్‌ని చూసి 'ఏమిటీ వింత?' అన్నట్టు మౌనంగా ప్రశ్నించసాగారు.,

అతను చూసి • చూడనట్టు, గమనించనట్టుగా వారి చూపులు పట్టించుకోకుండా ముందుకు సాగుతున్నాడు.

అలారం బెల్స్, ఎలక్ట్రిఫైడ్ ఫెన్సింగ్, మెటల్ డిటెక్టర్స్- ఇవన్నీ మామూలుగా ఉంచే భద్రతా ఏర్పాట్లు- అవి చూసి బైటికొచ్చారిద్దరూ.

కాన్ఫరెన్స్ హాల్‌కి చుట్టూ అరకిలో మీటరు దూరంలో ఏమీ అనుమానించటానికి అవకాశం కలగని విధంగా ఏర్పాట్లు చేశారు.

అరకిలో మీటరు పరిధిలో ప్రత్యేకమైన పాస్‌లున్న అధికార వాహనాలు తప్ప మరే విధమైన వాహనాలు తిరగటానికి లేకుండా ఏర్పాటు చేశారు.

## సాగర మథనం

మొదటి విడత శ్రీలంక బృందం ఇక్కడ చర్చించాక, రెండవ దఫా చర్చలకై భారత బృందం శ్రీలంకకు వెళ్లే ఒప్పందం జరిగింది.

మొదటి రోజు చర్చలు సుహృద్భావ వాతావరణంలో జరిగాయి.

నాయకుల మొహాల్లో చర్చలు ఫలిస్తాయన్న ఆశాభావం కన్పడసాగింది.

రెండవ రోజు-

'విజిటర్స్ ఎట్రాక్ట్' టీస్టాల్‌కి కొద్ది దూరంలో కొన్ని ట్రక్కులు ఆగి ఉన్నాయి. వాటి యజమానులు కాన్ఫరెన్స్ హాల్ ప్రక్క నుండి వెళ్లాలంటున్నారు. రెండు గజాల కొక్కరు చొప్పున నిలబడ్డ సెక్యూరిటీ గార్డ్స్ వారిని వారించారు.

కొద్దిసేపు ఇరు పక్షాల మధ్య వాగ్యుద్ధం జరిగింది.

ఆ తర్వాత వాళ్ళు ట్రక్కులు వదిలి తమ వాణ్ణొకణ్ణి అక్కడ కాపలా వుంచి వెళ్లిపోయారు. పోతూ-

"పాస్ లేనంత మాత్రాన మమ్మల్ని ఆపుతారా? ఈ ట్రక్కు లెవరివో తెలుసా?' అన్నారు.

'ఎవరివైనాగాని, పాస్ చూపించనిదే వెహికిల్‌ని ఈ దారిగుండా వెళ్లనివ్వం' ఖచ్చితంగా చెప్పాడు గార్డు.

'మంత్రిగారితో చెబుదాం పదండి' అంటూ పోలోమని వెళ్లిపోయారు వాళ్ళు.

వాళ్ళు వెళ్లి గంటైంది.

ట్రక్కులో ఉన్న అతను ట్రాన్సిస్టర్ ఆన్ చేసి పాటలు వింటున్నాడు. అప్పటికి రెండుసార్లు ట్రక్కులో ఉన్న ఫ్లాస్క్ తెరచి కాఫీ తాగాడు.

మరో గంట గడిచింది. పోయిన వాళ్లింకా రాకపోవటంతో అతనికి చాలా చికాగ్గా వుంది. వాళ్లొచ్చే దారి వైపు మాటి మాటికి చూడసాగాడు

ఇంతలో -

టీస్టాల్‌లో నుండి చువ్వలా, పొడుగ్గా వున్న వ్యక్తి ఎలుకల బోనుతో బైటికొచ్చాడు.

ఇళ్ల మధ్యలో వదిలితే జనం తిట్టి పోస్తారు. దూరంగా తీస్కెళ్లి వదలాలని వెళుతున్నాడు. ప్రక్కకి మలుపు తిరిగాడు.

ఓ అరగంట తర్వాత అతను ఖాళీ బోనుతో వస్తున్నాడు.

ఇంతలో వెళ్లిన వాళ్లంతా వచ్చారు.

ట్రక్కులు వెనక్కి మళ్లాయి.

అది గమనించి గార్డ్స్ ముసి ముసి నవ్వులతో 'వీళ్లా మనల్ని కాదనేది?' అన్నట్టు విజయగర్వంతో చూశారు వాళ్ల వైపు.

పది నిముషాల తర్వాత అగ్ని గబగబ కాన్ఫరెన్స్ హాల్‌లోకి వెళ్లాడు.

సిల్వర్ క్యాట్ తోక మీద మూడుసార్లు తట్టాడు.

అది ఒక్కసారి అతని వైపు చూసి చెంగున గెంతినట్టుగా పరిగెత్తుకుంటూ వెళ్లిపోయింది.

కాన్ఫరెన్స్ హాల్ పరిసరాలంతా ప్రతి కార్నర్ గాలించసాగింది సిల్వర్ క్యాట్.

అలా గాలిస్తూ బిల్డింగ్ వెనక భాగం వైపొచ్చింది.

అక్కడ-

నీటి గొట్టం పక్కగా-

తడి ఉన్న చోట- కొత్తగా బొరియ చేసుకుంటూ లోపలికి పోవడానికి తంటాలు పడుతోంది ఎలుక. కొంచెం



ఆగి, మొహం పైకెత్తి, ఇంత కష్టపడకుండా లోపలికి వెళ్ళే మార్గం మరేదీ లేదా అన్నట్టు పైకి, ప్రక్కలకి చూస్తోంది.

ఏమీ లాభం లేదనుకుందో ఏమో మళ్ళీ శరీర శ్రమే పడ్తోంది.

ఒక్క క్షణం దాన్నలాగే చూసి, తటాలున మీద పడి నోట కరుచుకొని వెనక్కి పరిగెత్తిుంది సిల్వర్ క్యాట్.

రెండు నిముషాల్లో అది అగ్ని దగ్గరికొచ్చింది. దాన్ని చూస్తూనే 'శభాష్' అన్నాడు అగ్ని.

బ్రిగెంజాకేం అర్థం కాలేదు.

సహజంగా పిల్లి ఆహారం ఎలుక. ఎలుక కన్పిస్తే పిల్లి వదలదు కదా. ఇందులో ప్రత్యేకత ఏముందని?

ఎలుక మూతి కొద్దిగా కొరికి వేసింది.

'బుద్ధి పోనిచ్చుకున్నావ్ కాదు' అంటూ దాని నోటి నుండి ప్రాణావశిష్టంగా ఉన్న ఎలుకని లాగాడు అగ్ని.

ఎలుక శరీరమంతా నొక్కి చూశాడు.

తోక వైపు రెండుసార్లు నొక్కి చూసి 'మైగాడ్' అంటూ తన చేతి సంచీలో వాన్ని పడేసుకొని బైటికి పరిగెత్తసాగాడతను.

బ్రిగెంజా ఆశ్చర్యంగా చూడసాగాడు.

ఇతనికి పిచ్చిగాని ఎక్కలేదు గదా అనుకున్నాడు.

అగ్నిని గార్డ్సు కూడా ఆశ్చర్యంగా చూడసాగారు.

'వాట్ హాపెండ్ సర్', అని ఒకరిద్దరు అతని దగ్గరికి రాబోయారు కూడా.

'ప్లీజ్. డోంట్ మూవ్' అని అరుస్తూనే బైటికొచ్చేశారు.

కారులోకి దూకినట్టుగా కూర్చొని స్టార్ట్ చేశాడు. కారు రయ్యిన దూసుకు పోయింది.

విజిటర్స్ ఎట్రాక్ట్ హోటల్ దగ్గరికి కారొచ్చేసరికే స్లో చేశాడు అగ్ని.

సంచీని టీస్టాల్ మీదికి విసిరేసి స్పీడ్‌గా పోనిచ్చాడు. అతనా వీధి చివరి దాకా ఐనా పోలేదు. టీస్టాల్ గోడలు పెద్ద ప్రేలుళ్ళతో గాలిలోకి లేచాయి.

(ఇంకా వుంది)



# రేఖా భర్త ఎందుకు చనిపోయాడు?

ఢిల్లీలోని ప్రముఖ పారిశ్రామికవేత్త ముఖేష్ అగర్వాల్ ఆత్మహత్య చేసుకున్నాడు. ఒక టెలివిజన్ సెట్ల తయారీ సంస్థ అధినేత అయిన 37 సంవత్సరాల అగర్వాల్ మరెవరో కాదు. ప్రముఖ హిందీ నటి రేఖ రెండవ భర్త. వినోద్‌మెహ్రాను తొలుత వివాహం చేసుకున్న రేఖ అతన్ని విడిచిపెట్టి అగర్వాల్‌ను వివాహ మాడింది. పట్టుమని 7 నెలలైనా కాకుండానే అగర్వాల్ ఆత్మహత్యకు పాల్పడ్డాడంటే బలీయమైన కారణమే వుండి వుండాలని అనుకుంటున్నారు అంతకుముందు కనీసం స్నేహం కూడా లేని వీరిద్దరూ వివాహం చేసుకుంటుంటే అందరూ నోళ్ళు తెరిచారు తర్వాత అందరి నోళ్ళు మూయించింది రేఖ. కాని రెండు నెలలుగా వీరిద్దరి మధ్యా గొడవలు చెలరేగి అగర్వాల్‌తో సరిపడక రేఖ బొంబాయికి మకాం మార్చేసింది. మరి ఆ గొడవల పర్యవసానమే ఈ ఆత్మహత్యకు కారణమేమో తెలియటం లేదు. అదీగాక ప్రస్తుతం అమెరికాలో వుంటున్న రేఖ భర్త అంత్యక్రియలకు కూడా హాజరు కాలేదు అయినా అంత పెద్ద పారిశ్రామికవేత్త అయివుండి అల్ప్రాల్ భార్య అలిగిపోతే ఆత్మహత్యకు పాల్పడాల్సిన అగత్యం ఏమొచ్చిందో? రేఖ ప్రవర్తన బావుండకపోతే విడాకు లిచ్చేసి మరొకరిని పెళ్ళి చేసుకోక యింత అఘాయిత్యానికి ఎందుకు పాల్పడ్డాడో దర్యాప్తులో కాని తేలదు

# మాటలకి ప్రాణం పోసే పాటల రచయితలు

ఏదైనా ఒక సినిమా 'హిట్' అయిందంటే, అది యే భాషా చిత్రమైన కావచ్చు, దానికి అనేకానేక కారణాలుంటాయి. నిర్మాత పేరున్న వాడవచ్చు, దర్శకుడు పేరున్న వాడవచ్చు లేకపోతే నటీ నటులు అమోఘ నటనా చాతుర్యంగల వారవచ్చు. అయితే యివన్నీ కాకుండా కేవలం పాటల వల్లనే కొన్ని సినిమాలు విజయవంతం అవుతాయి.

ఏదైనా ఒక సినిమా మనకి కొన్ని సంవత్సరాలైన తర్వాత గుర్తు వచ్చిందంటే అందులోని పాటలే కారణం. పాతకాలం నాటి కిస్మత్, మహల్, మొగల్–ఎ– ఆజం, చల్తీ కానాం గాడీ, రాజ్‌కపూర్ చిత్రాలు, ఆరాధన, జంగ్లీ అలాగే యీ మధ్య రిలీజ్ అయిన ఖయామత్‌సే ఖయామత్ తక్', మైనే ప్యార్‌కియా– దీనికి ఉదాహరణ. ముందు పాట గుర్తొచ్చిన తర్వాతనే దిలీప్‌కుమారో, షమ్మీకపూరో, మధుబాలో గుర్తుకు వస్తారు. అయితే యీ పాటల గొప్పతనం, ప్రఖ్యాతి చాలా వరకు సంగీత దర్శకుడు, గాయకుడు కొట్టేస్తారు. అయితే ఆ గీత రచయితకు మాత్రం అంతగా గుర్తింపు రాదు.

ఒకపాట, అలాగే ఒక సినిమా చిరస్మరణీయంగా వుండేందుకు శ్రమపడే కొంతమంది 'హిందీ గీత్‌కార్' (గీత రచయితలు) లను గురించి కొద్దిగా తెలుసుకుందాం.



హస్రత్‌జైపురి

హిందీ సినీ రంగంలో అనిల్ విశ్వాస్, సి. రామచంద్ర, శంకర్ జైకిషన్, ఒ.పి. నయ్యర్, ఎస్.డి. బర్మన్, లక్ష్మీకాంత్–ప్యారేలాల్ లాంటి సంగీత దర్శకులు, రఫీ, ముఖేష్, కిషోర్, తలత్ మెహమూద్ లాంటి గాయకులు వున్నట్టే మజ్‌రూహ్ సుల్తాన్‌పురి, హస్రత్ జైపురి, శైలేంద్ర, నీరజ్ లాంటి గొప్ప గీత రచయితలు వున్నారు.

## హిందీ వెండితెర బంగారు కాంతులు

అనాటి 'షాజహాన్' నుండి ఈ నాటి 'ఖయామత్... తక్' వరకు కొన్ని వేల అద్భుత గీతాలను అందించిన గీత రచయిత 'మజ్‌రూహ్ సుల్తాన్‌పురి' తన 44 యేళ్ల సుదీర్ఘ సినీ జీవిత చరిత్రలో ఎన్ని పాటలు వ్రాశాడో అతనికి లెక్క తెలియదు.

అతను రాసిన వాటిలో హిట్‌సాంగ్స్'కే లెక్కలేదు. ఉత్తరప్రదేశ్‌కి చెందిన యితనికి ఉర్దూ కవిత్వం మీద ప్రేమ ఎక్కువ. మొదటి దశలో కమ్యూనిస్ట్ భావాలు కలిగి వున్నా తర్వాత వాటిని వదిలేశాడు. ఇతను డాక్టర్ కూడా. అతనికి నచ్చిన అతని పాటలు– తన మొదటి పాట 'జబ్‌దిల్‌హీ టూట్‌గయా (షాజహాన్)తో పాటు 'అభిమాన్' లోని తెరేమెరే మిలన్‌కా యేరైనా, యూతో హమ్‌నే లాఖ్ హసీఁదేఖా (తుమ్‌సా నహీదేఖా), సుజాతలోని జల్‌తేహై జిస్‌కేలియేలాగే ఖయామత్‌సే....లో పాటలు.

## జర్నలిస్టు రచయిత

'ప్యాసా'లో పాటలు, కభీ కభీలో పాటలు వింటుంటే ఎస్.డి. బర్మన్, ఖయ్యాంలతో పాటు మనకి 'షాహిర్– లూధియాన్వి కూడా గుర్తుకు వస్తాడు. అయితే యితని అసలుపేరు 'అబ్దుల్ హయ్' లూధియానాలో జన్మించాడు. ఇతనూ వామపక్ష వాది. 'సవేరా' అనే పత్రికకి సంపాదకత్వం కూడా నిర్వహించాడు. సంగీతదర్శకునితో పాటు గీత రచయితకు కూడా సమానంగా పారితోషికం యివ్వాలని వాదించిన మొదటి వ్యక్తి. యేదునియా అగర్‌మిల్ భిజాయే తోక్యాహై (ప్యాసా), పావ్ ఛూలేనేదో (తాజ్‌మహల్), యేరాత్ యేచాందనీ (జాల్), కభీ కభీ మెరేదిల్‌మే (కభీకభీ) గీతాలు అతనికిష్టమైన గీతాలలో కొన్ని. ఇతను బ్రహ్మచారి కానీ యితనికి పంజాబీ రచయిత్రి అమృతాప్రీతమ్‌తో సంబంధం వుందని కొంత కాలం క్రితం హిందీ సినీరంగంలో అంటూ వుండేవారు.

రాజ్‌కపూర్ సినిమాలలో పాటలు ఆణిముత్యాలయ్యాయంటే అందుకు కారణం శంకర్‌జైకిషన్, ముఖేష్, మన్నాదేలతో పాటు హస్రత్ జైపురి కూడా. జన్మత: జైపూర్ వాడైనా బొంబాయి వచ్చి బస్ కండక్టర్‌గా స్థిరపడ్డాడు. బొంబాయిలో యితన్ని చూసి పృథ్వీరాజ్‌కపూర తన కొడుకు రాజ్‌కపూర్‌కి రికమెండ్ చేశాడు. సినిమా గీతాలు రాయడం కన్నా గజల్స్ రాయడంలో నే సంతృప్తి వుంటుందంటాడు యితను.

తేరి ప్యారీ ప్యారీ సూరత్‌కో కిసీకి నజర్‌నాలగే (ససురాల్) బహారో ఫూల్‌బరసావో (సూరజ్), యేమేరా



మజ్రూహ్‌సుల్తాన్‌పురి

ప్రేమ్‌పత్ర్ (సంగమ్), జానేకహాంగయే వోదిన్ (మేరా నామ్ జోకర్)- అలాగే బరసాత్, శ్రీ చార్ సౌ బీస్, బాబీ సున్‌సాయీ బసున్ (రామ్ తేరీ- గంగా మైలీ) మొదలైన అద్భుతమైన గీతాలు హస్రత్- జైపురి'వే.

## పూరబ్ అవుర్ పశ్చిమ్

ఇప్పటికీ యువతరం నోటిలో నలిగే 'ఆప్‌జైసాకోయీ ఆయే జిందగీ మే (ఖుర్బానీ) పాట అలాగే దేశభక్తి పుట్టిపడే దుల్హాన్‌చలీ.... లేకే తీన్‌రంగ్‌కీ డోలీ (పూరబ్ అవుర్ పశ్చిమ్), లాంటి పాటలు రాయగల దిట్ట శ్యామ్‌లాల్. అయితే శ్యామ్‌లాల్'గా చాలా తక్కువమందికి తెలుసు. ఇతని కలం పేరే 'ఇందీవర్' పుట్టిన వూరు 'ఝాన్సీ'. యువకుడుగా


ఇందీవర్


గుల్జార్


ఆనందబక్షీ

వున్నప్పుడు భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని జైలుకి వెళ్లాడు. నాగపూర్‌లో వున్న గాంధీగారి ఆశ్రమంలో స్థిరపడదామనుకున్నాడు. కానీ అక్కడ ప్రవేశం దొరకక పోవడంతో బొంబాయిలో స్థిరపడ్డాడు. అందుకేనేమో 'పూరబ్ ఔర్ పశ్చిమ్'లో అద్భుత గీతాలు రాయగలిగాడు. చందన్ స బదన్ (సరస్వతీచంద్ర), తాల్‌మిలే నదీకీ జలమె (అనోఖీ రాత్) బడే అర్‌మానో సే రఖాహై బలమ్ తేరీ కసమ్ (మల్హార్) యితనికి నచ్చిన యితని స్వంత గీతాలు.

అలాగే రెండు విభిన్న భావాల గీతాలను అద్వితీయంగా రాయ గలిగినది 'రాజేంద్రకిషన్. 'ఆషా' చిత్రం (కిషోర్‌కుమార్) లోని 'ఇనామినడీగా హాయి కపనీకా' వంటి హుషారైన పాటలు, 'యె జిందగీ వునీకి హై జో కిసీకహోగయా (అనార్కలి) లాంటి

గీతాలు వ్రాయగల దిట్ట. సినిమా పాటలే కాకుండా మాటలు స్క్రీన్‌ప్లే కూడా రాశాడు. 'బొంబాయి రేస్'లలో ఒకసారి లక్షలాది రూపాయల జాక్‌పాట్ తగలడంతో సినీరంగాన్ని వదిలేశాడు.

రాజ్‌కపూర్ చిత్రాలు చిరకాలం గుర్తుండి పోవడానికి కారణం ఆ సినిమాల్లో పాటలు. ఆ పాటలకు జీవం పోసిన వారిలో యిద్దరు 'శంకర్'లున్నారు. ఒకరేమో శంకర్- జైకిషన్‌లలోని శంకర్- మరొకరు గీత రచయిత 'శంకర్'. 'శంకర్' అనేది శైలేంద్ర అసలు పేరు. జన్మతః బీహారీ. యితను రైల్వే 'ఫిట్టర్'గా పనిచేస్తూ కవి సమ్మేళనాలలో పాల్గొంటూ వుండేవాడు. ట్రేడ్ యూనియన్ నాయకుడు. సినీ గీతాలు రాయడం అంటే 'ఆత్మని అమ్ముకున్నట్టు' అని మొదట భావించినా తర్వాత పరిస్థితుల ప్రభావం వలన సినీరంగానికొచ్చాడు. రాజ్‌కపూర్, వహీదారెహమాన్‌లతో 'తీస్రీకసమ్' అనే చిత్రం నిర్మించాడు. శ్రీ చార్ సౌబీస్‌లోని మేరాజూతా హై జాపానీ, ఆవారాహు (ఆవారా), అబ్‌కీ బరస్ భేజ్ భయ్యాకో బాబుల్ (బందినీ), సజన్‌రే ఝూట్‌మత్ బోలో (తీస్రీకసం) పాటలు యితనికి యిష్టం.

హిందీ సినిమాలకు అసంఖ్యాకమైన హిట్స్ అందించిన కలం 'ఆనంద్‌బక్షీ'ది. రాజేష్‌ఖన్నాని సూపర్‌స్టార్ చేసిన 'ఆరాధన' చిత్రంలోని యితని పాటలు ఆల్ టైం హిట్స్. ఇతని గీతాలకు 'లక్ష్మీప్యారేల సంగీతం తోడైతే బంగారానికి తావి అబ్బినట్టు వుండేది. బిందియాచమ్కేగీ, (దోరాస్తే) మేరే సప్‌నోంకీ రానీ కబ్ ఆయేగీతూ (ఆరాధన) పాటలు యితనికి అత్యంత ప్రీతి.

రాసినవి సంఖ్యలో తక్కువే అవవచ్చు గానీ, రాసిన ఆ కొద్ది పాటలలో అపూర్వ సాహిత్యాన్నందించిన కవి 'నీరజ్'. ఎస్. డి. బర్మన్ యితని గీతాలలో ఎక్కువ పాటలకి సంగీతం సమకూర్చాడు. దేవానంద్ తన సినిమాలకి 'నీరజ్' చేత రాయించుకునేవాడు. రాజ్‌కపూర్ తీసిన మేరా నామ్ జోకర్‌లో 'యే భాయ్ జర దేఖ్‌కే ఛలో' పాట యితను రాసిందే. గేంబ్లర్‌లోని ధీరేసేజానా బగియన్‌మే, చుడీ నహీ మెర దిల్, జీవన్‌క బగియా బెహాకేగీ (తేరేమేరే సప్‌నే), శంకర్ జైకిషన్ సంగీతంలో ఆద్‌మీ హు ఆద్‌మీసె ప్యార్‌కరతాహు (పహచాన్) పాట, మేరానాం జోకర్‌లో మన్నాడే పాడిన సర్కస్ పాటలాంటి మరుపురాని గీతాలు అందించాడు నీరజ్'.

బొంబాయిలో వున్న గ్యారేజీలలో, పెయింటింగ్ షాపుల్లో పనిచేసిన తరువాత బిమల్‌రాయ్ దగ్గర అసిస్టెంట్‌గా చేరి డైరెక్టర్ అయిన గీత రచయిత 'గుల్జార్' ఘరోందా, ఆంధీ, ఖూబ్ సూరత్, పరిచయ్ సినిమాలలో పాటలు గుల్జార్ సృష్టే.

ఇలాగే ఎస్. హెచ్. బిహారీ, వర్మామల్లిక్, అన్‌జాన్ మొదలైన వారు కూడా మంచి గీతాలను అందించారు. డిస్కో సంగీతం ఎక్కువయిన తరువాత, ట్యూన్‌కి అనుగుణంగా పాట వ్రాసే పద్ధతి పూర్తిగా అలవాటయిన తరువాత సినిమా పాటల్లో సాహిత్యపు విలువలు బాగా పడిపోయాయి.

(-జైవీర్)

కథల కాణాచి

# మౌనం కాదు.....

శారద కృష్ణమూర్తి

స్విచ్ ఆఫ్ చేసి నెమ్మదిగా రగ్గుని కప్పుకుని పడుకున్నాను. వీధి గదిలో పడకకుర్చీమీద కూర్చుని శర్మ పేపరు చదువుతున్నాడు. కొంచెంగా కళ్ళు మూతబడ్డాయి.

ఎవరోవచ్చి మంచంమీద కూచుని, మెల్లగా నా చెయ్యిల్ని తడిమి పట్టుకున్నారు. తర్వాత వక్షోజాలు మెత్తగా నా గుండెల్ని తాకినట్టయింది. నిశ్వాసం మెల్లగా విడుస్తున్నట్టుకూడా వినబడింది. వెంటనే ముసుగుతీశాను. లేవబోయాను.

పెద్ద జడేదో నామీద పడింది. జుట్టు లోంచి కమ్మని వాసనలు వెలువడుతున్నాయి. ఎవరో యవ్వనంలోని స్త్రీలా వుంది. ఇరవై ఏళ్లుంటాయి.

"ఎవరు?" అన్నాను ఏం అర్థంకాక. వీధిగదిలో శర్మ చదువుతూనేవున్నాడు.

"నేనా.....వేణ్ని!"

తిన్నగా కూచుని అంది కృష్ణవేణి - శర్మభార్య. అతిథిగా వెళ్లినందువల్ల ఆ వేళ తప్పితే ఆమెని యిదివరకెప్పుడూ చూళ్లేదు. "ఏమిటీ దారుణం?"

అదే పైకి అన్నాను.

"ఏదో ఋణం. ఆ ఋణం తీర్చిం చుకుందామనే వొచ్చాను."

సన్నని వేలితో బుగ్గ మీద మీటబోయింది. నేను వెనక్కు తగ్గాను.

"పాలు కారవులేవోయ్" అంది వయ్యారంగా కూనిరాగం తీస్తూ. నావైపు కొంచెం జరిగింది. నేను పూర్తిగా రగ్గుతీసి ఓమూలకు యిరికాను.

మా మాటలు విని శర్మ ఏమన్నా కదులుతాడేమో అంటే అదీ లేదు. అతను గమనించనట్లు వూరుకున్నాడు.

"మొగవాళ్లలోకూడా పతివ్రతలు వుంటారన్నమాట! తాకితే నీ బంగారం అంటుకుంటుందా?"

నాకు ఒళ్లుమండింది. ఏమిటీ సంసార వ్యభిచారం! మానవ నాగరికతలో ఒక నీతి, నియమం వుండొద్దూ?

"నీ వుద్దేశ్యం నాకు తెలిసిందికాని, పొరబడుతున్నావు. నేను వ్యభిచారాన్ని ప్రోత్సహించే మూర్ఖుణ్ణికాదు. ఆడవాళ్ల చేతుల్లో ఆటవస్తువుని కాదు. అడుగో నీ భర్త అక్కడికి వెళ్లు" అన్నాను.

"నా ప్రియ సారంగధరా...." అని గెడ్డం పట్టుకోబోయింది. వీధిగది లోని దీపంనుంచి వొచ్చే గుడ్డి వెలుతురులో ఏదో కాదు పిశాచంలా కనబడింది.

"షటప్-" అని చేతినీ, మనిషినీ తోసివుచ్చాను.

వాగరుస్తూ లేచి నించుంది.

"ఇందాకటి నుంచి ఏదో ఎప్పుడన్నా నాటకంలో సారంగధర వేషం వేశారను కున్నాను. ఛీ! మూర్ఖుడా! కోరి వచ్చిన ఆడదాన్ని అనుభవించడం చేతకాని అమాయకుడా! నీ యింతోటి అందాన్ని మోహించి వచ్చాననుకున్నావా! ఫో" అంటూ అక్కడి నుంచి వెళ్లిపోయింది.

శర్మ యింకా వీధిగదిలో పేపరు చదువుతూనే వున్నాడు. నా బెడ్డింగ్ సర్దుకుని నేను కదిలాను. అతను అడ్డలేదు.

అంతా కళ్లకి కట్టినట్టయింది. ఆవేళ....ఆ స్థితిలో చూసిన కృష్ణవేణ్ని ఈవేళ యీ స్థితిలో చూసాను.

ఏదో వింత కేసొచ్చిందని రమ్మనమని డాక్టరు మూర్తిగారు కబురుచేస్తే వచ్చాను.

కృష్ణవేణి జబ్బులో ముఖమంతా నల్లబడి, జీర్ణావస్థలో పడుకుని వుంది. నన్ను చూసి చేతులు జోడించి, కూచోమని సంజ్ఞ చేసింది.

పక్కని స్టూలుమీద కూర్చున్నాను.



మనిషి పాలిపోయి అస్థిపంజరమయింది. చేతులూ, వేళ్లూ, ముఖం, ఎముకలు తప్ప వేరేం కనబడ్డంలేదు.

డాక్టరు మూర్తిగారు అన్నారు "ఆవిడే మిమ్మల్ని పిలిపించమని అడిగింది. మీతో ఏదో మాట్లాడాలట."

నాకు ఆశ్చర్యమేసింది. ఆరేళ్లక్రిందట జరిగిన ఆ సంఘటనలు తప్ప నాకూ, ఆమెకూ, వేరు పరిచయం లేదు. ఏం చెపుతుంది నాతో?

ఆలోచనలో వున్న నా మీద ఎముకల్లాంటి వేళ్లుపడి స్పృహకలిగించాయి.

"నన్ను క్షమించవూ" అంది. కళ్లలో నీళ్లునిండాయి.

నెమ్మదిగా వేళ్లు నిమిరాను.

"శర్మ ఎక్కడ?" అన్నాను.

"ఏమీ తెలియదు. రెండేళ్ల క్రితం నన్ను ఒంటరిగా విడిచి ఎక్కడికో పోయారు. మళ్లీ జాడ తెలీలేదు". నీరసమైన గొంతుకతో అంది.

"అసలు ఎందుకు వచ్చిందీ దురవస్థ?" జాలితో అన్నాను.

నర్సు ఏదో మందు త్రాగించిందామె చేత.

కృష్ణవేణి గొంతుకు ఓ పాడిదగ్గు దగ్గి సర్దుకుంది. నుదుటిమీద వేలితో రాసి చూపించింది. కళ్లు లోతుగా పోయాయి. రెప్పలు నల్లబడ్డాయి.

"అట్టే శ్రమ నియ్యకండి ఆవిడకి" అన్నారు డాక్టరు మూర్తి.

"అబ్బే! శ్రమలేదు. చెబుతానుండండి" అంది కృష్ణవేణి.

కొంచెం వూపిరి తీసుకుంటూ, తలగడ చేతికిందపెట్టుకుని, దానిమీద ఆనుకుని మా ప్రక్కకి తిరిగింది.

నేను ముఖపరిశీలన చెయ్యసాగాను. ఆవిడ చెప్పింది.

"అసలు ఆడవాళ్ల ప్రకృతే వేరు మానసికంగా, శారీరకంగా. అది తెల్సుకుని ఆడవాళ్లుగాని, మగవాళ్లుగాని సరిగా ప్రవర్తించనపుడు యిట్లాగే జరుగుతుంది. రైలు యింజను పట్టాలనుతప్పితే సరిచెయ్యొచ్చును. కాని, కాలుజారిన ఆడది మళ్లీ ఆ అడుగుతియ్యలేదు. ఆ జీవితం యింక అంతే! అదీ నా అనుభవం. నా కథ విన్నాక నన్నూ నిందించరు, మీరు నా భర్తనీ నిందించరు. మనం నివసించే దుర్భర సమాజ పరిస్థితుల్నీ, పరిస్థితుల్ని మార్చుకోవడం తెలీని మనచేతకానితనాన్ని నిందించుకోవాలంతే!"

"మీకు తెలుసు యీవేళ ప్రపంచం ఎంత దుర్భిక్షంతో మండిపోతోందో! సామాన్య మానవుడు ఏదోగతిలేక బతుకు



తున్నాడు. కాని జీవచ్ఛవంలా, జీవించడానికికాదు, జీవితాన్ని ఆనందించడానికి కాదు. చావలేక - నిజం అంతే!"

"అదే మా కుటుంబాన్ని కూల్చింది. అసలే ఉద్యోగాలకి, అభివృద్ధికీ ఎవరో దేవుళ్లుండాలి. అలాంటిది రెండోయుద్ధం లోకానికి వేరే రోగం తెచ్చిపెట్టింది. అది అధికార మదాంధత - దానికితోడు కామాంధత!"

"అప్పుడు మిలిటరీలో పనిచేసేవారు ఆయన. మేం ఎక్కడో బారక్సులో ఓ మూల సామాన్య కుటుంబంగా వుండేవాళ్ళం. ఎన్నేళ్లు పనిచేసినా ఈయన ఉద్యోగంలో ఎదుగు కనపడలేదు. తక్కిన వాళ్లు పెద్దపెద్ద జీతాలు పొంది అభివృద్ధి చెందసాగారు. నాకు ఏదీ అర్ధంకాలేదు. ఎందుకని? ఆయనకు తెలివితేటలు లేకా? ఆయన్ని ఒకసారి అడిగాను. తల భూమిలోకి దించుకుపోయినట్టు అయి, ఆయన అన్నారు - "వాళ్లు వాళ్ల భార్యల్ని...." నాకు అర్ధమయింది. "బాబోయ్!" అరిచాను. కళ్లు తిరిగాయి."

కొన్నిరోజులు దొర్లిపోయాయి. ఆ చెడ్డమాట మరిచిపోయి సూటిగా మళ్లీ బ్రతక్కలిగాను.

ఒకరోజు సాయంత్రం ఆయన కారులో వచ్చారు. "త్వరగా బట్టలు వేసుకో" అన్నారు.

"ఏం?" అన్నాను.

"సినిమాకి పోదాం."

"ఏం కారుకూడా దొరికిందే ఈవేళ?"

"అంతా వుందిలే" అని నన్ను తొందరచేశారు. నేను నిజమనుకుని నమ్మాను. బయలుదేరాను.

"కారు ఓ యింటిముందు ఆగింది.

# మైదానంకాదు

ఆయన దిగకుండా "ఆ జవానుతో వెళ్లు" అన్నారు. నా గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. నే "వెళ్లను" అన్నాను. "నువ్వుకూడా నన్ను చంపు" మనం జీవితంలో యింకెప్పుడూ సుఖించవద్దూ" ఆయన ప్రార్థించి. కళ్లనీళ్లు తెచ్చుకున్నారు. ఏం చెయ్యను....?"

"ఆ విదేశీయుడి చేతుల్లో మసైన నా శరీరాన్ని మళ్లీ ఆ కారే మా యింటికి చేర్చింది. నేను నాలుగురోజులు లేవలేదు. ఆయన హోటల్లో భోజనంచేసి ఆఫీసుకి వెళ్లివస్తూవుండేవారు. కొన్నాళ్లలో ఆయనకి వేరే పెద్దవుద్యోగం అయింది. మా జీవితం బాగుపడింది అనుకున్నాము. తక్కినవాళ్లలాగే, కళ్లుమూసుకుని, సుఖంగా బతకొచ్చుననుకున్నాం."

"కాని ఆ ఆఫీసరు బదిలీకావడం, కొత్తవుద్యోగి యీయన్ని కిందకి దించడం ఒకేసారి జరిగాయి. అప్పుడు మాకు కలిగిన విచారానికి మేరలేదు. కాని కొత్తవుద్యోగి కూడా అదేమోస్తరవడంవల్ల నీచానికి మళ్లీ వొడబడ్డాం.

"ఈసారి ఆయనకి టూరింగ్ ఉద్యోగం దొరికింది. పది పదిహేను రోజులు వూళ్లో వుండేవారుకారు. ఒకసారి వరుసగా రెండు నెల్లుండిపోయారు. అప్పుడు నేను ఒంటరితనాన్ని భరించలేకపోయాను. అప్పటికే ముగ్గురు మనుష్యులు మారిన నాకు సిగ్గనేది పోయింది. మా యింటిప్రక్కనున్న బ్రహ్మచారి నాకర్షించి ఆ రెండు నెల్లూ గడిపాను."

"తర్వాత భర్తవున్నా అంతే, మా యింటికి వొచ్చిన అతిథులు నా ఆతిథ్యం స్వీకరించని వారెవరూలేరు - మీరు తప్ప. మొదట ఆయన చచ్చేలా పోరారు. కాని అప్పట్లో నన్నెవ్వరూ ఆపలేకపోదురు. అంతకీ కాదంటే ఆయన్నించి విడిపోడానికి కూడా సిద్ధమయ్యాను. అందుకనే ఆయన పెదవి కదపలేదు."

"ఒకసారి ఎవరో మిత్రుడువస్తే ఆయన వొద్దన్నా - రచ్చకీడ్చవద్దన్నా - సినిమాలకీ - వాటికీ తిరిగాను, ఆయనతో హోటల్లో కొన్నిరోజులు గడిపాను. వారం అయ్యాక యింటికివస్తే ఆయన లేరు.

ఆయన జాడ యిప్పటికీ తెలీలేదు."

"ఉన్న నగలూ, సామానులూ అమ్మి యిన్నాళ్లు బ్రతికాను. నాలుగు రోజుల్నుంచి ఓ టాంగావాడు......" చిరునవ్వు నవ్వి పమిట తీసింది. వక్షంనిండా కొరుకులు, రక్కులు...... మళ్లీ వెంటనే కప్పుకుంది.

"చలంగారి మైదానం చదివావా?"

"లేదు ఏం?"

"ఏం లేదు. అది మైదానం - కాని యిది పట్నవాసం! మైదానంకాదు....." అంది వొగురుస్తూ వెనక్కుతిరిగి పడుకుంది.

పెద్ద దగ్గుతెర వచ్చి ఐదునిమిషాలు ముంచెత్తింది. కళ్లతో నన్ను చూస్తూ వెళతానన్నట్లు సంజ్ఞచేసింది. తర్వాత జోడించిన చేతులు అట్లాగేవున్నాయి. కళ్లు ముయ్యబడలేదు.

"ఎలాగా బ్రతకదు. కాని యిప్పుడు మనశ్శాంతి లభించి సుఖంగా పోయుంటాయి ఆమె ప్రాణాలు" అన్నారు డాక్టరు మూర్తి గుడ్డని ముఖంమీద కప్పుతూ బరువుగా మొహంపెట్టి.

నేను లేచి చేతులు జోడించాను. ప్రతి నమస్కారంచేస్తూ కంటినుండి రెండు నీటి చుక్కలు నేలమీద పడ్డాయి.

"నా కథ విన్నాక నన్ను నిందించరు. మీరు నా భర్తనీ నిందించరు. మనం నివసించే దుర్భర సమాజపరిస్థితుల్నీ, పరిస్థితులు మార్చుకోలేని మన చేతకానితనాన్ని నిందించుకోవాలంతే......."ఆవిడ చెప్పిన మాటలు చెవిలో ప్రతిధ్వనించసాగాయి.

(ఆంధ్ర సచిత్రవారపత్రిక *7-3-51* సంచిక నుంచి)






పద్మశ్రీ

డాక్టర్ పి.భానుమతీరామకృష్ణ

* అసలు పేరు?

భానుమతే. మూలా నక్షత్రంలో జన్మించినందున ఆ పేరెట్టారు. వెనుక మా వారి పేరు, ముందు బిరుదులతో నాపేరు మరింత సాగింది.

* స్వగ్రామం?

ఒంగోలు దగ్గరున్న పోతవరం.

* పుట్టిన తేదీ?

7-9-1925

* పొడుగు?

5 అ .5 అం.లు.

* బరువు?

180 పౌండ్లు.

* వివాహం ఎప్పుడు, ఎక్కడ?

నా 18వ ఏట అంటే- 1943 ఆగస్ట్ 8వ తేదీన మద్రాసు జార్జిటవున్‌లోని వేంకటేశ్వరస్వామి కోవెలలో.

* ఇంతవరకు ఎన్ని చిత్రాల్లో నటించారు?

100 దాటి ఉంటాయి.

* సినిమా రంగంలో ప్రవేశించకుండా ఉంటే?

నన్ను 'లా' చదివించాలనుకున్నారు మా నాన్నగారు. ఆయన సంగీత విద్వాంసులు. నాకు సంగీతం నేర్పారు. మా అమ్మ, అక్కా-చెల్లెళ్ళు అందరూ ఎంతో చక్కగా పాడేవారు. ఆ సంగీతం మూలంగానే నేను సినిమారంగంలో ప్రవేశించగల్గాను.

* మీరు మెచ్చిన సంగీత దర్శకులు?

నేనూ మ్యూజిక్ డైరెక్టర్ అన్న విషయం అటుంచితే- ఎస్. రాజేశ్వరరావు, సి.ఆర్. సుబ్బరామన్, కె.వి. మహాదేవన్, ఎం.ఎస్. విశ్వనాధన్, ఇప్పుడు ఇళయరాజా. ఒక్కో విషయంలో ఒక్కొక్కరు గొప్పవారు.

* మీకు ఏ రంగు బట్టలంటే ఇష్టం?

లేత ఆకుపచ్చరంగు.

* మీ అభిమాన దర్శకులు?

నా మొదటి చిత్రం "వరవిక్రయం" దర్శకులు పి. పుల్లయ్యగారు, ఆ తర్వాత "లైలా మజ్నూ, బాటసారి" వంటి చిత్రాలను అత్యద్భుతంగా డైరెక్ట్ చేసిన మా వారు.

* మీకు ఆశ్చర్యంగొల్పిన నటుడు?

ఎం.ఎన్. నంబియార్. నిజజీవితంలో ఎంతో సాధువుగా ఉండే ఆయన తెరమీద విలన్‌గా అంతక్రూరంగా ఎలా నటించగల్గుతున్నారా అని.

* ఇష్టమైన కారు?

నాకు కారు పిచ్చిలేదు. 'చల్తీకా నామ్ గాడీ' ఏదైనా ఒకటే.

* మూఢనమ్మకం?

దైవప్రార్థనతో ఏదైనా సాధించవచ్చని.

* మీకిష్టమైనది?

ఎలాంటి అర్బాటమూ లేక ప్రశాంతంగా ఉండే వాతావరణం.

* ఇష్టంలేనిది?

నిజ జీవితంలో నటించే వారిని చూస్తే.

* మీ ఆత్మీయురాలు?

దుర్గాదేవి. (దేవత సుమండీ).

* మీకు తీరుబడి లభిస్తే?

కథలు రాయడం, బొమ్మలు చిత్రించడం.

* అనుకోనిది ఏదైనా జరిగిందా?

నేను ప్రభుత్వోద్యోగిని అవుతానని కలలోనైనా ఊహించలేదు. తమిళనాడు ప్రభుత్వం సంగీత కళాశాలకు నేను ప్రిన్సిపాల్‌గా, డైరెక్టర్‌గా నియమింపబడడం, అక్కడ నా విధి నిర్వహణకు అందరి ప్రశంసలు అందుకోవడం.

* ఇబ్బందికరమైన పరిస్థితి?

నా కోడలి సమక్షంలో నా ఒక్కగా కొడుకు డాక్టర్ భరణిపై నా మా ప్రేమను ఒలకబోసుకోడానికి అప్పుడప్పు జంకుతూంటాను.

* మీకు విరోధులున్నారా?

సర్వకళలలోనూ నిష్ణాతులైన వా విరోధులు ఒకటో అరో ఉంటారుగా?

* మీకిష్టమైన భోజన పదార్థాలు

తెల్ల నువ్వులు, మెంతులతో చే చింతకాయ పచ్చడి. మిరియాల చారు.

* సినిమాలలో మీరింకా నటిస్తారా

నేనీ రోజు సినిమాలలో నటించవల అవసరం లేకపోయినా- నాకు తగ్గప్ర సమర్థుడైన డైరెక్టర్ ఉన్న చిత్రాల్లో పాడడపా నటిస్తాను.

* ఏదైనా చిత్రాన్ని డైరెక్ట్ చే బోతున్నారా?

1986లో మావారు స్వర్గస్థులయా సొంత చిత్ర నిర్మాణం పట్ల దర్శకత్ పట్ల నా ఆసక్తి చచ్చిపోయింది.

* మీ హృదయాన్ని కలచివే సంఘటన ఏదైనా చెప్తారా?

ఇటీవల జరిగిన సంఘటన. భరణీస్టూడియోస్ నుంచి ఇంటికి బ లుదేరాను. అప్పుడప్పుడే చీకటి ప తోంది. ఓ వృద్ధుడూ ఎనభై ఏ దాటి ఉంటాయేమో- తప్పటడుగుల రోడ్ క్రాస్ చేయబోయిన అతన్ని స్కూటర్ గుద్దేసింది. కుప్పలా పోయాడు. దైవవశాత్తు అట్టే దెబ్బ తగల్లేదు. "ఏమయ్యా? కళ్ళు బడ్డం లేదా?" అని ఆ స్కూటర్ వ చీవాట్లు పెట్టి, తుర్రుమన్నాడు. వెంట మా కారును ఆపించాను. ఆ వృద్ధ కిందపడి తునాతునకలైన తన కళ్ళజో కోసం నేలమీద తడువుకుంటూంటే, గుండె తరుక్కుపోయింది. మా మే ర్‌ను అక్కడ దిగమని చెప్పి, "స్టా ఆ పెద్దాయనకు కొత్త కళ్ళజోడు పెట్టేరండి. దెబ్బలేమైనా తగిలి ఉం మందు కూడా ఇప్పించండి!" అని చె బయలుదేరాను... ఈ రోజు కార ఉన్న నేను ఒకవేళ ఆ వృద్ధుడి స్థాన ఉండి ఉంటే....? తలచుకుంటే ఒ ఙలదరించింది.

- జి.వి

# బహుముఖ ప్రజ్ఞాశాలి

# వై.వి. రావు



తెలుగు, తమిళ, కన్నడ, హిందీ భాషలో అర్థశతాబ్దిక్రితమే గొప్ప చిత్రాలు సి, దర్శకత్వం వహించి, ప్రధాన పాత్రలు టించి, కధారచనగావించి మంచి పేరు ఖ్యాతులు గాంచిన వై.వి. రావు మన లుగువాడు. ఈనాటివారికి ఇతని ప్రజ్ఞా టవాలు తెలియవు. అందుకనే ఈతని రించి తెలియజేస్తున్నాను.

మూకీ చిత్రాల కాలంలోనే బొంబాయి యనించి, అక్కడ కొన్ని చిత్రాలలో నటుగా పనిచేస్తూ, చిత్ర నిర్మాణ రీతులు వగాహన చేసుకుంటుండేవాడు.

తిరిగి మద్రాసు చేరుకున్నాక ఆర్. ఎస్. ప్రకాష్‌వద్ద కొద్దికాలం సహాయదర్శకుడిగా పనిచేశాక, స్వతంత్రంగా చిత్ర నిర్మాణం చేశాడు.

ప్రధమ కన్నడటాకీ చిత్రం "సతీ సులోచన" (1934) తీసి కన్నడ చిత్ర పరిశ్రమకు ఆద్యుడయ్యాడు.

తమిళంలో తీసిన "చింతామణి" (1937) చిత్రం మద్రాసులో ఒకే థియేటర్‌లో సంవత్సరంపైగా ప్రదర్శింపబడి రికార్డు నెలకొల్పాడు.

తెలుగులో తీసిన "మళ్లీ పెళ్లి" (12-12-1939) చిత్రం ఆంధ్రదేశంలో సంచలనం కల్గించి, పెద్ద దుమారం చెలరేపాడు!



అదేకాలంలో హిందీలో "పండిత జగన్నాధరాయలు" అనే చిత్రం తీసి దక్షిణాదివారి శక్తిని, ఉత్తరాదివారికి చూపించాడు.

ఇంతటి ఘనత వహించిన ఈ వై.వి. రావు 1899 సం.లో నెల్లూరులో జన్మించాడు. అక్కడే విద్యాభ్యాసం జరిగింది.

యౌవనదశలోకి వచ్చాక తనలో కళాభినివేశం కల్గడంతో నాటకరంగంలో ప్రవేశించి నటుడిగా తన సత్తా ప్రేక్షకులకు అగపర్చాడు. ఎన్నో నాటకాల్లో ప్రధాన పాత్రలు ధరించి నటుడిగా కీర్తి గాంచాడు. ప్రత్యేకించి ప్రతాపరుద్రీయం, బొబ్బిలి యుద్ధంలో రావు ధరించిన వీరోచిత పాత్రలకు పలువురి ప్రశంసలు లభించాయి.

తన సామర్థ్యాలమీద విశ్వాసం కల్గిన రావు దృష్టి బొంబాయి చిత్రరంగంపై పడింది. అనాడు మద్రాసులో సినీమా స్టూడియోలులేవు. బొంబాయిలో ప్రముఖ నిర్మాణ సంస్థల్లో సినిమా సాంకేతిక పరిజ్ఞానం నేర్చుకున్నాడు. కొన్ని చిత్రాల్లో నటించాడు.

అప్పుడే రఘుపతి సూర్యప్రకాష్ తెలుగువారికి ప్రతినిధిగా మూకీ చిత్రాలు తీయడం ఆరంభించారు మద్రాసులోనే. ఈయనవద్ద వై.వి. రావు, సి. పుల్లయ్య సహాయకులుగా కొన్నాళ్లు పనిచేశారు.

"జగదీశ్ ఫిలింస్" సంస్థ స్థాపించి వై.వి. రావు స్వంత చిత్రాలను తీయడం ఆరంభించారు.

సత్యభామ, సతీసులోచన, చింతామణి, మళ్లీ పెళ్లి, తాసిల్దారు, విశ్వమోహిని, లవంగి, పండిత జగన్నాధరాయలు, మానవతి, నాగార్జున, మంజరి మొదలగు చిత్రాలు వివిధ భాషల్లో తీశారు.

ఈయన సొంత చిత్రాలన్నింటిలోను ప్రధాన పాత్రలను నటిస్తూ దర్శకత్వం

వహించి, కధారచన చేస్తుండేవారు.

ఈయన చిత్రాలన్నింటిలో 'మళ్లీ పెళ్లి' చిత్రం ఈయన కీర్తి పతాకానికి చిహ్నంగా నిలిచిపోయింది. వితంతు వివాహాలను ప్రోత్సహిస్తూ, సాంఘిక ప్రయోజనం ఆశించి ప్రజల్లో పేరుకుపోయిన చాంధస భావాలపై గొడ్డలిపెట్టుగా చక్కని కథతో మంచి కధనంతో తీయడం జరిగింది. కొందరు బ్రాహ్మణులు ఈ చిత్రం ప్రదర్శింపకుండా చెయ్యాలని నాడు అలజడి రేపారు. బ్రాహ్మణుడై వుండి, బ్రాహ్మణాచారాలనే తలక్రిందు చేస్తాడా అని దుర్భాషలతో దుమ్మెత్తి పోశారు. ప్రేక్షకులు, విమర్శలు వై.వి. రావును ఆకాశానికి ఎత్తేశారు. ఈ చిత్రం బి.యన్. రెడ్డి చూచి ఆనందించి, రావును మెచ్చుకొని, నేను ఇటువంటి ప్రయోజనాత్మక చిత్రం తీయాలి" అన్నాడు.

అనాటి యువతీ యువకులను ప్రత్యేకించి ఆదర్శభావాలుగల వారిని మళ్లీ పెళ్లి చిత్రం బాగా ఆకర్షించింది. ఈ చిత్రంలో మీనలోచని కాంచనమాల వితంతు నాయిక. నాయకుడుగా వై.వి. రావు నటించాడు. ఇతర పాత్రలు బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, బెజవాడ రాజరత్నం, కొచ్చెర్ల కోట సత్యనారాయణ, రాజహంస భాగవతార్ కాకినాడ రాజరత్నం, విద్వాన్ శ్రీనివాస అయ్యంగార్, విద్వాన్ నటేశయ్యార్, రామచంద్రమూర్తి, కాశీ చెంచు, మాణిక్యమ్మ నటించారు. కథ-నిర్మాత-దర్శకుడు-నాయకుడు వై.వి. రావు, కవి: బలిజేపల్లి, సంగీతం: ఓగిరాల రామచంద్రరావు.

భానుమతి, నారాయణరావు, కమలా కోట్నీస్‌తో తీసిన "తాసిల్దార్" చిత్రం నాటి ప్రజలను బాగా ఆకర్షించింది. ఇందులోనే తొలి నేపథ్య గీతం నండూరి సుబ్బారావు రాసినది ఎమ్.ఎస్. రామారావు గానం చేశాడు. విద్యాధికుడు - భార్య చదువులేనిదైతే ఆ గృహంలో భార్యా భర్తలు ఎలా వుంటారో, తన డాబు - పదవికి సరిపడే నాగరికత కల్గిన యువతికై ఎలా మోజు పడతారో ఎంతో చక్కగా చూపించి యువ ప్రేక్షకుల మన్ననపొందాడు.

"విశ్వమోహిని" సినీమా తార గురించి తీసిన చిత్రం. ఈ చిత్రం అంతగా రాణించలేదు. ఆ తర్వాత తీసిన చిత్రాలు ఆర్థికంగా దెబ్బతిన్నాయి. పట్టుదలతో బాగా ఆలోచించి "ప్రతిష్ఠ" అనే చిత్రం తీయాలని సంకల్పించుకుని కథ తయారు చేసుకున్నాడు. ఆర్థికంగా, ఇతరత్రా కొన్ని అవరోధాలు కల్గడంవల్ల "ప్రతిష్ఠ"కి సినిమా రూపం ఇవ్వలేకపోయాడు. ఈ కథను నవలారూపంగా ప్రచురించడం జరిగింది. తాపీ ధర్మారావు ఈ కథ (నవల) ప్రాశస్త్యాన్ని ప్రశంసిస్తూ పీఠిక వ్రాశారు. తన ప్రతిష్ఠాత్మక చిత్రంగా రూపొందించ లనుకున్న ఊహ ఫలించలేదు. వై.వి. రావుగా వ్యవహరించే ఈతని పూర్తి పేరు ఎరగుడిపాటి వరదరావు. ఈతని భార్య రుక్మిణి ఒకనాటి ప్రముఖ నటి ఈతని కుమార్తె లక్ష్మి ఈనాటి బహుభాషానటి.

భరణీ రామకృష్ణ - భానుమతి దంపతులు ఈతనికి దగ్గర బంధువులు.




తనదైన బాణీలో ధైర్యంగా చిత్రాలు తీసి ఆనాటి సినిమా అభిమానుల మనలు పొందారు. "లవంగి" గొప్ప కళాత్మక చిత్రంగా పేరొచ్చింది.

ఇంతటి బహుముఖ ప్రజ్ఞాశాలి బెంగుళూరులో 14-2-1973 సం.లో దివంగతులయ్యారు.

తెలుగు, కన్నడ చిత్ర పరిశ్రమ కీ. వై.వి. రావుకు ఋణపడి వున్నాయి: తప్పదు. అతని చిత్రాలు జ్ఞాపకం చేసుకొని, అతన్ని స్మరించడం నాటి ప్రేక్షకులకు తప్పనిసరి!

- ఆరిసెట్ట సూరిబాబు

## తారల



## శోకాంత తిమిరావళి  -"శ్రీదేవి"

అరాచక పరిస్థితుల్లో మన దేశం ఎంతో ఆందోళనకరంగా ఉంది. కొందరు ఆత్మాహుతికి పాల్పడుతున్నారు. దుర్ఘటనలకు ఎంతో మంది బాధపడుతున్నారు.

మా ఇంట్లో శోకం నుంచి ఇంకా ఎవరూ తేరుకొనలేదు. "దీపావళి పండుగకు రెండు రోజుల ముందుగానే ఇక్కడుండాలి, అమ్మాయ్!" అన్నారు నాన్న, నేను ఓ హిందీ చిత్రం షూటింగ్‌కు ఫారిన్ వెళ్తున్నప్పుడు. కాని, అంతకన్నా ముందుగానే నేను తిరిగి రావలసి వచ్చింది. ఆయన కడసారి చూపు కోసం... ఈ అంధకారంలో మాకు వెలుగు చూపించేది మా నాన్న ఫోటో ముందు మేం ఉంచిన ఆ ఆరని జ్యోతి.

## బాంబులంటే భయం లేదు-"భానుప్రియ"

ఎర్రగా ఉదయించే భానుడి వర్ణం ఉన్న చీరలంటె నా కెంతో ఇష్టం. కాని, నాకు స్కై కలర్ చాలా బాగా ఉంటుందని అంటుంది మా చెల్లాయి శాంతిప్రియ. ఆమె లైట్ కలర్‌లను కోరుతుంది. ఆంధ్ర వనితనుకదా - మెరుపుతో ఉరిమే ఆటంబాంబులాంటివి ప్రేల్చడమన్నా నేను సిద్ధమే. కాని, ఆ ధ్వనికి మా ఇంట్లోని పెంపుడు కుక్కలు హడలిపోతాయి. అందుకని చిచ్చుబుడ్లు, మతాబాలు, కాకర పువ్వులతో వేకువ ఝామునుంచే ఎంతో బిజీగా ఉంటాం. సినిమా స్టార్‌లు స్వీట్స్ తినకూడదు. నిజమే కాని ఎప్పుడో ఒక్క పండుగ రోజున మాత్రం ఓ ముక్క నోట్లో వేసుకుంటే తప్పేముంది!

అందరికీ దీపావళి శుభాకాంక్షలు...

## ఇంటింట ఆనంద దీ

ఓం విఘ్నేశ్వరాయనమః

ఇలా అంటున్నందుకు ఆశ్చర్య పోతున్నారా? మా భవనం కాంపౌండ్ గోడలో చిన్న గూటిలో వినాయకుడి విగ్రహాన్ని ఉంచాలన్నారు వాస్తు శాస్త్రజ్ఞులు. నేను ఏ పనిని ప్రారంభించాలన్నా ఆ గణపతిని స్మరిస్తుంటాను.

రమ్యకృష్ణ భవంతిలో ఎన్నో వినాయకుని విగ్రహాలు, చిత్ర పటాలు ఉన్నాయట. ఎవరో లెక్క పెట్టి సరిగ్గా38 ఉన్నాయన్నారు.

మేం కేరళ వాస్తవ్యులమైనా మద్రా



## ...పావళి

### ...పావళి -రాధ లేఖ

...సుకు వచ్చినప్పట్నుంచి దీపావళి పండుగను ఎంతో ఘనంగా జరుపుకుంటున్నాం. ఈ ఏడు మరీ మహదానందకరంగా ఉంటుంది ఎందుకో తెలుసాండీ: అమెరికా నుంచి మా అక్క అంబిక, బావగారు, వాళ్ళ బేబీతో వచ్చారు. 'నాసా'లో ఇంజనీర్‌గా ఉన్న మా బావగారు మధుర గాయకుడు.

ఓ నిర్మాత కోర్కెమీద ఇక్కడ ఓ తమిళ చిత్రం కోసం రెండు పాటలు పాడి, అర్జంట్‌గా డ్యూటీలో జాయిన్ అవవలసి వున్నందున ఏకాయెకీన లాస్‌ఏంజిల్స్‌కు





పయన మయ్యారు. ఆయన దీపావళి పండుగకు ఉండలేకపోయారే అన్న బాధ అక్కయ్యలో లేకపోలేదు. ఆ బాధను బేబీ అల్లరికి, ముద్దు ముద్దు మాటలకు మరచిపోగల్గుతోంది. ఆ బేబీ చేతిలో ని ఆట వస్తువేదైనా లాక్కుంటే చాలు - వెంటనే ఆరున్నొక్క రాగం ఆలపిస్తుంది. అప్పుడు చూడాలి అక్కయ్య ముఖం - కోపంతో మరింత అందంగా ఉంటుంది.

బేబీ కోసం నేను స్వయంగా పాండీ బజార్‌కు వెళ్ళి రంగు రంగుల డిజైన్లున్న బట్టలు సెలెక్ట్ చేసి, వాటి నెలా కుట్టాలో నేనే స్కెచ్ వేసి, టైలర్‌కు ఇచ్చాను 'స్వీట్స్' నేను తినకూడదు. అక్కయ్య తను కూడా తిననంది. తనకు ఇటీవల ఒళ్ళొచ్చిందని ఆమె భయం. గెస్ట్‌ల కోసం రక రకాల స్వీట్స్ చేయిస్తున్నాం.

అందరూ ఈ దీపావళి పండుగను ఎంతో ఘనంగా జరుపుకోవాలని నా తీపి తీపి "గ్రీటింగ్స్" ఇస్తున్నా.

ఇట్లు
మీ రాధ.

### డబుల్ ఛీర్స్ గౌతమి దీపావళి

ఈమారు దీపావళి నాకు రెట్టింపు ఉత్సాహాన్ని కల్గిస్తోంది. ఇందులో అతిశయం ఏమాత్రం లేదు సుమండీ!

తాను ఎం. జి. ఆర్. తో నటించే భాగ్యం లేకపోయిందేనని తోటి తారలు కొంత మంది బాధపడ్డట్లు విన్నాను.

ఈ విషయంలో నేనెంతో అదృష్టవంతురాల్ని సుమండీ.

ఎం. జి. ఆర్. నటించిన "అవసర పోలీస్ 100" చిత్రంలో నేను నటించాను. అది ఈ దీపావళి విడుదల. అందులో నూ భాగ్యరాజ్ సరసన నేను.

ఇంతకన్నా ఆనందం ఇంకేముంటుంది?

జి. ఎ. జి.

# సినిమా..సినిమా..

## భాగ్యరాజా సారథ్యంలో "ఈశ్వర్"

"ప్రముఖ నటుడు, దర్శక రచయిత కె. భాగ్యరాజా ఈ చిత్రానికి సంగీతం కూర్చడం ఓ విశేషం. ఆయనవద్ద కొన్ని చిత్రాలకు కో-డైరెక్టర్‌గా అనుభవం గడించిన కె. సి. విజయరాజా కథ, చిత్రానువాదం, మాటలు సమకూర్చి, దర్శకత్వం వహిస్తున్నారు. రఘువరన్ సోదరుడు సురేష్ ఓ కథా నాయకుడు కాగా, మరో ఇద్దరు నాయికలను కూడా పరిచయం చేస్తున్నాం. విశాఖపట్నంలో సెప్టెంబర్ 23 నుంచి అక్టోబర్ 28 వరకు ఒకే షెడ్యూల్" అన్నారు కె. కోటీశ్వరరావు. ఈయన నిర్మిస్తున్న కీర్తి క్రియేషన్స్ "ఈశ్వర్" చిత్రంలో సితార, నాజర్, జగదీశ్, గౌతమి, శ్రీనివాస్, కె. ఆర్. విజయ తక్కిన తారాగణం. పాటలను వేటూరి, జాలాది, సీతారామశాస్త్రి, బి. కె. ఈశ్వర్ రాశారు. లివిన్‌దాస్ ఛాయాగ్రాహకుడు. డాక్టర్ గోరె శేఖర్ సహ నిర్మాత.

## కోడి రామకృష్ణ-సుమన్‌ల "విముక్తి"

"దేశభక్తి ప్రబోధాత్మక చిత్రం. ముఖ్యంగా యువతరానికి చక్కని సందేశమిస్తుంది" అన్నారు కోడి రామకృష్ణ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో టి. వెంకట సుబ్బయ్య సమర్పించే టి.వి.ఎస్. ఫిలిమ్స్ "విముక్తి" చిత్రంలో సుమన్, గాయత్రి, కెప్టెన్ రాజు, రామిరెడ్డి, ఆహుతి ప్రసాద్, బాబూ మోహన్, మానిక్, రావుశ్రీ, రమేష్, హెగ్డే, లక్కింశెట్టి, రాధాకృష్ణ, ప్రమోద్ చక్రవర్తి, శోభన్, గురుప్రసాద్, శేషగిరిరావు నటిస్తున్నారు. భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణల కర్త. జె. వి. రాఘవులు స్వరకల్పనలో సీతారామశాస్త్రి, జొన్నవిత్తుల గీతాలు రాశారు. కోడి లక్ష్మణ్ ఛాయ, రామచంద్ర సింగ్ శిల్పం, స్పైడర్ విక్కీ సాహసాలు, శివ సుబ్రహ్మణ్యం నృత్యాలు, కమల్ జీ.డి. రవి సంయుక్త దర్శకత్వం, ఎస్ చంద్రశేఖర్ ప్రొడక్షన్, తాతా సురేష్ కూర్పుతో టి. నరేష్‌కుమార్ సహ నిర్మాత మొదటి షెడ్యూల్ హైదరాబాద్‌లో. తిరుపతికి 20 కిలో మీటర్లలోని రంగం సమీపంలో కొండల మధ్య వేసిన టెర్రరిస్టుల క్యాంప్ సెట్‌లో రెండో షెడ్యూల్ జరిగింది" అన్నారు నిర్మాత టి అశోక్‌కుమార్.

"తేనెటీగ"తో చిత్రవర్మ, సితార



## "ప్రేమ ఖైదీ"

"మాలశ్రీ నాయిక. ఆమె తండ్రి గోకిన రామారావు; తల్లి విజయ. నౌకరు పి. ఎల్. నారాయణ; ఇతని మనవడు హరీష్. శారద జైలు సూపరింటెండెంట్ ఈమె భర్త గిరిబాబు క్రొంగొత్త పాత్రలలో కనిపిస్తారు ఈ పిక్చర్‌లో హైలైట్ అయిన అయిదున్నర నిమిషాల అంత్యాక్షరీ పాటను మా స్టూడియోలో చిత్రీకరించాం" అన్నారు డి. రామానాయుడు. ఈయన నిర్మిస్తున్న సురేష్ ప్రొడక్షన్స్ ప్రైవేట్ లిమిటెడ్ "ప్రేమ ఖైదీ" చిత్రంలో చలపతిరావు, త్యాగరాజు, రావి కొండలరావు, బాబూ మోహన్, పరుచూరి రవీంద్రనాథ్, ఆలి, సూర్య, రాజకుమార్, దత్తేజ్ బోస్, షర్మిల, రంజిత్, రాధకుమారి వగైరా నటవర్గం. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. వేటూరి గీతాలకు రాజన్- నాగేంద్ర బాణీలు కూర్చారు. కె. రవీంద్రబాబు ఛాయ, అశోక్ శిల్పం, విజయన్- హరి సాహసాలు. తార- శివ సుబ్రహ్మణ్యం నృత్యాలు. గిరిధర్ సంయుక్త దర్శకత్వం, ఎల్. పి. రామారావు సహకార దర్శకత్వం, పొన్నుస్వామి ప్రొడక్షన్‌తో ఇ. వి. వి. సత్యనారాయణ దర్శకుడు.

## "సూర్య"

"విజయశాంతి, వెంకటేశ్ పోలీసు అధికారులు," అన్నారు ఎ. కోదండ రామిరెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో టి. సుబ్బరామి రెడ్డి నిర్మించే "సూర్య" చిత్రంలో



"జోషి-నిర్దోషి"లో సుమన్

...త్యనారాయణ, నూతన్ ప్రసాద్, ...వరణ్‌రాజ్, చారుహాసన్, కోట ...ంకరరావు, రాళ్ళపల్లి, 'శివ' చక్రవర్తి, ...త్తి, సరస్వతి ఇతర నటవర్గం. పరుచూరి ...సోదరులు కథ, మాటలు రాశారు. ఇళయరాజా సంగీతం, ఎ. ఎస్. ప్రకాష్ ఛాయ, పేకేటి రంగా శిల్పం, రాజా సాహసాలు, గునా, ప్రసాద్- వి. సుందరరాజా సంయుక్త దర్శకత్వం, త్రినాథ్ కూర్పు నిర్వహిస్తున్నారు.

# ఉషాకిరణ్ మూవీస్

## "అమ్మ"

"మాతృత్వంలోని మధురిమకు ఆరాటపడే ఓ అమ్మ కథ. చాలా కాలం తర్వాత సుహాసిని నటిస్తున్న చిత్రం." అన్నారు సురేష్ కృష్ణ. ఈయన దర్శకత్వంలో రామోజీరావు నిర్మించే ఉషాకిరణ్ మూవీస్ "అమ్మ" చిత్రంలో శరత్‌బాబు, హరీష్, తనికెళ్ళ భరణి, రత్నకుమార్, అశోక్‌కుమార్, బ్రహ్మానందం, జ్యోతి, కావ్య, రమాప్రభ, వై. విజయ, సీమ, రంజిత, బేబీ సునయన పాత్రధారులు. అక్కినేని కుటుంబరావు కథకు గణేష్‌పాత్రో సంభాషణలకర్త. కీరవాణి స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు. అన్వర్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, ఎం. పార్థసారథి సంయుక్త దర్శకత్వం, రఘురాం నృత్యాలు, సోమరాజు సహకార దర్శకత్వం, మురళీ-సుధాకర్ ప్రొడక్షన్, గౌతంరాజు కూర్పు, కె. ఐ. ఎస్. ఆర్. కె. ప్రసాద్ నిర్వహణతో ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ అయిన అట్లూరి రామారావు అక్టోబర్ 1 నుంచి ఒకే షెడ్యూల్‌లో నవంబర్ 10కి పూర్తవుతుంది," అన్నారు.

-జి.వి.జి.

శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారి కళాసృష్టి

పల్నాటి యుద్ధం

ఆంధ్రుల వీరగాధ.

పల్నాటియుద్ధం

(తెలుగు)

# అలనాటి మేటి చిత్రాలు

## సెప్టెంబరు 24-1947లో "పల్నాటి యుద్ధం"

దర్శకత్వం: యల్. వి. ప్రసాద్, పాటలు- మాటలు: సముద్రాల, సంగీతం: పెంచలయ్య, స్టూడియో: న్యూటోన్.

తారాగణం: అక్కినేని నాగేశ్వర రావు, శ్రీమతి కన్నాంబ, వరలక్ష్మి, చంద్రకళ, నారీమణి, డాక్టర్ జి. వి. సుబ్బారావు, లింగమూర్తి, సదాశివరావు, వెంకటేశ్వర రావు, వంగర- వగైరా.

ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్స్: ఫేమస్ ఫిలిమ్స్ సర్క్యూట్, నెల్లూరు- బెజవాడ.

అప్పట్లో విడుదలైన కేంద్రాలు: దుర్గా కళామందిరం (విజయవాడ) మినర్వా టాకీస్ (బందరు) సరస్వతీ టాకీస్ (గుంటూరు) పాండురంగా టాకీస్ (ఏలూరు) క్రౌన్ టాకీస్ (కాకినాడ) రమా టాకీస్ (రాజమండ్రి) కృష్ణా సినిమా (విజయనగరం).

### చిత్ర కథ

శారదా వారి "పల్నాటి యుద్ధం" చిత్రంలో బ్రహ్మనాయుడు- వైష్ణవ భక్తుడు. ఆయనకు ప్రజల్లో గౌరవ ముంది. రాజ బంధువులు చాలా మంది ఆయన అడుగు జాడల్లో నడుస్తూ వుంటారు. "జై చెన్నకేశవా!" అంటూ ఆయన్ను అనుసరిస్తారు. బ్రహ్మనాయుడు సర్వమానవ సమానత్వాన్నీ, హరిజనోద్ధరణనూ బోధ చేసి దేవాలయాల్లో హరిజన ప్రవేశాన్ని, హరిజనులతో పంక్తి భోజనాన్ని తలపెడ్తాడు. కొందరు ప్రతిపక్షులు, రాజభటులూ యీ విషయం దండనాధులతో నూ, నరసింహ రాజు తోనూ- పితూరి చేసి, మతం మంట కలిసి పోతుందని అమాత్యులు నలగామ రాజున్ను కూడా లెక్క చేయకుండా స్వాధికార దర్పంతో వ్యవహరిస్తున్నాడనీ- చెప్తారు.

ఆ దశలో -

శైవ యోగినీ వేషంలో, తన ఊళ్లో శివార్చన చేసుకుంటూ వుంటోన్న "నాగమ్మ" దగ్గరకు కొందరు బయలుదేరి వెళ్లి- బ్రహ్మన్న హరిజనులను వర్ణస్థులతో కలిపి వేస్తున్నాడని, ఆమె వచ్చి రాజుకు ప్రాపుగా నిల్చి, ఆయన్ను బ్రహ్మన్న వశీకరణ లోంచి తప్పించి- రాజ్యాన్నీ, పురాతన ఆచార ధర్మాలను కాపాడాలని బ్రతిమలాడ్తారు.

నాగమ్మ రంగ ప్రవేశం చేస్తుంది.

బ్రహ్మన్న మాలకన్నమ దాసును దండనాయకునిగా చేశాడని, రాజసభలో నాగమ్మ- బ్రహ్మనాయని కెదురుగ్గా ఉపన్యాస మిస్తుంది. దాంతో బ్రహ్మనాయుడు తన బోధ రాజసభలో తల కెక్కటం లేదని- ప్రధాని పదవిని వదులుకొని రాజస్థానం లోంచి వెళ్లిపోతాడు. మలి దేవరాజు అన్నగారితో వివాదపడి తన భాగం తనకు పంచి యివ్వమని పోరాడి వెళ్తాడు.

దేశాలూ- రాజ్యాలు ప్రజలతో కూడుకున్నవనీ, పంపకాలకు రాజులకు హక్కులు లేవనీ బోధిస్తుంది.

నరసింహ రాజు ప్రోత్సాహంతో నాగమ్మ మహామంత్రిణి అవుతుంది. కోడిపందాలాటలో నాగమ్మ చేసిన మోసానికి- మాచర్ల వారంతా, మాచర్లను వదిలి- కర్నూలు సీమకు వలస పోతారు.

బ్రహ్మనాయుని పరివారం- ఏడేళ్లూ- వలస గడిపి సైనికాయత్తు లవుతారు.

బాలచంద్రుడ్ని- అంతఃపుర స్త్రీ

రక్షణ కోసం ఇంటి దగ్గరే వదిలి వెళ్తే- పడి బజారులో బొంగరం ఆట- ఒక అప్రయోజకునికి నేర్పి చూపటంలో- బొంగరం ఒక స్త్రీ పాదంలో గుచ్చుకుంటుంది. ఆ స్త్రీ తిట్లతో, "బాలచంద్రుడు" తల్లి దగ్గరకు వెళ్లి,

యుద్ధానికి వెళ్తానని- దీవించమంటాడు. మొగాన్న తిలక ముద్ర వుంచి- కోడిలు అంగీకారం కూడా పొంది అప్పుడు బాల చంద్రుడ్ని యుద్ధానికి వెళ్లమంటుంది.

బాలచంద్రుడు నరసింహ రాజాతో, వీరోచితంగా ఘోర యుద్ధం చేసి, అతని తల నరికి, తాను కూడా గాయపడి, కడప్రాణంతో, ఆ తలను బ్రహ్మనాయుడు దగ్గరకు తెస్తాడు.... బాలచంద్రుని వీర

శ్రీ శారదా వారి

పల్నాటి యుద్ధం

ఆంధ్రుల వీరగాథ.

మరణం తర్వాత- "అహింసా సిద్ధాంతానికి లోబడి, నాగమ్మ కత్తి దించేసి- క్షమాపణ వేడుకుంటూ, బ్రహ్మన్నకు పాదాక్రాంతమై పోతుంది. చెన్న కేశవ స్వామిని కీర్తిస్తూ, అంతర్థానమై- చెన్న కేశవునిలో లీనమై పోతాడు- బ్రహ్మనాయుడు.

సేకరణ- భీశెట్టి

# యువనటి ఆగ్రహం!

సావన్ కుమార్ చిత్రాలలో ఎక్కువగా ఇద్దరు హీరోయిన్స్ ఉంటారు సౌతన్, సౌతన్‌కి బేటా చిత్రాలను సావన్ కుమార్ నిర్మించాడు ఇతడు తన. చిత్రాలలో హీరోయిన్లను ముందుగా ప్రకటించి, ఆ తర్వాత అదే స్థానంలో కొత్త వారిని తీసుకుంటాడనే వార్తలు ఎక్కువగా వినవస్తుంటాయి. "కిషన్ కన్‌హయ" చిత్రంలో అవయవ సంపదను కావల్సినంతగా ప్రదర్శించిన శిల్పాను సావన్ కుమార్ తన చిత్రంలో బుక్ చేసుకుని ఆ తర్వాత ఆమెని తొలగించి ఆ స్థానంలో "దీ పంతి" అనే కొత్త నటిని నియమించాడు తన చిత్రాలలో వరుసగా దీపంతినే కథానాయికగా ఉంచుతానని వాగ్దానాలు చేసి దీపంతి పాత్రను మరో కొత్త తార "చాందిని"కి ఇచ్చాడని తెలిసిన దీపంతి సావన్‌కుమార్‌ని నిలబెట్టాలని చూస్తున్నట్లు బొంబాయి పత్రికల వార్త! ప్రస్తుతం సావన్‌కుమార్ మారిషస్‌లో తన తాజా చిత్రం షూటింగ్ జరుపు కుంటున్నాడట!

# తల్లికి దగ్గ తనయ

ప్రొతిమాబేడి పేరు వినగానే ఒకప్పటి రోజులు గుర్తుకు వస్తాయి. కొన్ని సంవత్సరాల క్రితం ప్రొతిమా బొంబాయి బీచ్‌లో స్ట్రీకింగ్ (నగ్నంగా పరుగెత్తుట) వార్తలు ఈ మధ్య వినవస్తున్నాయి. అన్నిటికన్నా గొప్ప విషయ మేమంటె తల్లి ప్రొతిమా బేడి వలెనే పూజా కూడా ఓ విచిత్రం చేసింది. ఓ వ్యాపార ప్రకటనకు సంబంధించిన ఫోటోలు తీసే కార్య క్రమంలో యింటర్ వెల్లో దుస్తులు మార్చవల్సి వచ్చింది. సదరు ఫోటో గ్రాఫర్ కారులో దుస్తులు మార్చుకో



చేసింది. ఆ రోజు ఆ వార్త ఎంతో సంచలనం రేపింది. ఈ నటి కొంతకాలం జోహార్ భార్యగా ఉండి ఆ తర్వాత కబీర్ బేడిని. వివాహం చేసుకుంది. వీరిద్దరి పుత్రికా రత్నం పూజా బేడి. ఈ యువనటి ప్రేమాయణాల గురించి అనేక సంచలన వాల్సిందిగా కోరగా అందుకు నిరాకరించిన పూజా బహిరంగ ప్రదేశంలోనే, ఏ మాత్రం సంకోచం లేకుండా దుస్తులను మార్చుకుందట! ఇందుకు ప్రొతిమా బేడి తప్పనిసరిగా గర్వపడాలి!

-జాహ్నమిత్ర

సీరియల్

# ప్రణయవల్లరి

## యర్రసంట్ల వరలక్ష్మీదేవి




**ఇంతవరకు సాగిన కథ 5 :** నాటకాలకు పెట్టుబడిపెట్టే రామకృష్ణ, నాటకాల డైరెక్టరు - యాక్టరు అయిన గణపతి స్నేహితులు. నాటకాల్లో హీరోయిన్‌గా వేసే రజనికి సినిమా పిచ్చి వుండటంతో రామకృష్ణ ప్రేమించటం మానేస్తాడు. నవనీత అనే టీచరు రామకృష్ణ ప్రేమను తిరస్కరిస్తుంది. అలహాబాద్‌లో లా చదివేందుకు వెళ్లిన రామకృష్ణకు - సిన్హా, రబీన్ స్నేహితులవుతారు. సిన్హా తన చెల్లెల్ని పెళ్లి చేసుకోమని రామకృష్ణను అడుగుతాడు. సెలవుల నిమిత్తం విశాఖ వస్తున్న రామకృష్ణకు అనుకోకుండా నవనీత తారసపడుతుంది.

*(గత సంచిక తరువాయి)*

పదిహేను రోజులు బంధువులను, స్నేహితులను కలియడంలోను, కొత్త తెలుగు సిన్మిమాలను చూడడంలోను గడచిపోయేయి.

ఆ తరువాత నవనీత ధ్యాస కల్గింది రామకృష్ణకు. ఆమెను మళ్లీ కలిసి మాట్లాడాలని కాంక్ష కల్గింది. ఆమె ఇంటి యడ్రసు తెలియదు. ఇంటికి వెళ్ళి కలియడానికి వీలుపడదు. పోని ఆమె స్కూలుకు వెళ్లి కలుద్దామంటే, ఆమె సహోద్యోగినులు ఆమెను ఎగతాళి చేయవచ్చు. ఇంతకీ ఆమె ఏమంది- మనం కలవాలని ముందుగ ఏర్పాటు చేసుకునేకన్న దైవికంగా కలియడమే మంచిదంది. అంటే తనని మళ్లీ కలియడానికి ఏమి ఆతురత వ్యక్తపరచలేదు. అట్లాంటిది తనెందుకు కుక్కపిల్లలా, ఆమె వద్దన్నా వెనకబడడం? రామకృష్ణ అహం దెబ్బతింది.

మరో పదిహేను రోజులు ఆమె ధ్యాసలేకుండా గడిపేడు. తరువాత మళ్లీ నవనీత గురించి తలపే. మరి ఉండబట్టలేక ఆమె నెలాగైనా చూడాలని ఆమె పని చేస్తున్న స్కూలుకు వెళ్లేడు. గేటు వేసుంది. ఏ సందడి లేదు. లోనికి వెళ్లి అక్కడున్న వాచ్‌మన్‌ని అడిగేడు.

"స్కూలుకు వేసవి సెలవులు కదండి- అందుకే స్కూలు లేదండి."

"మళ్లీ ఎప్పుడు తెరుస్తారు?"

"వచ్చేనెల ఇరవైయో తారీఖునండి"

"మరి టీచర్లెవరు ఈ మధ్యన స్కూలుకు రారా?"

"హెడ్ మిస్ట్రెస్ అమ్మ ఏదైనా ఆఫీసుపనుంటే వచ్చి పోతుంటారండి. అంతేనండి."

"నీకు టీచరమ్మల ఇంటి యడ్రసు తెల్సునా?"

"నాకేం తెల్సండి? అదంతా ఆఫీసులోనే తెలుస్తుందండి"

"మరి ఆఫీసు లేదుగ!"

"అందుకే ఒచ్చే నెల 20వ తారీఖునరండి. అంతా తెలుస్తుంది," అని అటు తిరిగి బీడి ముట్టించేడు.

"నీ బొంద స్కూలే తెరుస్తే మాష్టరమ్మలంతా స్కూలుకే వస్తారుగ. మరి ఇంటి యడ్రసెందుకు? " అని మనస్సులోనే అనుకుని అక్కడ నుంచి కదిలేడు.

మరో నాల్గు రోజుల తరువాత సంగమ్ థియేటర్ ప్రక్కనుంచి ఓ మధ్యాహ్నపు వేళ కారులో పోతుంటే బుకింగ్ ఆఫీసు ముందర లైనులో నవనీత కనిపించింది. ఆనందంతో రామకృష్ణ హృదయం ఓ చిన్న మొగ్గవేసింది. మెల్లగ కారుని గేటు లోపలకు పోనిచ్చి పార్కు చేసేడు. తాపీగ నవనీత ప్రక్కనుంచి వెళ్తూ, హఠాత్తుగా ఆమెను చూసినట్లు ఆగేడు. అప్పుడే నవనీత కూడా రామకృష్ణను చూసింది.

"హలో నవనీతగారు! వాట్ ఎ సర్‌ప్రయిజ్!" అన్నాడు రామకృష్ణ.

"నవనీత వెంట ఆమె స్నేహితురాలు కమల, చెల్లెలు వనజ ఉన్నారు. అందుకే బిడియపడింది."

"మీరు సినిమాకు వచ్చేరా?" అడిగింది నవనీత బలవంతంగ చిరునవ్వుతో.

"అవునండి- అందమైన అనుభవం కదండి- అందుకే."

అతడి మాటల్లోని ద్వంద్వార్థాన్ని గ్రహించి మరింత సిగ్గుపడింది. తనొక్కర్తే వుండి ఉంటే ఏమైన సరైన జవాబు చెప్పేందును. గాని తనతో స్నేహితురాలు, చెల్లెలు ఉన్నారే. వాళ్లేం అనుకుంటారో ఇతడి చనువును చూసి అని భయపడింది.

రామకృష్ణ చిరునవ్వుతో "నాకు కమల్‌హాసనంటే ఎంతో అభిమానం, పైగ మ్యూజిక్ చాల బాగుందని విన్నాను. ఇంతకీ ఈ లైను ఇంత పెద్దదిగ ఉందే- లైనులో నిలబడితే టిక్కెట్లు

దొరుకుతాయా? "

"ఏమోనండి-దొరుకుతాయన్న ఆశ తోనే వచ్చేం. దొరక్కపోతే తిరిగి పోతాం."

"సినిమాకనివచ్చి నిరాశతో తిరిగి పోయినంత బాధ మరొకటుండదు" అని రామకృష్ణ బారులు తీరిన జనాన్ని చూసి నిట్టూర్చేడు.

"నవనీతగారు! మీరొక్కరేనా, ఇంకా మీతో ఎవరేనా ఉన్నారా?"

"ఈమె నా స్నేహితురాలు, పేరు కమల. ఈమె నా చెల్లెలు వనజ. మేం ముగ్గురమే ఏం?"

"టిక్కెట్లు తెద్దామని"

"ఎందుకులెండి మీకాశ్రమ? లైను లోనుంచున్నాముగ- టిక్కెట్లు దొరుకుతే సరి. లేకపోతే ఇంటికి పోతాం- మరోనాడు వస్తాం, రద్దీ తగ్గేక."

"అదేంటే నవనీత- అతనుటిక్కెట్లు తెస్తానంటే అలా అంటావు? ఈ లైనులో నుంచుంటే దొరికిన ట్టే గే- ఏ నాడో అవి వెనుక ద్వారం నుండి అమ్ముడయిపోయుంటాయి. ప్రజలు ఏమి అనుకోకుండ ఉండడానికి



మొక్కుబడిగ ఏ పాతికో, ముప్ఫైయో అమ్మి బుకింగ్ మూసేస్తాడు" అని ఆశతో రామకృష్ణ వైపు చూచింది కమల.

రామకృష్ణ నవనీత జవాబుకు ఎదురు చూడకుండా లోనికి వెళ్లేడు తలుపు తోసుకుని. లోన మేనేజరు గదిలోకి వెళ్లి డ్రస్ సర్కిల్ టిక్కెట్లు నాలుగు ఇమ్మని అడిగేడు, 'అందమైన అనుభవం' సినీమాకి.

"ఏమిటిసార్! ఈ మధ్యన ఎక్కడ అగుపించడంలేదు? " అని ఆప్యాయంగా పలకరించేడు రామకృష్ణకు బాగా పరిచయమున్న ఆ మేనేజరు.

"నేను సంవత్సరమైంది అలహాబాదులో ఉంటున్నాను. అక్కడ లా చదువుతున్నాను."

"బాగుందిసార్! చాలా దూరం వెళ్లి పోయేరు. సెలవులకు వచ్చినట్లున్నారు. "

"అవును-మీరు కులాసాగాయున్నారా? మీ అబ్బాయి క్షేమమేనా? "

"ఆ మధ్యన రాయువల్లూరు తీసుకుని వెళ్లేను. ఇప్పుడు మరే ట్రబుల్ లేదు. కులాసాగా యున్నాడు, స్కూలుకు వెళ్తున్నాడు."

"గుడ్!"

నాలుగు టిక్కెట్లను తెప్పించి ఇచ్చేడు.

"థాంక్సండి," అని బయటకు వచ్చేడు రామకృష్ణ.

## ప్రణయవల్లరి

ఈ లోగా బుకింగ్‌లు తెరిచేరు. బారులుగ నించున్న ప్రేక్షకుల రద్దీ మరీ ఎక్కువైంది.

"పదండి- లోనికి వెళ్దాం," అన్నాడు రామకృష్ణ.

నవనీతకు ఈ వ్యవహారం రుచించక పోయినా చేసేదేమి లేక మొహమాటంగా కదిలింది. వారివెనుక నుంచున్న నలభై ఐదు ఏళ్లు దాటిన ఓ ఆవిడ-

"పడుచువాళ్లకి ఎవరైనా టికెట్లు తెచ్చిస్తారు- మనలాంటి వాళ్లను ఎవ్వరు పట్టించుకోరు," అని సరసంగ అంది.

రామకృష్ణ ఆమెవైపు తిరిగి- "మిమ్మల్ని నేను చూడ లేదండి- చూసుంటే మీకూ తప్పక టిక్కెట్టు తెచ్చుందును- సారి," అని ఆకర్షణీయంగ ఓ నవ్వునవ్వి కదిలేడు.

ఆమె ఆ జవాబుకు, ఆ నవ్వుకు సరదా పడిపోయింది. ఇంటికి వెళ్లగానే అద్దంలో ఓసారి శ్రద్ధగ తనను తాను చూసుకుందామనుకుంది కూడ.

అతడు మెల్లగ ఆ ముగ్గుర్ని కూల్ డ్రింక్స్ స్టాల్‌కి తీసుకువెళ్లేడు.

"ఇంతసేపు ఎండలో లైనులో నుంచున్నారు. నేను ఎండలో అలా తిరిగి వచ్చేను. చాల దాహమవుతుంది లిమ్కా త్రాగుదాం. మీరేమి తీసుకుంటారు చెప్పండి."

"ఇప్పుడెందుకండి ఇవన్ని," చాల సిగ్గుపడిపోయింది నవనీత. ముఖ్యంగ తన చెల్లెలు, స్నేహితురాలు ముందర ఇవన్ని జరగడం ఆమెకు సుతరామూ ఇష్టం లేదు. వాటి పరిణామం అంతగ బాగుండదని తనకి తెల్సు. లేని అనుమానాలకు, అపోహలకు దారితీయవచ్చు, అనుకుంది."

"భలేవారే- ఈపాటి దానికే! ఏమమ్మా వనజా నీకేం కావాలి? కమలగారు మీకు?"

తనకు కిస్‌మత్ కావాలంది వనజ. గోల్డ్‌స్పాట్. కోరింది కమల. నవనీత మాట్లాడలేదు. వీరి జవాబును వినడమే తరువాయి చకచకా బాటిల్స్ ఫ్రిడ్జిలోంచి తీసి, ఓపెన్ చేసి అందించేడు సేల్సుబాయ్.

"మా ఇద్దరికి లిమ్కా," అన్నాడు రామకృష్ణ.

నవనీత పర్సులోంచి మూడయిదులు తీసి రామకృష్ణ చేతిలో పెట్టింది.

"ఇదేమిటి, డబ్బిస్తున్నారు?" రామకృష్ణ ఆశ్చర్యపోయి అడిగేడు.

"మా ముగ్గురి సినిమా టిక్కెట్లకు," అని జవాబిచ్చి లిమ్కా సీసాను అందుకుని త్రాగడం మొదలెట్టింది.

"ఇది మరీ బాగుంది. నాకలా పుచ్చుకోవడం అలవాటులేదు,"అన్నాడు.

"నాకలా ఫ్రీగా సినిమాకెళ్లడం అలవాటు లేదు. ఇంతకీ మీరు పిలుస్తే మేము రాలేదు కదా? ఇక్కడేదో కలిసేం- ప్లీజ్, మరేం అభ్యంతరం చెప్పకండి," అంది నవనీత. కాస్సేపటికి-

"ఈ హాలు బాగుంది కదు?" అని అడిగేడు రామకృష్ణ వనజను.

"చాల బాగుందండి. ఇప్పుడీ ఊరిలో ఇదే గొప్ప హాలనుకుంటాను."

"అవును"

"మరి ఇలా రెండు హాల్సుని ఒకే చోట ఎలా నిర్మించారో?" తన ఆశ్చర్యాన్ని ప్రకటించింది కమల.

"ఇదేమి చూసేరు నెల్లూరులో ఒకే చోట మూడు హాల్సున్నాయి. అందులోని డెకార్ మరీ అద్భుతంగవుంది. ఈ పట్నంలో ఇవే ఖరీదైన, అందమైన హాల్సు."

"మీకెంత సులువుగ, లైనులో



నించోకుండ టిక్కెట్లు దొరికేయి!" కమల తన కళ్లను పెద్దవిచేసి ఆరాధనగ రామకృష్ణను చూసింది.

రామకృష్ణ మాత్రం గొప్పగ నవనీతను చూస్తున్నాడు, చిలిపి నవ్వుతో. నవనీత అతడుఎవరితో కాలక్షేపంకి మాట్లాడుతున్నా దృష్టంతా తనమీదే ఉందని పసిగట్టింది.

"వనజమ్మా! మీరు మహారాణిపేటలో ఏ వీధిలో ఉంటున్నారు? మీ ఇంటినంబరు?" అని యాదాలాపంగ ధ్వనించేటట్లు అడిగేడు రామకృష్ణ.

గతుక్కుమంది నవనీత.

"వనజా! త్వరగ త్రాగేయి. సినిమా మొదలైనట్లుంది పద. నేను చెప్తానులెండి తరువాత," అని వనజను, కమలను కదిపి బయలుదేరింది.

హాలులో మొదటి సీట్లో నవనీత ముందుగ కూర్చుని, కమలని తన ప్రక్క సీట్లో కూర్చోమంది, తరువాత సీట్లో వనజ కూర్చుంది వెనుకగ వచ్చిన రామకృష్ణ ఆ నాల్గవసీట్లో వనజ ప్రక్కన కూర్చున్నాడు, చేసేదేమిలేక.

నవనీతకు రామకృష్ణపైన నమ్మకం లేక, అతడు అమర్యాదగా ప్రవర్తిస్తాడని అలా దూరంగ కూర్చోలేదు- స్నేహితురాలు, తన చెల్లెలు తప్పుగ భావించి విపరీతంగ ఇంట్లో చెప్పకుండ ఉండాలని అలా చేసింది. రామకృష్ణ ఆమె బెదురును కనిపెట్టేడు. కమలకు, వీరిరువురు ఎక్కువగ మాట్లాడడం లేదు, సరదాగా ప్రక్క ప్రక్కన కూర్చోడం లేదు. ఎందుకో? ఆమెకు ఇది ఆశ్చర్యకరంగానే తోచింది. తనైతే అట్లాంటి అందగాడితో, అచ్చు సినిమా హీరో శరత్‌బాబులా ఉన్న రామకృష్ణతో స్నేహమైతే, ఎగిరి గంతేసుండును. అట్లాంటిది ఈ నవనీత అంటీ అంటనట్లు ప్రవర్తిస్తుందేమి?

సినిమా జరుగుతున్నంతసేపూ ఎవ్వరూ మాట్లాడలేదు. చక్కని సంగీతం, సన్నివేశాలున్న చిత్రమది. ఇంటర్వెల్ ఇచ్చేరు. రామకృష్ణ లేచేడు. నవనీతతో అన్నాడు.

"అలా లాబీలోకి వెళ్దామా? ఏదైనా కాఫీగాని, కూల్‌డ్రింకుగాని తీసుకుంటారా?"

"ఒద్దండి- ఇందాకనేగా తీసుకున్నాం. మీరు వెళ్లిరండి- మేముంటాము."

కమలకు లేచి వెళ్లాలనుంది. అతడితో మాట్లాడాలనుంది. కాని నవనీత ముఖాన్ని చూసి ఆమె గంభీరతను చూసి ఊరుకుంది.

రామకృష్ణ లాబీలోకి వెళ్లి సిగరెట్టు కాల్చుకుని తిరిగి వచ్చేడు. ఈ లోగా కమల నవనీతను అడిగింది కుతూహలాన్ని అణచుకోలేక-

"అతనెవరే?"

"మా మావయ్యకు బాగా తెల్సినతనే. నాకంత పెద్ద పరిచయం లేదు. ఇవాళ హఠాత్తుగా కనిపించేడు. మన అదృష్టం బాగుంది- సినిమా టిక్కెట్లు తెచ్చిచ్చేడు. అందుకే డబ్బిచ్చేనేను."



"అతను చాల మంచి వాడులా ఉన్నాడే," అంది కమల.

నవనీత మరేమి జవాబు చెప్పలేదు. కమల అమాయకత్వానికి సన్నగ నవ్వుకుంది.

మళ్లీ ఆట మొదలెట్టేరు. ఆ చీకట్లో తడుముకుంటూ రామకృష్ణ వచ్చేడు. వరుసలో మొదటి సీట్లో కూర్చున్న నవనీత చేతిని అందుకుని అందులో మూడు కాడ్‌బరీస్ చాక్లెట్లను, ఆమె ఇచ్చిన మూడు అయిదు రూపాయల నోట్లను పెట్టేడు రామకృష్ణ.

"ప్లీజ్! కాదనకండి- తీసుకోండి," అని వాళ్లను దాటుకొని తన సీటుకి పోయేడు.

నవనీత ఆ చీకట్లో తడుముకుని చూసుకుంది. తనిచ్చిన నోట్లే. నిట్టూర్పు విడచి ఆ నోట్లను పర్సులో పెట్టుకుంది. ఆ చాక్లెట్లను చెల్లెలు వనజకు, స్నేహితురాలుకు ఇచ్చి తనొకటి తిన నారంభించింది. నవనీతకు తెల్సు రామకృష్ణకు ఈ ఖర్చు లెక్కలోనిది కాదు. కాని తనకు ఇవన్నీ అతని నుండి పుచ్చుకోడం ఇష్టం లేదు. ఒకరికి ఋణపడి ఉండడం అంత మంచిది కాదు. రామకృష్ణ ఏ విధంగానైన తన ప్రేమను, ఆదరణను పొందుదామనుకుంటున్నాడు. తను ఆ రెండింటిని ఇచ్చే స్థితిలో లేదు. తన అంతస్థు తనకు తెలియనిదేమి కాదు.

సినిమా అయిపోయింది. ఆ కథానాయిక మరణించడం, నవనీతను ఎంతో కదిపివేసింది. ఆ కథానాయకుడు కమల్‌హాసన్ ప్రవర్తన తనకెందుకో రామకృష్ణను స్మరణకు తెస్తూంది. గాఢంగ నిట్టూర్చి హాలు నుండి కదిలింది. ముందుగా రామకృష్ణ, వెనుక నవనీత బయటకు వచ్చేరు. వారికి కొంత వెనుక జనసమ్మర్దంలో ఉండి పోయేరు వనజ, కమల.

"మీరలా డబ్బును తిరిగిచ్చేయడం నాకేమి బాగులేదు."

"క్షమించండి- మిమ్మల్ని నేనిలా సినిమాకు తీసుకుని వెళ్లగల్గడంలో నేనెంతో ఆనందాన్ని అనుభవిస్తున్నాను. దాన్ని పాడు చేయకండి. మీ రెప్పుడైన నాకు టిక్కెట్టు కొని సినిమాకు తీసుకుని వెళ్లొచ్చు," అన్నాడు చిలిపిగ.

నవనీత చేసేదేమీలేక ఊరుకుంది.

"నేను ఒచ్చే బుధవారమే కలకత్తా మెయిల్లో ప్రయాణమౌతున్నాను. అందుచేత దయచేసి మీరీ ఆదివారం రామకృష్ణ బీచికి వస్తే ఎంతో సంతోషిస్తాను. మీతో నేనెన్నో మాట్లాడాలి. నా మాటను కాదనకండి. ఆదివారం అయిదు గంటలకు క్యాంటీన్ ముందర మీకోసం యెదురు చూస్తుంటాను. మీరు రాకపోతే నేనెంతో నిరాశతో కృంగిపోతాను. నేను మళ్లీ మరో సంవత్సరానికిగాని రాలేను."

నవనీత తలెత్తి నిశితంగ అతడి ముఖంలోకి చూసి, జవాబు చెప్పేంతలో కమల, వనజ వచ్చేసేరు.

# ఆనంద సందోహ దీపావళి

దివ్వెల వెలుగుల
మతాబు జిలుగుల
పటాసు మెరుపుల
అతివల తళుకుల
వెలసిరి మురిసిన జనావళి
ఆనంద సందోహ దీపావళి... "దివ్వెల"

నరకుని కఠోర దంష్ట్రల పీడిత
మానవ రక్షణకై
నాతి చేతి యమ బాణంతో
రక్కసి బాధలు సమసి పోవగా... "దివ్వెల"

రంగు రంగుల జావ్వల వెలుగులు
జగాన చీకటి పారద్రోలగా
దిక్కుల నిండిన పటాసు మోతతో
సంబరమంతా చింబరమవగా... "దివ్వెల"

కులమత భేదం సమసిపోవగా
సంకుచితత్వం సడలిపోవగా
బాలుర కోమల కోలాహలం
నవ దంపతుల కేళియుగం... "దివ్వెల"

-కాలనాధభట్ట వీరభద్రశాస్త్రి

(1989 దీపావళికి అమెరికాలో హ్యూస్టన్ తెలుగు సంఘంలో తొలి సారిగా పాడిన గీతం)
పాడినవారు: శ్రీమతి కె. మాణిక్యాంబ.

---

"అబ్బ - ఏం జనం!" అని కమల ముఖాన్ని రుమాలుతో తుడుచుకుంది.

"పదక్కా పోదాం- మళ్లీ బస్సు రద్దీ అయిపోతుంది," అంది వనజ.

"వస్తామండి- చాల థాంక్సు" అని ముగ్గురూ చెప్పి, త్వరగ అక్కడ నుండి కదలిపోయేరు.

రామకృష్ణ ఏమిటో ఆలోచిస్తూ వారు వెళ్లినవైపే చూస్తూ అలా ఉండి పోయేడు.

ఆ సినిమా గొప్పతనాన్ని చర్చిం చుకుంటు, మొదటి వారంలోనే తాము హైక్లాసు టికెట్లను సంపాదించి సినిమా చూడగల అదృష్టాన్ని పొందడం తలచుకుని ఆనందిస్తు బస్సులో ప్రయాణం చేసి తమ ఇళ్లకు చేరేరు.

ఆ రాత్రి నవనీత రామకృష్ణ గురించి ఏమేమో ఆలోచిస్తూ మెల్లగ నిద్రలోకి జారుకుంది. ఆ మరునాడు అనుకోని సంఘటన జరిగి నవనీతను ఎంతో కలచి వేసింది. నవనీతకు దూరపు బంధువు, వరుసకు తన తండ్రికి చెల్లెలవుతుంది, దుర్గమ్మ వీళ్ళింటికి వచ్చింది. నవనీత తండ్రి రిటైరైనది మొదలు ఆరోగ్యంగ లేదు. కొంప ముంచే జబ్బులేమి కాక పోయిన, ఉత్సాహాన్ని చంపే చిరురోగాలే అతణ్ణి అప్పుడప్పుడు పట్టి బాధిస్తుండేవి. అలా ఆ నాడు నడుం నొప్పితో వసారాలో వాలుకుర్చీలో కూర్చున్నాడు,

## ప్రణయవల్లరి

నవనీత తండ్రి పరంధామయ్య. దుర్గమ్మ లోనికి వచ్చింది. రెండు వీధులవతల వీధిలో ఆమె నివాసం.

"అన్నయ్యా! ఒంట్లో బాగులేదా? అలా నీరసంగ ఉన్నావు?"

"నేనెప్పుడు మాత్రం ఆరోగ్యంగ ఉన్నాను గనుక. ఏదో ప్రొద్దుట నుండి నడుం నొప్పితో బాధపడుతున్నా".

"అమృతాంజనం రుద్ది వేడినీళ్లు కాపడం పెట్టించక పోయేవు?"

"అనాల్జిన్ మాత్ర వేసుకున్నాను. తగ్గిపోవచ్చు - లేకుంటే సాయంత్రం మందు రుద్దిస్తా."

ఆ సరికి నవనీత తల్లి అక్కడే ఉంది ఏదో తెలుగు పత్రిక చదువుతు. గదిలో నవనీత, చెల్లెలు వనజ, తమ్ముడు ఉన్నారు. చెల్లెలు హైస్కూల్లో 9వ తరగతి చదువుతోంది, తమ్ముడు మురళి 8వ తరగతి చదువుతున్నాడు. పెద్ద తమ్ముడు రవి ఇంటరు మొదటి సంవత్సరం చదువుతున్నాడు. అందరికి వేసవి శెలవులు. పెద్ద తమ్ముడు రవి ఊరులోకి స్నేహితుడి వద్దకు వెళ్లేడు.

"ఏం దుర్గమ్మ- ఇలా వచ్చేవు?" అని పరంధామయ్య అడిగేడు.

"ఆ ఏం లేదు- మా కామేశం పెండ్లి గురించి మరోసారి అడుగుదామని."

"చూడు దుర్గమ్మ! నువ్వింతకు ముందు అడగడం, నేను జవాబు చెప్పడం జరిగింది కద. మళ్లీ ఈ నాడు ఆ ప్రస్తావన ఎందుకు?" అన్నాడు పరంధామయ్య.

"అవుసరం రాబట్టే మరోసారి అడుగుదామని వచ్చానన్నయ్య."

"నీ కొడుకు స్కూలు ఫైనలు పేసయి పోర్టులో ఏదో చిన్న ఉద్యోగం చేస్తున్నాడు. నా కూతురు డబుల్ గ్రాడ్యుయేటు. టీచరు ఉద్యోగం చేస్తు వాడికన్న ఎక్కువ జీతమే తెస్తోంది. పైగా నీ కొడుకు రూపురేఖలు నాకు గాని, నా కుటుంబానికి గాని నచ్చలేదు. అందుకే మా ఆలోచన మానుకుని, వేరే సంబంధం చూసి నీ కొడుక్కి పెండ్లి చెయ్యి."

"నా కొడుక్కు పెండ్లి కాక పోతుందని నేనేమి బెంగపెట్టుకోవడం లేదు. మంచి సంబంధమే వస్తుంది. నువ్వా పెద్ద పెద్ద కట్నాలిచ్చుకుని నీ కూతురికి పెండ్లి చెయ్యలేవు. నువ్వేమి పైవాడివి కావు- దగ్గర బంధువ్వి, అన్నయ్యవి. నీకు సహాయం చేసినట్లవుతుందని, వాడు నచ్చి, మెచ్చిన నీ కూతురు నవనీతను నా కోడలిగ చేసుకుందామని నా కోరిక.

బంధుత్వాన్ని చూడకుండ కాదుపొమ్మంటున్నావు- ఆలోచించుకో."

"మా వాళ్లెవరికి ఇష్టంలేని ఈ పెండ్లికి నేనెలా ఒప్పుకోగలను చెప్పు."

"-అని అలా కూతుర్ని ముదర బెట్టుకో. బెండకాయ సామెత బ్రహ్మచారికే కాదు, బ్రహ్మచారిణికి కూడ వర్తిస్తుందన్న సంగతి మరచి పోకు. నా కూతురు నల్లగనున్న నీ కొడుకుని ఎలా ఒప్పుకుంటుందిలే, ఎర్రగ బుర్రగ ఉన్నవాడు సినీమాలకు, షికార్లకు తిప్పుతుంటే-"

పరంధామయ్య షాకు తిన్నట్లయిపోయేడు. ఆశ్చర్యంతో కాస్త ముందుకు వంగి-

"చెల్లెమ్మా! ఏమిటి నువ్వన్నది? నా కూతురు ఎవడితోనో తిరుగుతున్నదనా?" అడిగేడు?

"అవును- నీ మురిపాల కూతురు నవనీత ఎవడితోనో సినిమాకు వెళ్లి, వాడి ప్రక్కన హాయిగ కూర్చుందిట. వాడు దీని భుజం మీద చెయ్యి వేసుకుని దర్జాగా కూర్చున్నాడట. ఒకటే నవ్వులట. మా వాడు సంగం సినీమాహాల్లో చూసేడట."

కోపంగ నవనీత గదిలోంచి వసారాలోకి వచ్చింది. వనజ ఆ వెనుక వచ్చింది.

"అత్తయ్యా! నీ కొడుకు చెప్పినదంతా నిజంకాదు. చాల కల్పితాలున్నాయి. నేను సినీమాకి వెళ్లిన మాట నిజమే. కాని నేను నా చెల్లెలు వనజతోను, మా వీధిలోనే ఉన్న నా స్నేహితురాలు కమలతోను వెళ్లేను. నేను వరుస కొసను కూర్చున్నాను. నా ప్రక్కన కమల, దాని ప్రక్కన వనజ కూర్చుంది. నేనెవడితోను షికార్లు కొట్టడం లేదు. సినీమా అయిపోగానే మేం ముగ్గురం 13వ నంబరు బస్సు మీద మహారాణిపేట వచ్చేసేము."

"అవును నాన్నా! అక్కయ్య చెప్పిందంత నిజం. నేను, కమల వెంట ఉన్నాంగ. అత్తయ్యకు ఆమె సుపుత్రుడు ఉడుకుమోత్తనంకి అలా చెప్పుంటాడు."

నవనీత తల్లికి కోపం వచ్చింది.

"ఏం వదిన! నీకుగాని, నీ కొడుక్కిగాని వేరేపని లేదా ఇట్లాంటి చాడీలు చెప్పడానికి? ఛీ! ఛీ! ఏం మనుష్యులో!" అని జానకమ్మ చీదరించుకుంది.

పరంధామయ్య ఏదో ఆలోచిస్తు అలా ఉండి పోయేడు. విసురుగ అందర్ని చూసి-

"అన్నయ్యా! నా మాటలు నమ్మకపోతే ముందు ముందు మీకే తెలుస్తుంది. చేతులు కాలేక విచారించి లాభం ఉండదు- తెల్సుకో," అని కోపంగ వెళ్లి పోయింది.

ఆనాడంతా నవనీత మనస్సు కలత చెందింది. ఏదో తప్పు చేసినట్లు బాధ పడింది.

## 9

"గణపతి బి.ఇ.డి. పూర్తిచేసి విశాఖపట్నంలోనే ఓ ప్రయివేటు స్కూల్లో టీచరుగ చేరేడు. తనకు సహాయపడి, అవసరానికి ఆదుకుని తన కాళ్లమీద తను నిలబడేటట్లు చేసినందుకు రామకృష్ణకు కృతజ్ఞతలు చెప్పుకున్నాడు."

గణపతి తండ్రి పౌరోహిత్యం చేసి ముగ్గురు కూతుళ్లను, ఇద్దరు కొడు



కులను పెంచేడు. గణపతి అక్కలిద్దర్కి అతనే సంబంధాలు చూసి పెండ్లి చేసేడు. మూడవ కూతురు చిన్నది. గణపతి ఇంటర్‌మీడియట్ మొదటి సంవత్సరం చదువుతుండగ, తండ్రి జబ్బు చేసి హఠాత్తుగ మరణించేడు. చెల్లెలు, తమ్ముడు చిన్న తరగతులలో చదువుతున్నారు. రానురాను పౌరోహిత్యానికి, వైదిక కర్మలకు ప్రాధాన్యత తగ్గిపోయి, ఆ వృత్తితో బ్రతకడం దుర్లభమై పోతుందని ఆ తండ్రి పిల్లల్నందర్ని చదువులో పెట్టేడు. ఆ తండ్రి చనిపోగానే రాటలు విరిగిన పందిరై కూలిపోయింది ఆ కుటుంబం. ఇంటరులో రామకృష్ణ, గణపతి మంచి స్నేహితులయ్యేరు. తండ్రి చనిపోయింతరువాత ఆధారంలేక చదువు మానేస్తానంటే, రామకృష్ణ ఒప్పకోక తనే గణపతికి ఆధారమయ్యేడు. ఇన్నాళ్లు వాళ్ల అవుసరానికి డబ్బును అందిస్తు గణపతిని ప్రయోజకుడ్ని చేసేడు. ఆ కుటుంబమంతటికి తెల్సు తాము రామకృష్ణకు ఎంతగ ఋణపడి ఉన్నారో.

గణపతి ఉద్యోగంలో చేరిం తరువాత రామకృష్ణ సహాయాన్ని పొందడం మానివేసేడు.

"అదేమిటి గణపతి, మా మామయ్య చెప్పేడు- నువ్వేమి డబ్బును తీసుకోవటం లేదని. కనీసం నీ ఇంటద్దెనేనా నేను ఇవ్వని."

"ఒద్దు రామకృష్ణ. నేను నెల నెల జీతం తెస్తున్నాగ. నా తమ్ముడు ఇంటరు పాసై షిప్‌యార్డులోఎప్రెంటిస్‌గా చేరేడు. ఈ ఏడాదయిపోతే వాడు అక్కడ మెకానిక్కుగ చేరతాడు. నా చెల్లెలు స్కూలు ఫైనల్ పాసయి, పైచదువులు చదవనని, ఇంట్లో అమ్మకు సహాయపడ్తుంది. మరి నాకు డబ్బంత అవుసరం లేదు. నువ్వు మరోలానుకోకు. నువ్వింత వరకు చేసిన సహాయమే మా కుటుంబాన్ని నిలబెట్టింది. నువ్వే మాకు దేముడివి."

"ఏమిటయ్యె గణపతి ఈ వెర్రి? అంత మాటనకు. నేనేమి దేముడ్నికాను నీ స్నేహితుడిని మాత్రమే. నీ చెల్లెలు పెండ్లికి మాత్రం అవుసరమయ్యే ఖర్చునంత నేనే భరిస్తాను. నాకు కూడ ఆమె చెల్లెలుకద. ఎంత కట్నమయిన వెనుదీయకు, మంచి సంబంధం చూసి నాకు చెప్పు. నాకు నువ్వు మాటివ్వాలి."

ఆనందంతో గణపతి కళ్లు చమర్చగా, రామకృష్ణను కౌగలించుకుని-

"నీ మనస్సు ఎంత పెద్దది! తప్పకుండ నీ చెల్లెలు పెండ్లి నువ్వే చేద్దువుగాని " అన్నాడు.

"రామకృష్ణ! నీ చదువెలా సాగుతుంది? శ్రద్ధగ చదువుతున్నావా?."

## దీపావళీ దివ్య దీపావళీ

దీపావళీ దివ్య దీపావళీ
నవ్య శోభావళీ
రమ్య తారావళీ....
దీపావళీ

దివ్వెల వెలుగుల ఆరావళీ....
ఒవ్వల మతాబుల దీపావళీ...
కొంగ్రొత్త శోభల తారావళీ...
చిచ్చు పటాసుల శోభావళీ...
దీపావళీ

పిల్లల పెద్దల పండగే శోభావళీ...
ఇంటింట దివ్వెల వెలుగులే దీపావళి
సంబరాన్నిచ్చేటి దీపావళి
రవ్వల వెలుగుల రమ్య దీపావళీ...
దీపావళీ

–కంకటి శంకర్‌రావు

"అక్కడ లెక్చరర్లు చాలా శ్రద్ధ తీసుకుని బోధిస్తారు. పైగా అలహాబాదు యూనివర్శిటి లైబ్రరీ చాల పెద్దది. కావాల్సిన పుస్తకాలను తెచ్చుకుని తీరుబడిగ చదువుకోవచ్చు. నేను శ్రద్ధగానే చదువుతున్నాను. నాకక్కడ ఇద్దరు ముఖ్య స్నేహితులున్నారు. ఒకడు బెంగాలీ, మరొకడు మధ్యప్రదేశీయుడు. ఇద్దరు బుద్ధిగా "చదివేవాళ్లే" అని గణపతికి తన స్నేహితుల గురించి అన్ని విషయాలు తెలియ జేసేడు.

"మరెక్కడ లవ్‌లో పడలేదా?"

"అంత తీరుబాటుండడం లేదు."

"వెరీగుడ్!" అని గణపతి సన్నగ నవ్వుకున్నాడు.

"ఎందుకా నవ్వు?" అనుమానంగా గణపతిని చూస్తూ అడిగేడు.

"మరేంలేదు..."

"నసక్కు- బయటపడు," కాస్త చికాకుగానే అన్నాడు రామకృష్ణ.

"నువ్వు మొన్నను సంగం థియేటరుకు మేటినీకి వెళ్ళేవా?"

"వెళ్లేను-ఏం?"

"అదే నీతో ఎవరో చక్కని అమ్మాయి ఉండడం, ఇద్దరు లాబీలో కూల్ డ్రింక్ లు త్రాగటం, కలసి నవ్వుకోడం మన క్లాసుమేటు నాగేశ్వరరావు చూసేడట. అప్పుడు నిన్ను పలకరిస్తే బాగుండదని ఊరుకున్నాడట. నిన్న నాతో చెప్పాడు." అని మెల్లగ అన్నాడు గణపతి.

రామకృష్ణ కాస్సేపు జవాబివ్వలేదు. తరువాత సర్దుకుని-

"అవును. నేను సినీమా హాలు వద్ద, నీకప్పుడు చెప్పేనే ఆ టీచరమ్మ, నవనీత కనిపిస్తే సినిమాకు వెళ్లేను. ఆమెతో ఆమె చెల్లెలు స్నేహితురాలు ఉన్నారు. ఆ నవనీత చాల సంస్కార వంతురాలు. మాటలలోనైతేనేమి, చేష్టలలో నైతేనేమి చాల పెద్ద మనిషి. వయస్సుకు మించిన హుందాతనం, గంభీరత ఆమెకున్నాయి. నేనెంత ధైర్యంగా, జులాయిగ తిరిగిన ఆమెతో ఉంటే ఎంతో గౌరవంగ ప్రవర్తించాలని ఉంటుంది. ఆమె అంటే నాకో ప్రత్యేక అభిమానం. దాన్నే మనాలో మరి కొన్నాళ్లు, మరికొంత పరిచయం అయితేగాని నేను నిర్ణయించుకోలేను. ఆమెను నేను ప్రేమిస్తున్నాను- అని చులకనగ అనేయలేను. ఆమెలో ఓ ప్రత్యేకమైన ఆకర్షణ ఉంది. ఇంతకన్న ఎక్కువగ విమర్శించి చెప్పలేను," గంభీరంగ అన్నాడు.

నీ మంచి చెడ్డలు నీకు తెలియనివి కావు. నీ మాటల్ని వింటుంటే నువ్వు ఎదిగేవని, నీ దృక్పథంలో ఓ పరిపుష్టి ఏర్పడుతోందని నా కనిపిస్తుంది.

రామకృష్ణ తేలికగా నవ్వేసేడు.

(ఇంకా వుంది)

# హల్లో డాక్టర్ నేనేం చెయ్యాలి?



డా. కొత్త రవీంద్రబాబు

**పి. కె. రావు, బందరు**

సాహిత్యాన్ని చదివేప్పుడు ఏది ఉత్తమమైనది ఏది నికృష్టమైనదీ ఎలా నిర్ణయిస్తారు?

మీ దృష్టిలో ఏది ఉన్నతోన్నత సాహిత్యం?

జవాబు:- నికృష్ట సాహిత్యం ఏమిటో చెప్పక్కరలేదనుకుంటాను.

నాదృష్టిలో ఉన్నత సాహిత్యాన్ని నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు.

శబ్దాలంకార ప్రధానమైన కవిత్వం, కేవలం చదివించే శక్తిగల కథలు, నవలలు, నాటకాలు, రచన చదివేప్పుడు ఉబుసుపోక కబుర్లు విన్నట్లు అనిపిస్తుంది. ఇది మొదటి రకం- కేవలం కాలక్షేపం కల్గించేది!

కొన్ని రచనలు చదువుతున్నప్పుడు బాహ్య ప్రపంచం మరచిపోతాము. కాని పూర్తి తన్మయీభావం కలుగదు.

ప్రబంధాలు, పౌనాటకాలు, పాఠకుల వ్యక్తిత్వాలను మరపింపక చదివించే కథలు, నవలలు, నాటకాలు- ఇవి రెండో రకం.

కొన్ని రచనలు చదువుతుంటే పాఠకునిలో సమాధ్యవస్తకల్గి పాత్రలో, సన్నివేశంలో వర్ణనలో లీనమై పోయినట్లు అనుభూతి కల్గుతుంది. ఈ అనుభూతి చిరకాలం మనసులో నిలచిపోయి ఎన్ని కొత్త అనుభూతులు కల్గినా చెరగిపోక మరింతగా పరిపుష్టి చెందుతుంది. కాళిదాసు కావ్యాలు, ప్రసిద్ధ సంస్కృత నాటకాలు, టాల్‌స్టాయ్ డాస్టవిస్కీ, చెకోవ్, టాగూర్‌ల ఉత్తమ కథలు, నవలలు శేలూరి శివరామశాస్త్రి, శ్రీ పాదల ఉత్తమ కథలు, ఇబ్సన్, ఓనీల్, సింజ్, ఓకేసీల రూపకాలు- మూడో రకానికి చెందుతవి.

ఇక నాల్గవ రకమైన పరమోత్కృష్ట రచనలు పాఠకునిలో తన్మయీభావం కల్గించి- సమాధ్యవస్థను కల్పిస్తవి. భారత భాగవత రామాయణాలు షేక్స్పియర్ విషాదాంత నాటకాలు- (ఆయన జీవిత చరమాంకంలో రాసినవి)

అయితే పాఠక హృదయ ప్రతిస్పందన వారి మానసిక పరిపక్వత, ఈర్ష్య, ద్వేషం అభిమానం ఆలోచనాశక్తిపై ఆధారపడి వుంటుందన్నది మర్చిపోవద్దు!

**పేరులేదు, బాపట్ల**

ప్ర వయసు 22 సంవత్సరములు. ఇంతవరకు గడ్డం మీసం రాలేదు. తలెత్తి తిరుగ లేకుండా వున్నాను.

జ డాక్టరు గారికి చూపించుకోవడం మంచిది. వృషణాలు చిన్నవై పురుష హార్మోను సరిగా వుత్పత్తి కాకపోతే టెస్టోస్టిరాన్ బిళ్లలు వాడి చూడవచ్చు. చూడకుండా సలహా యిచ్చే సమస్య కాదు.

**రామారావు, రాజమండ్రి.**

జుట్టు వూడుతున్నది. సంవత్సరం పాటు మినాక్సిడిల్ వాడినా ప్రయోజనం కలుగలేదు చుండ్రువున్నది ఉన్న జుట్టు వూడకుండా మార్గం చెప్పండి



జవాబు :- చుండ్రు పోవటానికి వారానికి రెండుసార్లు క్లినిక్ షాంపూతో తలంటుకోండి. బెట్నిసాల్ స్కాల్ప్ ఎప్లికేటర్ తల కు రాసుకోండి. వివరాలు మందుతో పాటు వుంటాయి.

ఏస్కజిన్ గొట్టం రాత్రి భోజనానంతరం మూడు నాల్గు నెలలపాటు వాడినందు వలన ప్రయోజనం వుండొచ్చు.

కొత్తగా జుట్టువచ్చినా రాకపోయినా మినాక్సిడిల్- 2% రోజూ రాసుకున్నందు వలన జుట్టు వూడడం తప్పక ఆగిపోతుంది.

అప్పటికీ తృప్తి లేకపోతే హెయిర్ ట్రాన్స్‌ప్లాంటేషన్ గురించి ప్లాస్టిక్ సర్జన్లను సంప్రదించండి.

హెయిర్ ట్రాన్స్ ప్లాంటేషన్ బాగా ఖర్చుతో గూడుకున్న పని. అందువలన పూర్తి సంతృప్తికర ఫలితం వస్తుందనీ చెప్పలేను.

జుట్టు వూడుతున్నదన్న ఆందోళన మనసు నుండి పోగొట్టుకోటానికి ప్రయత్నించండి.

**సి. ఎల్. తులసి, కోరుకల్లు**

ప్ర : వయస్సు 16 సంవత్సరములు. పొట్ట తగ్గాలి.

జ : ఆహారంలో కొవ్వు పదార్థాలు తగ్గించండి. ఇంట్లో పని చేసుకోండి. అన్నం తగ్గించి ఆకుకూరలు ఎక్కువగా తినండి. పెరుగు బదులు మజ్జిగ వాడండి.

**గౌరీశంకర్, గూడూరు**

ప్ర : రోజుకు ఏడెనిమిది సార్లు హస్త ప్రయోగం చేసుకుంటాను. అంగం మీద నరాలు కనిపిస్తూ తెగిపోతాయేమోనని భయం. అంగం చుట్టూ వెంట్రుకలెక్కువగా వున్నాయి. 17 సంవత్సరముల వయసు.

జ : అతి సర్వత్రా వర్జయేత్! దృష్టి చదువు మీద కేంద్రీకరించండి. స్పీమన్ బిళ్లలు రోజూ మూడు చొప్పున రెండు నెలలు వాడండి. వెంట్రుకలు తరచు కత్తిరిస్తుండండి.

# శ్రీవారి ముచ్చట్లు

## ఉషాసుందరి

గంట ఏడున్నర కొట్టారు. ఎండెక్కుతున్నా, చల్లటి గాలి వేస్తోంది. పచ్చటి ఆకుల్లోకి దూరి సూర్యకిరణాలు చక్కిలిగింతలు పెడ్తున్నట్లున్నాయి.

వాతావరణం ఆహ్లాదంగా వుందని కాబోలు, పక్షులు కూడా సావకాశంగా చెట్ల కొమ్మలపై ఉయ్యాలలూగుతూ కబుర్లాడుకుంటూ, మధ్య మధ్య కిలకిలమని నవ్వుకుంటున్నాయి. వంట కోసం కూరలు తరిగి పెట్టుకుంటూ, నూరాల్సిన మసాలాలు సిద్ధం చేసుకుంటూ హడావుడి పడిపోతున్న నాకు ఆకుల గలగలలూ, పక్షుల కిలకిలలూ, సూర్యకిరణాల తళతళలూ అద్భుతంగా తోచాయ్. ఏమిటీవాళ? ప్రకృతంతా ఇంత సందడి చేసుకుంటూంది? ఏదన్నా విశేషమా ప్రభాత సుందరి, ప్రభాకరుడూ తీరికగా కూర్చుని ముచ్చట్లు చెప్పుకుంటున్నట్లే వుంది. అందుకే కాబోలు పక్షి జంటలూ, పూలబాలలూ మహానందంతో కేరింతలు కొడ్తున్నాయి. మహా సంరంభంగా వున్న ప్రకృతిని చూస్తుంటే మనోహరమైన భావనలతో మనసు నిండి, నా గొంతులోంచి రాగాలు పుట్టుకొచ్చాయి. "ఊయలలూగే నా హృదయం, తీయని పాటా పాడేలే" పాటతోపాటు శ్రీవారు కూడా పక్కనుంటే ఇంత అందమైన ఉదయం ఇంకా అందంగా, ఆహ్లాదంగా వుంటుంది కదా అన్పించింది. ఏం మనిషి, ఇంకా లేవరు. ఎనిమిదవుతోంది. పొద్దెక్కినా మొద్దునిద్దరే ఈయనకి. లేపకపోతే, ఇహ తెల్లారదు కాబోలు. అయినా అంత నిద్ర ఎలా వస్తుందో! పెళ్ళి ముందూ, పెళ్ళయిన కొత్తల్లో ఎన్ని కబుర్లు చెప్పారనీ! "భార్యా భర్తలిద్దరూ కలిసి పని చేసుకుంటే ఎంత ఆనందంగా వుంటుందోయ్. రోజూ నేన్నీకు కూరలు తరిగిచ్చి, వంటింట్లో నీతోపాటే వుంటే నీకు హుషారుగా వుండదూ" అంటూ. నిజమే. భర్త తన కొంగుపట్టుకుని కూడా కూడా తిరుగుతుంటే ఏ ఆడదానికి గర్వంతో మనసు పొంగదు? అవన్నీ ఇప్పుడేమయ్యాయో? ఏ తొమ్మిదికో లేచి, టీ త్రాగేసి, బుద్ధిగా పేపర్ చదివి, పదింటికల్లా అన్నం తినేసి బుద్ధావతారంలాగా ఆఫీస్‌కి పోయి రావటం,

సాయంత్రం టి.వి.లు, సెలవురోజున వీడియోలు వుండనే వున్నాయి. అయ్యో! కాస్త తొందరగా లేచో, సాయంత్రాలు త్వరగా వచ్చో ఇంటి దానితో ఓ అచ్చటా, ముచ్చటా చెప్పుకుందా మన్పించదే ఈ మగమహారాజుకి! కబుర్లాడటానికి పెళ్లాం పనికి రాదు కాబోలు. కొలీగ్స్ కానీ, మగఫ్రెండ్స్, లేక పై ఆడవారో కావాలేమో! ఎంత మనోహరంగా వుందీ సమయం. ఇలాంటి వేళలో పక్క పక్కనే ఒకరినొకరు చూసుకుంటూ, కళ్లతో కళ్లు మేళవించి కూర్చున్నా ప్రణయ సంగమమే కాదా! ఇంతకంటే, తృప్తీ, ఆనందం, రతి కేళిలోనయినా వుందా అసలు? అయినా ఇంటేది-ఇంటి పనులకీ, పిల్లా పాపలను



కని పెంచడానికే తప్ప కులాసా కబుర్లకే మాత్రం పనికి రాదేమో! అందుకే గ్రీకు మహాశయులు ప్రేమ కలాపాలకీ, ప్రణయ సల్లాపాలకీ, తర్కవితర్కాలకీ, వేదాంత విచారాలకీ కోర్టిజాన్స్ అని వేశ్యాజాతి ఆడవారిని ఎన్నుకున్నారు. పెళ్లాం ఇంటి పన్లు, వంశోద్ధారణకి తప్ప మరెందుకూ రుచించలేదు వాళ్లకి. అందమైన కోర్టిజాన్స్‌తో సాయంత్రాలు హాయిగా, కబుర్లు చెప్పుకుంటూనో, శాస్త్రవితర్కం చేస్తూనో, కవితా పఠనం కావిస్తూనో ఉల్లాసంగా గడిపేవారు. ఫ్రెంచివారూ అంతే! సాలన్స్‌లో పై ఇంటి స్త్రీలూ, ఫ్యాషనబుల్ స్త్రీలతో చర్చలూ, సాహిత్య పఠనం చేయటమే తప్ప భార్యల దగ్గర బిగిసి పోవటమే! మరో మగాడు తన భార్యలో గుణాలూ, టాలెంట్స్ గుర్తించి పొగిడితే అదో ఆశ్చర్యం, ఆపై అసూయా, క్రోధమూ, యుద్ధమూనూ! అంతే తప్ప ఈ భార్య అనేది ఓ మనిషే. దానికీ మనసు, కోరికలూ, ముచ్చట్లూ, వుంటాయనీ, అదీ తనతో ఏ సబ్జక్టు మీదయినా చర్చించగలదనీ, మీమాంస చేయగలదనీ ఎందుకనుకోరో?-సాహిత్య సంగీత శ్రవణాలకి ఉమ్రావ్‌జాన్‌లే కాని సతీమణులకి అర్హత లేదు కాబోలు! ఆలోచిస్తుంటే భార్యలనే జీవులనీ భర్తలు ఎంత కించగా చూస్తున్నారూ అనిపించి ఎక్కడలేని ఆవేశం పుట్టుకొచ్చింది. అందుకే కాబోలు, ఆడదై పుట్టటం కన్నా అడవిలో మానై పుట్టడం మేలన్నారు మన వాళ్లు. అడవిలో మానుకైనా ఓ విలువా, మూల్యమూ వున్నాయి. ఈ ఆడదానికదీ లేదు. తర తరాలుగా, అన్ని దేశాలూ, అన్ని సమాజాలూ స్త్రీనింత చవకగా చూస్తూండటం-ఛ! ఏం బతుకులు- రోటీన్ బతుకులు. పాతకాలం వాళ్లకంటే చదువులూ, చట్టుబండలూ లేక




గాను గెద్దు బతుకే ఆడదానికొక భాగ్యం అనుకుని అందులో పడి కొట్టుకున్నారు. చదువుకుని, సంసారాలు దిద్దుకునే తెలివి తేటలు వుండి కూడా ఆడది తన సంసారాన్ని, బతుకునీ తనక్కావాల్సినట్టు మలచుకోలేక పోతోందంటే -దీనికీ నిర్లక్ష్యపు భర్తలే కదూ కారణం?!-నా ఆలోచనలకి బ్రేకు వేస్తూ-పక్షుల కిలకిలలు వినబడ్డాయి. చేస్తున్న పని ఆపి తలెత్తి చూశాను. రెండు తెల్లటి పావురాలు, ఎదురుగా జామచెట్టు మీద కూర్చుని, నల్లపూసల్లాంటి కళ్లు గుండ్రంగా తిప్పుతూ, కువకువలాడుతూ కవ్వించాయి. ఆ పక్కనే మరో కొమ్మ మీద రెండు మైనగోర్లు కబుర్లాడుకుంటున్నాయి. కొబ్బరి చెట్టు మీద చిలుకాగోరింకలు ముక్కులతో పొడుచుకుంటూ ముచ్చట్లు చెప్పుకుంటున్నాయి. అన్ని జంటలను చూస్తుంటే, చెప్పొద్దూ నాక్కూడా నా జతగాడి మీద బలే మనసయింది. చేతిలో పని వదిలేసి, ఉన్నపళంగా లేచి, పడకగది కేసి గబగబా నడిచాను. గదికంత దూరం నించే వినబడ్తోంది శ్రీవారి గుఱ్ఱు. నేనింత మాంచి రసవంతమైన మూడ్‌లో వుంటే, ఈ మనిషి ఏమీ పట్టనట్టు గుఱ్ఱుకొడ్తూ నిద్రపోవట మేమన్నా బాగుందా? చిర్రెత్తు కొచ్చింది నాకు. అధాటున లేవదీసి కూర్చోబెట్టి ఎడాపెడా దులిపేస్తానివాళ. అసలు రోజూ నాతో పాటు లేచి నాకు కంపెనీ యిస్తే తప్ప నేను వంటే చేయనింక, ఏం చేస్తారో చేసుకోమను. కోపంగా తలుపులు తెరిచి దూకుడుగా లోపల కదుగుబెట్టాను. ఓ పక్కకి తిరిగి ఓ చేయి చాచి తలగడ కింద పెట్టుకుని, మరో చెయ్యి వీపుమీంచి వెనక్కి అడ్డంగా పడేసుకుని, పసిపిల్లల్లాగా పడుకుని గాఢంగా నిద్రపోతున్నారు అయ్యగారు. తలుపు ధడేలుమన్న శబ్దం కూడా ఆయన్నేమీ కదల్చలేదు. ఆ పడుకున్న తీరు, భంగిమ చూస్తే కోపమంతా కరిగి

## శ్రీవారి ముచ్చట్లు

పోయి ముద్దొచ్చిందమాంతం. ఈ మనిషి మీద నేనసలు కోపగించుకోగలనా?-కాస్సేపలాగే చూస్తూ నిలబడ్డాను. రాత్రి ఉక్కకి లాల్చీ విప్పి పక్కన పడేశారు. విశాలమైన వక్షం మీద, భుజాల మీద, చేతుల మీద నల్లటి వెంట్రుకలు గాలికి అలవోకగా కదుల్తున్నాయి. భల్లూకం! ఒంటినిండా రోమాలే. నవ్వొచ్చిందొక్కసారి. "ఏమిటండీ ఈ రోమాలు, ఎలుగు బంటిలాగా. ముద్దెట్టుకుందామన్నా దగ్గరగా కూర్చుందామన్నా, గుచ్చుకుంటాయేమో భయం" అన్నానో సారని ఎంత హడావుడి చేశారని. అదే మగటిమికి చిహ్నమన్నారు. పేడి వాళ్లకీ, ఆడవాళ్లకీ తప్ప మరెవరికీ ఒంటి మీద జుట్టు లేకుండా వుండదన్నారు. నేనేం బృహన్నల ననుకున్నావా అని మండిపడ్డారు. పురుషుని సౌందర్యానికీ, ఐశ్వర్యానికీ అతడి ఛాతీ మీద, భుజాల మీద, చేతుల మీద ఉండే చిక్కటి జుట్టే కారణమని జ్ఞానబోధ చేశారు. నీకు తెలీకపోతే, వెళ్లి మీ ఇంట్లో పెద్ద వాళ్లనెవరినైనా అడిగి తెలుసుకోమని సవాల్ చేశారు. ఆయన వీరావేశం చూసి హడలిపోయా నారోజు. అనర్గళంగా సాగిపోతున్న ఆయన లెక్చర్నిలా ఆపాలో తెలీక, మురిపెంగా దగ్గరకు చేరి, ఆయన చుబుకాన్ని పట్టుకుని కళ్లల్లోకి చూస్తూ మెత్తగా అడిగాను. "అయితే మీలాంటి భల్లూ దొరకటం నాదే పరమభాగ్యమా?" "మరేమిటనుకున్నావ్" అంటూ నా గుండెల్లోకి పసిపాపలాగా ముఖం దూర్చుకుంటూ, "ఆ పేరే ముద్దుగా వుంది. అలాగే పిలు నన్ను" అని అనుగ్రహించారు. "ఏదీ? భల్లూనా?" "ఊఁ", హమ్మయ్య! కోపం తగ్గటమే కాదు, మహాప్రసన్నమయ్యారే అని సంతోషపడ్డాను. స్వామి వారు సెలవిచ్చాక, ఇహ మనకేం బాధని ఆ పేరే స్థిరపరిచేశానప్పట్నుంచీ. ఫరవాలే, సరస హృదయుడే నా మొగుడు. హత్తెరీ నన్ను ఎలుగుబంటి అంటావా అని అంతెత్తునెగిరి, ఎంత పొగరే నీకని వీరాంగం వేయలేదు, నయమే!-వాచీ ఎనిమిది కొట్టింది. ఉలికిపడి, ఆలోచనల్లోంచి తేరుకుని మంచం వేపు నడిచాను. మెల్లగా పక్కలో కూర్చున్నాను. మనిషెక్కడా కదల్లేదు. కాస్సేపలాగే కూర్చుని ఒంగి మొహం మీద మొహం పెట్టి చూశాను. ఆయన బ్రహ్మాండమైన గుఱక నా ఉచ్ఛ్వాస నిశ్వాసాలని ఆయనకి తగలకుండా బ్రహ్మాస్త్రంలా అడ్డుకుంటూంది. ఇహ లాభం లేదు. "సార్!"-చలనం లేదు. "మాస్టర్ జీ!" వినయంగా పిలిచాను. ఊహూ! ఎంగి చెవి దగ్గరగా నోరుపెట్టి "స్వామీ!" అని భక్తిగా పిలిచాను. అదీ పనైయ్యలా. "అయ్యా!" అన్నాను. గట్టిగా వ్యాపార ధోరణిలో కొద్దిగా కదిలి, మళ్ళీ గుఱ్ఱు మొదలెట్టారు. ఏం చేయటం? "ఏమండీ!" గోముగా అన్నాను. అబ్బే! "ప్రభూ!" నిస్సహాయత గొంతులో. పక్కకి తిరిగి, వెల్లకిలా పడుకుని నా చేతిని గుండెల మీదకి లాక్కుని గుఱ్ఱుకొట్టసాగారు. ఏం మనిషి! పొద్దున్నే ఏ భార్య వచ్చి ఇలా రకరకాలుగా పిలిచి ముద్దులొలక బోస్తుందిట! నేను కదాని వచ్చి ఇంత సరసంగా పిలుస్తుంటే వినేపించుకోరు! ఇలాంటి మనిషి భల్లూకం కాకపోతే మరేమిటి? పెట్టి పెట్టి మంచి పేరే పెట్టాలే-అరె-మెరుపులా వచ్చింది అయిడియా. ఎంత ఫూల్ ని నేను అనుకుంటూ, చెంపకి చెంప చేరుస్తూ పిలిచాను-'భల్లూ!' ప్రేమ, అసహాయత, చిలిపితనం అన్నీరంగరించి, "ఊఁ" వెంటనే వచ్చేసింది జవాబు. జవాబుతోపాటు ఆయన చేతులు కూడా పైకి లేచి నన్ను చుట్టేసుకున్నాయి. గుండె ఝల్లుమని, ఒళ్లంతా పరవశించిపోయింది. ఆ బాహు బంధంలోంచి అనురాగధార నాలోకి ప్రవహిస్తున్నదా? ఏదో వివశత. ఆయన ఛాతీ మీద తల వాల్చేసి మౌనంగా వుండిపోయాను. ఇదే అదనని స్వామివారు మళ్ళీ గుఱ్ఱు మొదలెట్టేశారు. మొదటి కంతా మోసం వచ్చింది. ఇప్పుడేం చేయడం?-మళ్లీ మేలుకొలుపులు పాడాలంటే నీరసం వచ్చింది. నిశ్శబ్దంగా కూర్చున్నాను. కాస్సేపాగి మొదలెట్టాను. "భల్లూ! మీరిక్కడిలాగ ఒళ్లు తెలికుండా నిద్రపోతున్నారు కానీ, బయట ఎంత సందడిగా వుందో తెల్సా?" "ఏం సందడీ?" తెఱవు మఱవుగా అడిగారు. హమ్మయ్య! వింటున్నారు కదా! ఇహ నేను ఏకధారగా మొదలెట్టాను- "ఎంత మంది మీ కోసం వచ్చి కూచున్నారో తెల్సా" ఆయనేం కదలలేదు. "ఎవరూ?" యాధాలాపంగా అడిగారు. అంతలో మళ్లీ గుఱ్ఱు. ఆయన మీదకి వాలి జుట్టులోకి వేళ్లు పోనిచ్చి నిమురుతూ చెప్పసాగాను. "పక్షులొచ్చాయ్. పువ్వులొచ్చాయ్. పిల్లగాలులొచ్చాయ్. తెల్లమబ్బులొచ్చాయ్. పూల సౌరభాలొచ్చాయ్-" "ఊహూ! ఏమేం పక్షులొచ్చాయ్?" "ఏమేమిటొచ్చాయని తాపీగా అడుగుతున్నారా? మైనగోర్లొచ్చాయి. చిలకా గోరింకలొచ్చాయి. ఇంకా గువ్వపిట్టలొచ్చాయి. కోయిలలొచ్చాయి. నీలాపుపాలపిట్టలొచ్చాయి. అన్నీ జంటలు జంటలుగా కొమ్మల మీద కూర్చుని, మిమ్మల్ని పిలుస్తున్నాయి. ఇంకా లేవలేదాని అడగుతున్నాయ్. ఎవ్వుడు లేస్తారోనని తొంగి చూస్తున్నాయ్. లేవండీ!"

శ్రీవారి ఆసక్తి పుంజుకున్నట్టుంది





## కిమీ సమస్యలు

కిమీ కాట్కర్ తన భర్త మూలంగా అనేక సమస్యలను ఎదుర్కొంటున్నది. ఇన్నాళ్ళు తను గడించిన పేరును భర్త కాల రాస్తున్నాడని బెంగపడుతోందట. సినిమాలకు బుక్ అయ్యే సందర్భంగా తన భర్త అంతులేని డిమాండ్ల మూలంగా నిర్మాతలు వెనక్కు పోతున్నారని, భర్త మూలంగా యిన్నాళ్ళు మిత్రులుగా వున్నవాళ్ళు శత్రువు లవుతున్నారని కిమీ వాపోతోంది. భర్త మాట వినకపోతే ఎలా అని అనుకుని సర్దుకుపోదామంటే వచ్చిన అవకాశాలు చేజారిపోతున్నాయట. మరి ఈ సమస్యల్ని ఎలా ఎదుర్కొంటుందో!

నన్ను మరింత దగ్గరగా లాక్కుని, నా మెడ వంపులో ముఖాన్ని అన్చి "ఇంకా ఎవరెవరొచ్చారూ?" అడిగారు. ఆ స్వరంలో ధ్వనిస్తున్న కుతూహలాన్ని గమనించి, మంత్రం ఫలించిందనుకున్నాను.

"ఎఱ్ఱ గులాబీలొచ్చాయండి. తెల్లగులాబీలు విరగబడ్తున్నాయి. మల్లెలు గుమ్మెత్తిపోతున్నాయి. నిన్న సాయంత్రమనగా పూచిన జాజులు కూడా మీ కోసం కాచుక్కూచున్నాయి, రాలిపోకుండా. పారిజాతాలు, నందివర్ధనాలు, మందారాలు-ఓహో ఎన్నెన్నో! ఊగి, వూగి, తలలెత్తి మెడలు నిగిడ్చి చూస్తున్నాయి, మీ కోసం. గదిలోంచి లేచి పెరట్లోకొస్తున్నాయి

కోసం. గదిలోంచి లేచి పెరట్లో కొస్తున్నారేమోనని ఎఱ్ఱగులాబీలయితే మరీను. వొంగీ, తొంగీ చూస్తున్నాయి మీకోసం"

'ఇంకా?' ఆయన గొంతులో ఆవేగం.

"పిల్లగాలులు రివ్వుమంటూ లోపలికి దూసుకొస్తున్నాయి. మీరెక్కడున్నారోనని గదులన్నీ గింగిరాలు తిరుగుతున్నాయి."

"మరిక్కడికి రాలేదేం? ఈ ఫ్యాన్ గాలి తగలనిచోటల్లా నాకు ఉక్కపోసి చెమట్లు వస్తుంటే?" కినుకగా అడిగారు.

మరి మీరు గది తలుపులు బిడాయించేసుకుని పడుకుంటే ఎలా వస్తాయి, పాపం సముదాయింపుగా అన్నాను. "చూడండి. ఇప్పుడు నేను తలుపు తీశాగా. లోపలకొచ్చి గదంతా చల్లగా, ఎయిర్ కండిషండ్ లాగా చేసేశాయి."

"ఊఁ!" అంటూ గునిశారు శ్రీవారు. "సూర్యుడయితే ఎప్పుడనగా వచ్చేశాడండీ, పాపం. ఎండెక్కకుండా మీతో వూసులాడదామని మహా ఉబలాట పడిపోతున్నారు లేవండి మరి. ఒక్కసారి పైకొచ్చి చూడండి. అందరూ మీ కోసం ఎలా కాచుక్కూచున్నారో. వాళ్ళందరికీ మీరంటే ఎంత ప్రేమో చూశారా మరి. అందరూ మీరే కావాలని అడుగుతున్నారు. లేవండి సార్. రా రమ్మని పిలుస్తున్నారు. పదండి. సూర్యుడు తన లేత కిరణాలను లోపలకి పంపిస్తున్నాడదిగో, మిమ్మల్ని తీసుకు రమ్మని, ఇంకా పడుకుంటానంటారేమిటీ?" అంటూ నేను హడావుడిగా లేచి కూర్చుని, ఆయన్ను కూడా లేవదీసి కూర్చోబెట్టేశాను.

"ఓహ్! వీళ్లే కదా వచ్చింది. ఇంకెవరూ లేరా?" అంటూ నిరుత్సాహంగా నా భుజం మీద తలవాల్చుకున్నారు మళ్లీ.

"ఉన్నారండి. లేకేం? మీ ఫేవరిట్ వున్నారు."

"ఎవరూ?" అన్నారు తలెత్తి చురుగ్గా చూస్తూ.

లేచి ఆయన ఎదురుగా నిలబడ్డాను. రెండు చేతులూ ఆయన భుజాల మీద వేసి, కళ్లల్లోకి కొంటెగా చూశాను. "ఉషబాల".

"వారె! మరి చెప్పవేం? ఎప్పుడొచ్చిందీ?" నా రెండు చేతులూ పట్టుకుని ఖుషీగా ముద్దెట్టుకున్నారు.

"ఎప్పుడేమిటీ? మీరంటే ఇంత పొద్దెక్కిందాకా మొద్దు నిద్దర పోతున్నారు. కానీ, ఆవిడ పొద్దు పొడుస్తూనే మొదటి జామునే వచ్చేసింది, మీ కోసం. మీరు లేచి వస్తారని ఇంతమందిని పిలుచుకొచ్చింది మహా సంరంభంగా. మీరు రాలేదని కోపగించుకుని సూర్యుడు వేడెక్కిపోకుండా వుండాలని, మబ్బుల్ని రమ్మంది. పిల్లతెమ్మెరలని రమ్మంది. కోయిలలని పాడమంది. పువ్వుల్ని ఆడమంది. పిట్టల్ని గంతులేయమంది. త్వరగా రండి మాస్టర్ జీ. ఇంకా ఆలస్యం చేస్తే ఎవరి వన్ల మీద వాళ్లెళ్లి పోవద్దు మరీ. పాపం వాళ్ల కాలస్యమైపోతూంది. లేవండింక" చేయి పట్టుకుని లాగారు.

"పదయితే. ముందే ఉషబాల వచ్చేసిందని చెప్పొంటే ఈ పాటికి లేచే వుందునుగా" అన్నారు హుషారుగా. "ఆడబుద్ధి పోనిచ్చుకున్నావు కాదు! ఆఖరిదాకా నాకెంతో ప్రియమైన వ్యక్తి పేరు చెప్పకుండా దాచేశావు."

"అపుస్లెండి. పక్కనెంత అందమైన పెళ్లాం వున్నా, మరో ఆడదంటేనే మక్కువ మీకు. మీ మగబుద్ధి బాగుందటనా?" అలిగాను.

"ఊహూ. నా ఉషబాలని నా పక్కనే వుంచుకుని, నా చేతుల్లో బంధించి, ఆమె ప్రతిరూపం విశ్వమంతా పరచుకుంటుంటే చూడాలని" అనురాగంగా నన్ను దగ్గరకి తీసుకుంటూ అన్నారు. నా పేరుతో శ్లేష వాడుతున్నారని అర్థమవుతున్నా, వెంటనే కరిగిపోతే లోకువైపోతానని, "చాల్లెండి.

గడుసుతనం. మాటల గారడీ చేయటానికి మీ తర్వాతే ఎవరైనా" టవల్ తీసుకుని శ్రీవారిని ముందుకు తోశాను. బ్రష్షూ, పేస్ట్ తీసుకుని వెళ్లేసరికి అయ్యగారు అచ్చం కవిసార్వభౌముల్లాగా నిలబడి, ప్రకృతంతా నిండిన సందడిని తిలకిస్తున్నారు. అలికిడి విని, పక్కకు తిరిగి నావేపు భావగర్భితంగా చూశారు. అందాలు సంతరించుకుని నవనవోన్మేషంగా కాంతులీనుతున్న ఆ ఉదయాన్ని చూస్తుంటే ఆయనకీ హృదయం స్పందించిందల్లే వుంది. కళ్లల్లో అవ్యక్తమైన మెత్తదనం మెరిసింది.

కాలకృత్యాలు తీర్చుకుని లోపల కొచ్చారు. టీ కప్పు చేతికిచ్చి, నేనూ ఓ కప్పు తీసుకుని, ఆయన పక్కనే చేరాను. చేయి చాపి, నా ఒళ్లో వేశారు. "చాల ప్లెజంట్‌గా వుందివాళ" అన్నారు మెల్లగా. గట్టిగా మాటాడితే ఆ అనుభూతి కరిగిపోతుందేమోనన్నట్టుగా. అవునన్నట్టుగా తలూపి, అయన్ను అనుకుని కూర్చున్నా. మాటల అవసరం కనిపించలేదిద్దరికీ. ప్రకృతిలో చిందులేస్తున్న సౌందర్యమూ, ఆనందమూ, మాలో అణువణువులోకీ ప్రవహిస్తూ ఇద్దర్నీ దగ్గరగా; మరింత దగ్గరగా, ఒక్కటిగా బంధిస్తున్న భావన. ఆయనకీ అలాగే వుందేమో, నా వేళ్ళని తన బలమైన వేళ్ళతో సున్నితంగా బంధిస్తూ, నా కళ్ళల్లోకి చూశారు. ఇద్దరిలోనూ ఒకే భావన; ఒకే రాగం; ఒకే స్పందన; ఒకే వివశత తెలుసుకున్న కళ్లు మనోహరమైన కాంతితో వెలిగాయి. అంతరాంతరాలలోంచి ప్రణయభావన ధారలై మా ఇద్దర్నీ తడిపేసింది.

ఎండ చురుకుమంటూ పలకరించటంతో పారవశ్యంనించి తేరుకున్నాము. వదిలేసిన వంటపని పూర్తి చేయటానికి లేచాను. మనసంతా తేలికగా, హాయిగా వుంది. "మరో కప్పు టీ ఇయ్యవోయ్" అన్నారు. పొయ్యి మీద గిన్నె లెక్కించి, టీ తీసికెళ్లాను. "అద్భుతంగా వుందివాళ టీ. రోజూ ఇలా చేయకూడదూ?" చిలిపిగా అడిగాను.

"ఎందుకు చెయ్యను? ఇవాళా నేను చేశాను. రోజూ నేనే చేస్తున్నాను. ఆ మనిషినేగా! మరి రోజూ మీరిలాగా పొద్దున్న పొద్దున్నే లేచి నాతో పాటు కాస్సేపు కూర్చోండి. అన్నీ ఫస్టుగా వుంటాయి. పెళ్లయిన మొదటి నెలల్లోనే ఆ మురిపాలన్నీ. పాతబడే కొద్దీ, భోజనాల వేళకే పెళ్లాం ముఖం చూడటం. అదీ అవసరం కదాని. ఇంతకీ నాకు తెలీకడుగుతాను కానీ, అవసరాలు తీర్చటానికేనా ఏం భార్య?"-ఆవేశం ఉప్పొంగింది నాలో.

ఆయనేం మాట్లాడకుండా నా వేపే చూస్తూ కూచున్నారు. ఇదినా భార్యేనా అన్నట్టు. దొరికినఅవకాశాన్ని వదుల్చుకోదల్చుకోలేదు నేను.

"ఏం ప్రొఫెసర్ సాబ్, మాట్లాడరే. ఇదిన్ని మాటలెలా నేర్చుకుందనా? అవసరం, సార్, అవసరం. మన పెళ్లయిన కొత్తలో ఎలా వుండేవాళ్లం? ఒక్కసారి గుర్తు తెచ్చుకోండీ." పాత జ్ఞాపకాలు వెల్లువలై పొంగే సరికి మనసు నిండుకొచ్చి కొన్ని నిముషాలు మాట్లాడ లేకపోయాను. చేతిలో పని పక్కన పడేసి, లేచి వెళ్లి ఆయన ఒళ్లో తలదాచుకున్నాను. నా భావావేశాన్ని గమనించి అర్థం చేసుకున్నట్టుగా నా తల మీద చేయి వేశారు. "చూడండి. ఇవాళలాగా రోజూ కస్సేపు ఒకళ్ల కొకళ్లకి చేరువగా కూర్చుని నిశ్శబ్దంగా కబుర్లు చెప్పుకుని ఎన్నాళ్లయిందండీ. పెళ్లయిన తర్వాత మనమేం ప్రమాణం చేసుకున్నాం? అందరిలాగా మనం కూడా మన బంధాన్ని సడలనివ్వకుండా, మన మధ్యదూరం పెరగకుండా దాంపత్య శోభను నిత్యనూతనంగా ఉంచుకోవాలనుకోలేదూ? ఇప్పుడో? మనమూ అందరిలాగే రొటీన్ చేసేసుకుంటున్నాము బతుకులు. అసలింతకీ సెక్సొక్కటే భార్యభర్తల మధ్య ఆకర్షణా ఏమిటి? ఇప్పుడు కొన్ని నిముషాల క్రితం మనిద్దరం కలసి అనుభవించిన కలయిక, అనుభూతి ఏ సెక్సుకి సాటి వస్తుందో చెప్పండి. మనిద్దరిలోనూ ప్రవహించిన అనురాగ స్రవంతి మన అంతరాంతరాల్లోనూ నిండిపోయి ఆత్మలుసంగమించలేదూ? ఆ ఆనందంతో ఒంట్లో కొత్త శక్తి పుట్టుకురాలేదూ? ఆ శక్తేనండి, భర్త భార్యకిచ్చేది, నగలూ, చీరలూ కాదు. అంతే కాదు. ఆ శక్తి నుండే భార్యనించి అంతులేని ప్రేమా, భక్తీ పొందేది. ఇది పరస్పరమూ ఇచ్చిపుచ్చుకునే శక్తి." హఠాత్తుగా నా గొంతు జీరబోయింది.

నా తల నిమురుతున్న శ్రీవారు నన్నులేపి, రెండు చేతుల్లో నా ముఖాన్ని సుతారంగా పట్టుకున్నారు. ఆయన కళ్లల్లోనూ, పెదవులపైనా చిలిపి నవ్వొకటి మెరిసింది. "అమ్మాయీ! ఓర్పుగా నీ లెక్చర్ విన్నందుకు ఫీజు తర్వాత వసూలు చేసుకుంటా గానీ, ముందిది చెప్పు. మన మధ్యదూరం పెరిగి, రొటీన్ బతుకు అయిపోతున్నాదన్నావ్. అది నా ఒక్కడిదేనా తప్పు?- నీదేం లేదా? నువ్వు నన్ను లేపి ఎన్నాళ్లయ్యింది? పెళ్లయ్యాక రోజూ ఎలా లేపేదానివో జ్ఞాపకం తెచ్చుకో. నువ్వొచ్చి లేపిందాకా అలాగే పడుకుని వెయిట్ చేసేవాడినో లేదో గుర్తు చేసుకో. మెత్తని చేతుల్తో నా గుండె మీద నిమురుతూ, ఎఱ్ఱటి పెదవులని నా నుదుటి మీద సుమిమెత్తగా అద్దుతూ, 'లేవండి స్వామీ!' అని లాలిత్యంగా లేపితే - ఆ హాయి కోసం, ఆ అనుభూతి కోసం తెలివొచ్చినా లేవకుండా నువ్వొచ్చిందాకా పడుకునే వాడ్ని కాదూ? అప్పుడే స్నానం చేసొచ్చి, స్నిగ్ధంగా ప్రత్యూష హిమస్నాత అయిన ఉషబాలలా నువ్వొస్తే చూడాలని కళ్లు మూసుకుని నిద్ర నటించే వాడ్ని కాదూ? మరిప్పుడేమయింది నీకు? ఎందుకు మానేశావవన్నీ! భర్తని వశం చేసుకునే వరకేనా ఆ ట్రిక్కులన్నీ?-అహా, అలా కోపంగా చూడకు. ఇందాకా నువ్వన్నావే అవసరాలకేనా భార్య అని. అందుకని అడుగుతున్నా. భర్త వశమయ్యాక ఇహ వాడిని నిర్లక్ష్యంగా వదిలేయట

## అక్షరావళి

అజ్ఞాన అంధకారాన్ని
బొగ్గులా చుట్టుకున్న
బ్రతుకుల్లో -విజ్ఞానం
ఎర్రగా ప్రజ్వరిల్లేందుకు
అక్షరం... అగ్నికణమైతే
అది అక్షర దీపావళి!
నిజాయితీ దోపిడీకి గురవుతూ
నిరక్షరాస్యత నీడలు నిలువెత్తుగా
నిర్భాగ్యుడిని నిరాశా చీకటిలో
నిస్సారంగా నిలబెడితే,
అక్షరం... ఆరోప్రాణమై
అక్షరం కాంతి కిరణమై
అతని చేతిలో ఆయుధమైతే
అది అక్షరాలా దీపావళి!

–శిరీష

మేనా?-అటువంటప్పుడు ఈ లేపడాలూ అనురాగాలూ, వయ్యారాలూ ఒలకబోసి వాడికన్నీ నేర్పటమెందుకూ? తీరా ఆ మొగుడిగాడిలో అన్ని కోరికలూ, వేడుకలూ కలుగజేసి వాడిని పట్టించుకోకుండా వదిలేయటమెందుకు?-నిన్ననే మా ఫ్రెండొకడు చెప్పుకుని బాధపడ్డాడు. “పెళ్లయిన కొత్తలో మా ఆవిడ రోజూ పొద్దున్నే పక్కమీంచి లేచేటప్పుడు నన్ను గాఢంగా ముద్దుపెట్టుకుని మరీ లేచేది. ఇప్పుడిహ ఆ మాటే గుర్తులేదు దానిక. అది లేస్తున్న అలికిడికి తెలివొచ్చి నేనూ లేస్తాను. దానివేపే చూస్తాను, గుర్తొస్తుందేమోనని. ఊహూ. ఏం పట్టనట్టే వెళ్లిపోతుంది, తలుపులు చేరేసి. అక్కడికీ ఓ రోజు పట్టలేక అడిగాను. “నువ్వు నాకు అన్యాయం చేయటం లేదా”ని. నేనేం చేశాను అని ఆశ్చర్యపోయింది కానీ ఆ ఆలోచనే రాలేదు. మళ్లీ రెండ్రోజులాగి నేనే గుర్తు చేశాను. ‘సారీ అండీ అంది! ఓ రెండ్రోజులు పాత అలవాటు కంటిన్యూ చేసింది. తర్వాత యథాప్రకారమే. ఈ ఆడాళ్లింత నిర్లక్ష్యం చేస్తారు మన్ని. వాళ్లని మనం పట్టించుకోమనీ నిర్లక్ష్యం చేస్తున్నామనీ చెప్పుకు చెప్పుకు వాపోతారు. రాత్రి ఎంత సుఖమనుభవించినా. ఎన్ని సరసాలాడుకున్నా, తెలతెలవారే వేళ శ్రీమతిచ్చే తొలి ముద్దులోనే ఎంతో తృప్తీ, సుఖమూ కలుగుతుంది నాకు. నాకే తను కావాలని కాదు. నా భార్యకి కూడా నేను కావాలనుకుంటే మనసు పులకరించదా?-ఆ మాత్రం అర్థమవదెందుకు మా ఆవిడకు? మగాడికీ సున్నితమైన భావాలూ, కోర్కెలూ వుంటాయని అనుకోరు. అదే స్త్రీల సమస్యలు, హక్కుల మీద లెక్చర్లిమ్మను. మగవాడన్యాయం చేసేస్తున్నాడని వలవల ఏడుస్తారు’ అని వాపోయాడు. ఇప్పుడు చెప్పు, అలా అంత అందమైన మేలు కొలుపులు పాడటం అలవాటు చేసిన నువ్విప్పుడేం చేస్తున్నావు? తెల్లారింది, లేవాలి, ఆఫీస్కి పోవాలి, పని చేయాలి-ఇందుకోసమేగా లేవటం. మరే ఆకర్షణా వద్దా లేవాలంటే.

ఒక రాత్రి గడిచి, మరొకరోజు వచ్చింది. 'ఇదీ నిన్నటి లాగే గడపాలి కనుక లేద్దాం అనుకొని లేవాలా? ఈ రోజు నాకోసం ఏం తెస్తుంది? ఈ రోజు నా ప్రేయసి ఎలా నన్ను మేలు కొలుపుతుంది? నిద్ర నుంచి లేచిన నాకెలా స్వాగతం చెప్తుంది?

## శ్రీవారి ముచ్చట్లు

నేను లేవకపోతే ఎలా గారాలు పోతుంది? నిద్రలేపుతున్న తన్ను దగ్గరగా లాక్కుని, ముద్దాడితే ఎలా వయ్యారాలు ఒలికిస్తుంది?-ఇలాంటి వేడుకలూ, కోరికలూ. మురిపాలె మనిషి బతుకులో అందాన్నీ, ఆకర్షణలనీ తెస్తాయి. పొద్దునే లేవటానికో ఉత్సాహం, ఏదో చెయ్యాలి, సాధించాలన్న తపన నా కోసం ఆరాటపడుతూ నన్ను నన్నుగా కోరుకునే వ్యక్తి వుందనే నమ్మకం, ఆ వ్యక్తి కోసం ఆకాశాన్నుంచి నక్షత్రాలైనా కొసుకొచ్చెయాలనె ఉబలాటం-ఇవన్ని భార్య భర్తలో, భర్త భార్యలో కలిగించుకోవాలి. దాని కోసం ఉభయులూ కొత్త మార్గాలన్వేషించుకుంటూ వుంటే రోటీనూ, దూరం లాంటి పదాలకు తావే వుండదు. ఇప్పుడు చెప్పు, నువ్వొచ్చి నన్ను లేపవు అన్న నిరుత్సాహం రోజూ భరించేకన్నా, ముద్దు నిద్రపోయి, ఆ కోరికనే మరిచిపోవటం మంచిది కదూ? ఇంకా నేను మంచివాడిని కనుక నిద్రమత్తుతో సరిబెట్టాను. అదే మరొకళ్లయితే తాగి-

“ఛ. ఇంకాపండి బాబూ. మీరూ మీ మాటలూను. మొత్తానికి జయించేశారు, సార్. నా తప్పు ఒప్పుకున్నాను. రేపట్నుంచీ నేనే మిమ్మల్ని లేపుతాను. సరేనా? నేను వచ్చి నిద్రలేపినంత మాత్రాన, నాకోసం ఆకాశంనించి నక్షత్రాలు తేగలిగేటంత శక్తి మీలో నింపగలిగితే అంతంటె గొప్పతనం ఇంకేముంది? మొత్తానికి తప్పు నా మీదే వేశారు. నా పిచ్చి కానీ, మాటల్లో మిమ్మల్నెప్పుడు గెలవగలిగాను కనుక?”

“అదుగో. మళ్లీ అలాగే అనకు. ఉదాహరణ సహితంగా చెప్పాను. ఒక విషయం ఎప్పుడూ మరిచిపోకు. ఒకరినొకరు దగ్గరగా బంధించుకుని వుంచుకోవాలన్నా, ఇద్దరి మధ్యా సాన్నిహిత్యమూ ఒకరిలో నొకరు తాదాత్మ్యమూ తీవ్రం చేసుకోవాలన్నా-భార్య భర్తలిద్దరిదీ సమబాధ్యతే. నిజమే. కాని, ఇందులో భార్యవంతు పని కాస్త ఎక్కువ. తన పట్ల, జీవితం పట్ల భర్త ఆకర్షణని, అనురాగాన్ని రోజు రోజుకీ తీవ్రతరం చేయటం స్త్రీ చేతిలో వున్నంతగా పురుషుని చేతిలో లేదు. అక్కడే స్త్రీకి అగ్రస్థానం, ఉన్నత స్థానం ఇచ్చింది ప్రకృతి. స్త్రీలో వున్నంత వైవిధ్యమూ, నిత్యనూతనత్వమూ పురుషునిలో లేనే లేదు. మరి అది మీ ఆడవాళ్లు గుర్తించి నిలబెట్టుకోవాలి”

‘అయ్యా. చిత్తం’ బుద్ధిగా తలూపి లేవబోతుంటే, నా చెయ్యి పట్టుకుని అల్టిమేటమ్ యిచ్చారు. “ఇదుగో. లేపమన్నాను గదాని, ఇవాళ లేపినట్టే రేపు లేపితే లేవను సుమా! రేపు మరో కొత్త పద్ధతిలో లేపాలి.”

చచ్చాం పో! నేరకపోయి లేపానివాళ. రోజూ ఏం వండాలో, ఎలా వండాలో ఆలోచించుకున్నట్టు, రోజూ ఈయన్నెలా లేపడమో కూడా!

O



సీరియల్

**వాడవల్లి విజయలక్ష్మి**

*( గత సంచిక తరువాయి)*

ప్రసూన గత కాలపు గుర్తుగా మిగిలింది. ఎక్కడ ఎట్లా వుందో! అనిపిస్తోంది. తల్లి కబురు ఆమెకు తెలియచెయ్యలేకపోయిన తన అసమర్థతకు బాధనిపిస్తోంది. ప్రసూన తరువాత మనస్సుకు హాయినిచ్చి సేదదీర్చే స్నేహితులు లేరు.

ఒంటరితనం అలవాటయిపోయింది. ఏ ఆడపిల్లను చూసినా స్పందన లేదు. పెళ్ళి ధ్యాసే లేదు. పైగా చేసుకొమ్మని పోరే వాళ్ళు లేరు. కంపెనీ లాభాల్లో ఉద్యోగస్తులకు కూడా బోనస్ సదుపాయాలు ఉండటంతో, లాభాలు పొందుతున్న కంపెనీ ఉద్యోగస్తులకు ఎక్కువ మొత్తాలలో డబ్బు అందుతూనే ఉంది.

అర్థికంగా స్థిమితపడ్డాడు శ్రీధర్. చిన్ననాటినుండి గతాన్ని తలుచుకుంటే కుదుటపడిన ఆర్థిక పరిస్థితి తన ఊహకు మించినదే. తనకు తారసపడిన వ్యక్తుల్లో మరపుకురాని ప్రసూన ప్రతిబింబం మనస్సులోనుండి చెదరలేదు.

ఎప్పుడైనా అందమైన ప్రకృతిలో మనస్సు పులకరించే వేళ ప్రసూన తలపులు తియ్యగా పలకరిస్తూనే వున్నాయి.

తనది కాకపోయినా ద్వేషం లేదు. ఆరాధకుడికి అనుభవము కానక్కరలేదు.

తనతో పనిచేసే వెంకట్రావుతో పరిచయం కాలక్షేపానికి పనికివస్తుంది.

వెంకట్రావుకుకూడా పెళ్ళి కాలేదు. క్రొత్త ఉద్యోగంలో చేరిన సంవత్సరానికి వెంకట్రావుకి పెళ్లి కుదిరింది.

" తప్పకుండా వచ్చి అక్షింతలు వెయ్యాల్సోయ్" నవ్వుతూ శుభలేఖ నందించాడు.

"తప్పకుండా" అంగీకరించాడు.

అక్కడికి వందమైళ్ళ దూరం, ఒక రోజు ప్రయాణం. అలసి పెళ్ళివారింటికి చేరారు.

రాత్రికి లగ్నం. ఆ వూరికి డైరెక్టు బస్సు లేకపోవడంతో 2 బస్సులు మారి రావలసి వచ్చింది.

శ్రీధర్ కాక వెంకట్రావు స్నేహితులు ముగ్గురున్నారు.

పెళ్ళికి వచ్చిన పెళ్ళికొడుకు స్నేహితులకు మరింత గౌరవ మర్యాదలు జరగడం సహజం.

పెళ్ళికూతురి తండ్రి ఆ వూళ్లో మోతుబరి కావడంతో ఏర్పాట్లన్నీ ఘనంగానే చేశారు.

దీపాల తోరణాలతో పట్టుచీరెల గరగరలతో సుగంధాల పరిమళాలతో పెళ్ళి జరిగింది.

మర్నాడు ఆఫీసుకు తప్పనిసరిగా అటెండ్ అవ్వాలి. పెళ్ళి సంబరాలలో మునిగివున్న వెంకట్రావు దగ్గరకు చేరి మెల్లగా చెప్పాడు.

ఆఫీసు విషయాలు తెలిసిన వెంకట్రావు పెద్దగా బలవంతం చెయ్యలేదు. మిగిలిన ముగ్గురికి చెప్పి రాత్రికి చీకట్లో వంటరిగా బయలుదేరాడు శ్రీధర్.

పగటి వేళ బస్సు సౌకర్యాలు అంతంత మాత్రం. ఇంకా రాత్రి సమయాలు చెప్పనే అక్కరలేదు.

ఆఖరి బస్సు దుమ్ము రేపుకుంటూ వచ్చి ఆగింది. ఇసుక వేస్తే రాలనట్లున్న జనంలో సందు చూసుకొని శ్రీధర్ ప్రవేశించాడు.

అందరికి ఇదే సమయంలో ప్రయాణం ఎక్కడికో!

అయినా జనాభా సంఖ్య ప్రత్యక్షంగా చూడాలంటే ఇటువంటి సన్నివేశాలు చూశాకనే తెలుస్తుంది.

వివిధ సమస్యలు, వివిధ వృత్తులతో ఒకే బస్సులో ప్రయాణం, భిన్నత్వంలో ఏకత్వం గుర్తుకు వచ్చింది. ఆ అడవి లాంటి చోటునుండి ప్రయాణం చీకటిసందున కొంత సర్దాగానే వుంది.

పెళ్ళి వేడుకల్లో వెంకట్రావుకు కాలం తెలియడంలేదు. జీవిత భాగస్వామితో ముచ్చట్లతో తమ స్నేహానికి కొంత అవరోధం కలుగవచ్చు.

వర్తమానంతో సంబంధంలేని సందడి కావాలి అనుకున్నాడు శ్రీధర్. తనను తాను మరిచిపోయేరోజున తప్ప ఈ ఒంటరితనం పోదేమో అనిపిస్తోంది శ్రీధర్‌కు. వయస్సుకు మించి వేదన అనుభవించాల్సిరావడం శ్రీధర్ వంటరితనం అతనికి వేసిన శిక్ష.

కీచుమని శబ్దంతో బస్సు ఆగిపోయింది. కొందరి మనుష్యులకు గమ్యం

వచ్చినట్లుంది. ఆ చీకట్లో దారి చూసు కుంటూ దిగారు.

15 నిమిషాలైనా కూడా బస్సు కదలలేదు. డ్రైవర్ కిందకు దిగాడు. ఇంజను ట్రబుల్ సరిచెయ్యడంకోసం సర్వ ప్రయత్నాలు ఆరంభించాడు.

కండక్టర్, ప్యాసింజర్లు వళ్ళు విరుచుకొని క్రిందకు ఒకళ్ళ తరువాత ఒకళ్ళు దిగారు.

"ఏమిటి ఈ రాత్రికి ఇక్కడ వచ్చిన ట్రబుల్" ఒకళ్ళ మాట ఒకళ్ళకు వినపడకుండా రొద.

కండక్టర్ మాత్రం తాపీగా సిగరెట్ వెలిగించుకొని డ్రైవర్ ప్రయత్నానికి తన సహకారం మాటల్లో చూపుతున్నాడు. గతంలో జరిగిన పాత సంఘటనల వివరాలు, తమ అనుభవాలు కలబోసి చర్చ మొదలుపెట్టారు అక్కడ ప్రయాణీకులు. శ్రీధర్‌కు మధ్యలో అవాంతరం తనవెంత చిక్కుల్లో పడవేస్తుందో గుర్తుకి వచ్చి ఒక్కసారిగా భయమనిపించింది. తనలాంటి ఇబ్బందులే అందరివి. ఏదైనా సాఫీగా జరిగితే కాలం గురించి అజే వుండదు. మధ్యలో అవాంతరం ఎదురైతేనే కాలం విలువ తెలిసివస్తుంది.

నిరుత్సాహంగా వుంది అక్కడ వాతావరణం. చేతులు దులుపుకుని డ్రైవర్ బయటకు వచ్చాడు. "ఇంక అక్కడ జాతర తప్పదు. ఇంజన్ ట్రబుల్ సరిచెయ్యలేం. మెకానిక్కు రావాల్సిందే." తప్పదన్నట్లు నిర్లిప్తంగా చెప్పాడు.

అందరికి నిరుత్సాహం కలిగింది. సుమారు 30, 40మంది ప్రయాణీకులను చీకట్లో ఇబ్బందులపాలుచేసిన ఆ బస్సు మాత్రం చీకట్లో నిశ్శబ్దంగా నిలబడే వుంది. కొందరక్కడే చతికిలబడ్డారు. శ్రీధర్‌తో పాటు మరి నలుగురు దిక్కులుచూస్తూ బయల్దేరారు.

"రాత్రికి ఇటు ఇంక బస్సు రాదు, మనకేదైనా లారీ వస్తేనే గతి, లేకపోతే తెల్లారేదాకా ఇంతే." అందరిని ఎక్కించే ప్రయత్నం చెయ్యొచ్చు అస్సలు లారీ అంటూ వస్తే.

భారమంతా భగవంతునిమీద వేసి




వూరుకోక తప్పలేదు. పెళ్ళివారింట్లో విందులైనా పూర్తిచేశానుకాదు అనిపించింది శ్రీధర్‌కు.

ఎవ్వరి ఆలోచనల్లో వాళ్ళు వున్నారు. మధ్యలో ఆగిన మజిలీ పూర్తి చెయ్యడమెలా! అనేదే అందరి సమస్య.

## జీవన హేల

చుట్టూ చీకటి. ఎత్తుగాను, దృఢంగాను వున్న చెట్లు వాటినీడతో మరింత చీకటిని పంచిపెడుతున్నాయి.

కనుచూపుమేరలో దీపపుకాంతి లేదు. ఎక్కడా ఇళ్ళున్న జాడ కూడా కనిపించడంలేదు.

అక్కడకు ఊరు ఒక మైలు వుండవచ్చు. ఇంకా పైన వుండవచ్చు. వూరు చేరాలంటే ఎంతదూరం ప్రయాణించవలసివుంటుందో శ్రీధర్‌కు ఎంతమాత్రం వూహకందడంలేదు. బాధ్యతలేకుండా ప్రవర్తిస్తే ఉద్యోగంలో మాట తప్పదు.

సరదాగా బయల్దేరిన పెళ్ళి ప్రయాణం ఇంత ఇబ్బందిని కలుగజేస్తుందని అనుకోలేదు. శ్రీధర్‌కు అదుర్దాగా వుంది.

ఉరుములు, మెరుపులతో వాన కూడా ప్రారంభమైంది. బస్సు దగ్గర నుండి కొద్ది దూరం వచ్చాడు శ్రీధర్ చెట్లనీడ వాననుండి కాపాడలేకపోతోంది. మనిషి పూర్తిగా తడిసిపోతున్నాడు. చేతిలో బ్యాగును పొదివి పట్టుకొని రక్షణకోసం చుట్టూ చూశాడు శ్రీధర్.

మెరుపుల కాంతిలో అల్లంతదూరంలో ఇల్లు కనపడింది.

"అమ్మయ్య" అనుకున్నాడు శ్రీధర్. ఆ యింటి ఆవరణలో వాననుండి రక్షణ పొందవచ్చునని నాలుగంగల్లో అక్కడకు సమీపించాడు.

ఎత్తుగా వున్న అరుగుమీదకు ఇంటి చూరు వంగివుండడంతో కాస్త రక్షణ ఏర్పడింది.

తడిసిన బట్టలు లోపల చలిని పెంచుతున్నాయి. చేతిలో బ్యాగుకూడా తడిసిపోయింది.

మాసిపోయిన గోడలతో ఆ యిల్లు శిధిలావస్థలోనికి జారుతూంది.

అవతల ప్రక్క అరుగుమీద నాలుగు బల్లలు పరచివున్నాయి. బహుశా పగలు టీస్టాలు వంటిది ఏదైనా వుండి వుంటుంది.

ఈ రాత్రి చలిలో కాస్తంత వేడి, వేడి టీ త్రాగితే ఉత్సాహం కలుగవచ్చని ఆలోచన కలిగింది శ్రీధర్‌కు.

ఇంతరాత్రిలో చలిలో లోపల వాళ్ళను లేపడం తప్పు అనిపించినా వేడివేడిది ఏమైనా త్రాగాలి అనే కాంక్షతో తలుపుమీద చెయ్యివేశాడు. సున్నితంగా శబ్దం చేశాడు.




బయట వర్షపు జోరులో తలుపు చప్పుడు చేసినా లోపలకు వినపడకపోవచ్చు.

మరొకసారి ప్రయత్నం చేశాడు.

"ఉహూ......." ఎట్టి సమాధానం రాలేదు. కిటికీలో నుండి వంగి చూశాడు.

లోపల అస్పష్టంగా ఏదో గొడవ వినబడుతూంది.

బయటి గాలికి లోపల లాంతరుకూడ మినుకు, మినుకుమని వెలుగుతున్నది.

ఆగి ఆగి వెలుగునిస్తూంది.

కిటికీ ఇవతలకు వచ్చాడు శ్రీధర్ లోపల వాళ్ల గొడవ మనకెందుకు అన్న భావంతో. మరి ముందుకు చూడలేదు.

బయట చప్పుడుకు మించి లోపల గొడవస్థాయి పెరిగింది.

మగగొంతు స్పష్టంగా వినపడుతూంది. ఎదుటి వ్యక్తిది స్త్రీదై యుంటుంది. నానారకములైన తిట్లతో ఆమెను దూషించి వికృతమైన ఆనందాన్ని అనుభవిస్తూ కక్ష తీర్చుకుంటున్నాడు.

ఎవరినో కొట్టినట్లు దెబ్బలు, గట్టిగా బాదినట్లు "అమ్మో" అన్న ఆర్తనాదాలతో బయట చికాకుకంటె లోపల ఇంకా ఎక్కువగా వున్నట్లు వుంది. సాటి మనిషిని గొడ్డును బాదినట్లు బాదే ఆ రాక్షసుడిపై కారణంతో పనిలేకుండా శ్రీధర్‌కు అసహ్యమనిపించింది.

ఎదుటివారికి గౌరవం యివ్వకపోయినా, చిత్రహింస మాటల్లో కాని చేతల్లో కాని చేయడం ఎంతటి ఘోరమో ప్రత్యక్షంగా కనబడుతూంది.

ఇంకెవరూ వున్నట్లు లేదు. మూడో వ్యక్తి వుంటే వాళ్లిద్దరిమధ్య కొంత సర్దుబాటు చేసేవారు అనుకున్నాడు శ్రీధర్.

సరిగ్గా పదినిమిషాలకు తలుపులు ఝళ్ళున తెరుచుకున్నాయి. విసురుగా ఒక వ్యక్తి బైటకు వచ్చాడు. మాసిన బట్టలు, చింపిరిగడ్డంతో ఆ వ్యక్తి పరమ అసహ్యంగా కనపడ్డాడు. ఆల్కహోలు వాసన ముక్కుపుటాలకు తాకింది.

మనిషి ప్రవర్తన అతని రూపురేఖలను చెప్తూంది. లోపల అతని వికృత నాట్యం అతి రూపు చెప్పకనే చెప్తూంది. భార్యను పశువులా చూసే ఎంతోమంది భర్తల హేయమైన ప్రవర్తన వాళ్ళ శాడిస్టు ప్రకృతిని బట్టబయలు చేస్తుంది. అటువంటి భర్తలను భరించే ఓపిక ఈ భారతనారీలకు మాత్రమే వుందేమోననిపిస్తూంది శ్రీధర్‌కు. వ్యక్తిగా గౌరవించలేనపుడు వాళ్ళకి తగిన పాఠం చెప్పాలి.

ఎదుటి వ్యక్తి తమ లాంటిదే అనే మనస్తత్వం వున్నపుడే అది స్వర్గం వంటి ఇల్లు అవుతుంది.

చీకటి చాటున వారగా నిలబడివున్న శ్రీధర్‌ను అతను గుర్తించనేలేదు.

అయినా ప్రస్తుత పరిస్థితిలో అతనికా అవకాశం ఇవ్వడుకూడా.

వానను లెక్కచేయకుండా అతను పడుతూ లేస్తూ బయటకు వెళ్లిపోయాడు. లోపల్నించి స్త్రీ స్వరం చేసిన ఇందాకటి ఆక్రందన తరువాత మరే శబ్దములేదు.

మానవత్వ దృష్ట్యా శ్రీధర్ లోపలకు తొంగిచూశాడు.

గుడ్డివెల్తురులో నేలమీద పడివున్న శరీరాన్ని స్పష్టంగా చూశాడు. అచేతనంగా పడివుంది. అంటే ఆ దెబ్బలధాటికి తట్టుకోలేకపోయి వుంటుంది.

కిరాతకచర్య మిగిల్చిన నరకం అనుభవిస్తూన్న ఆమెను చూస్తే శ్రీధర్‌కు జాలేసింది.

ఏదో నిర్ణయానికి వచ్చి ఒక అడుగు ముందుకు వేశాడు. పూర్తిగా తెరుచుకున్న తలుపులగుండా లోనికి అడుగు పెట్టాడు శ్రీధర్.

ఆ వెల్తురులోనే గదంతా వెతికి విరిగిపోయిన కూజా వంపి గ్లాసుతో నీళ్లు పట్టుకువచ్చాడు. వంగి ఆమె ముఖంమీదకు కొద్దిగా నీళ్లు చిలకరించాడు.

నుదుటిమీద గాయమైనట్లుంది. రక్తము ఓడుతున్న ఆ గాయానికి జేబులోంచి రుమా లతీసి తడిపి గాయంమీద పెట్టాడు. చల్లటినీళ్ల స్పర్శకు ఆమె కళ్లు తెరిచినట్లుంది. కొద్దిగా కదుల్తున్న ఆమెను చూశాక శ్రీధర్‌కు ధైర్యం వచ్చింది. నెమ్మదిగా లేచి నిలబడ్డాడు.

దారిద్ర్యానికి సంకేతంలా వుంది ఆమె రూపు. లేని ఓపిక తెచ్చుకొని లేవబోయింది ఆమె. గ్లాసుతో నీళ్లు నోటికందించిన చేతులకేసి, ఆ అపరిచిత వ్యక్తిని చూసి ఒక్కసారి తెల్లబోయింది. "ఎవరూ" కీచుమంటూ గొంతులో భయం మిళితమై వుంది. కంఠధ్వని సన్నని వీణానాదంలా వుంది. "భయపడకండి" చెప్పబోయాడు.

ఆమె పూర్తిగా స్పష్టత చిక్కించుకొని అతని ముఖంలోకి చూసింది. దగ్గరగా వున్న లాంతరు వత్తి పెద్దది చేసింది. పెరిగిన ఆ వెలుగులో స్పష్టంగా ఆమె రూపు కనబడింది శ్రీధర్‌కు.

చెదిరిన జుట్టు, గుంటలుపడిన కళ్ళతో, ఎండిన పెదాలతో, శుష్కించిన శరీరంతో, బెదిరే చూపులతో సరిగ్గా మాట్లాడలేని ఆమె కనబడింది.

ఆమె ఎవరో కాదు ప్రసూన. "ప్రసూన" చిత్రంగా పలికింది గొంతు. మూగబోతున్నట్లున్న తన గొంతునుండి ఆశ్చర్యంతో పలుకులే రావడంలేదు.

"ఎవరూ..." వంటి నొప్పుల బాధను దిగమ్రింగుకొని గుచ్చి, గుచ్చి చూసింది.

"శ్రీధర్" పెదిమలు స్పష్టంగా పలకాలన్న ప్రయత్నం విఫలమైంది.

తన ఆరాధ్యదేవత, స్నేహమాధుర్యాన్ని చవిచూపి, తననో మనిషిగా చేసిన ప్రసూనను ఆ పరిస్థితిలో చూడడం నిజంగా నమ్మలేకపోతున్నాడు శ్రీధర్. "కలా! నిజమా" అనిపిస్తూంది.

పెళ్లి అయిన స్త్రీగా, భోగభాగ్యాలతో ఆనందంగా జీవిస్తున్న ప్రసూన వూహాల్లోనే అందంగా వుంది.

ప్రసూన కాకుంటే బాగుండును అని శ్రీధర్ అనుకున్నా నిజంగా అక్కడ వున్నది ప్రసూనే.

"ఏమిటిది? నేను చూస్తున్నది నిజమా ప్రసూన? నువ్వు ఈ పరిస్థితుల్లో...." నమ్మలేక తనను- తనే ప్రశ్నించుకొన్నట్లున్న శ్రీధర్ మాటలకు అడ్డువచ్చింది ప్రసూన.

"ఊహ వాస్తవంకంటే అందమైనది శ్రీధర్! అమ్మ దృష్టిలో నా జీవితం వేరు. ఇక్కడ నా పరిస్థితి వేరు. అమ్మ బాగుందా శ్రీధర్!" అని అడిగింది తల్లిపట్ల ప్రేమ కంఠంలో ధ్వనింపచేస్తూ.



అందరికంటే ఎక్కువ స్థితిలో కూతుర్ని వూహించుకుంటూ తనువు చాలించిన ఆ తల్లి గురించి కూతురికి చెప్పే పరిస్థితి వచ్చినందుకు శ్రీధర్‌కు బాధగానే వుంది. శ్రీధర్‌కు ప్రసూన పరిస్థితి ఊహకందకుండా వుంది.

ముఖం చేత్తో కప్పుకొని ఏడుస్తూంది ప్రసూన.

పెళ్లి జరిగిన ఏడాదినుండి తననుభవించిన నరకం అమ్మకంటపడనీయక తృప్తిగా కూతురి సంసారం గురించి వూహించుకుంటూ ఉండేందుకు వీలుగా తన ఉత్తరాలు ఆమె మనస్సుకు శాంతి చేకూర్చడం తలుచుకొని మరీ, మరీ కుళ్లి, కుళ్లి ఏడుస్తూన్న ప్రసూనను ఓదార్చడం శ్రీధర్‌కు కష్టంగానే వుంది.

"శ్రీధర్! ఇక్కడినుండి వెంటనే వెళ్లిపో," ఆదుర్దాగా తన అశక్తతను కప్పిపుచ్చుకుంటూ అంది ప్రసూన.

"ప్రసూనా!" నిన్నీ పరిస్థితుల్లో చూసి నేను అడుగు ముందుకు వెయ్యగలనా!

"తప్పదు శ్రీధర్!" భగవంతుని చదరంగపు ఆటలో మనం పావులం. ముందే నిర్ణయమైన జీవిత సరళి మనకు మధ్యలో మారదు. ఎత్తులో వున్న పెన్నిధిని అందుకోవడానికి ప్రయత్నంచేసి అగాధంలో పడిపోయాను. మానసికంగా అలసిపోయాను. అలవాటుపడిపోయాను. ఇంక ఈ బ్రతుకు ఇంతే. "నిర్లిప్తంగా మాట్లాడుతున్న ప్రసూన పలుకులు శ్రీధర్ గుండెను కదిలించాయి. ప్రేమకు ఉదాహరణగా వూహాలోకాల్లో విహరింపచేసిన ప్రసూనను, చిక్కి శల్యమై వేదనతో బ్రతుకు భారమై, భర్త చేతిలో అన్యాయమైపోతున్న మనిషిగా చూడలేకపోతున్నాడు. కాని తప్పదు. ప్రసూన నిర్ణయాలు శాసించలేనివి.

బయట వానకూడా తగ్గుముఖం పట్టింది. జేబులోంచి డబ్బుతీసి ప్రసూన చేతిలో పెట్టబోయాడు శ్రీధర్.

"ఏమిటిది! నీ ఔదార్యానికి కృతజ్ఞతలు. నిన్ను చూడడమే మహాభాగ్యంగా భావిస్తున్న మన ఈ కలయిక కొన్ని సంవత్సరాలదాక తీపిగుర్తు నాకు. డబ్బుతో పనిలేదు శ్రీధర్." మృదువుగా వారించింది.

వెనక్కు తీసుకోక తప్పలేదు. "అవసరం అయితే నేనున్నానని మర్చిపోకు. నీకేదైనా సహాయం చేశాననే తృప్తి నాకు మిగుల్చు." తన అడ్రస్సు ఇచ్చాడు. తప్పనిసరై ప్రసూన నా పరిస్థితిలో వదిలి బయటకు వచ్చాడు శ్రీధర్. ఇల్లు దాటి రెండడుగులు ముందుకు వేశాక వెనక్కు చూశాడు శ్రీధర్.

ఇందాకటి మనిషి తూలుకుంటూ లోపలకు వెళుతున్నాడు.

ప్రసూన పరిస్థితి గుండెను కలిచివేస్తోంది. హాయిగా ఆనందంగా వుందనుకున్న ప్రసూన ప్రస్తుత పరిస్థితి పూర్తిగా విరుద్ధంగా వుంది. మర్చిపోయిన ఆమె స్మృతులు మళ్ళీ రేగుతున్నాయి. అందమైన వ్యక్తిత్వం, అంతకుమించి సంస్కారం

## రాజకీయ దురంధరుడు త్రిపాఠీ కన్నుమూత

ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు, కాంగ్రెస్ (ఐ) సీనియర్ నాయకుడు శ్రీ కమలాపతి త్రిపాఠీ కన్నుమూసారు. కొద్దికాలంగా ఆయన గొంతు క్యాన్సర్‌తో బాధపడుతున్నారు. 86 సంవత్సరాల శ్రీ త్రిపాఠీ మరణంతో దేశం ఒక దేశభక్తుడ్ని, బహుముఖ ప్రజ్ఞాశాలిని, రాజకీయ దురంధరుడిని కోల్పోయినట్లయింది.

1935 నుంచి ఆయన రాజకీయ జీవితం ప్రారంభమైంది. 1952లో ఉత్తర ప్రదేశ్ విధానసభకు కాంగ్రెస్ తరపున ఎన్నికైన శ్రీ త్రిపాఠీ గోవిందవల్లభ్ పంత్ మంత్రివర్గంలో 1960



వరకు సమాచార మంత్రిగాను,1960-64 మధ్య హోంమంత్రిగాను పనిచేశారు. 1973 తర్వాత ఆయన కేంద్ర క్యాబినెట్‌లో షిప్పింగ్, రవాణాశాఖలను నిర్వహించారు. 1977లో కాంగ్రెస్ పరాజయం అనంతరం రాజ్యసభలో ప్రతిపక్షనాయకుడైనారు. 1980లో మళ్లీ కాంగ్రెస్ అధికారంలోకి రావటంతో ఆయన రైల్వేమంత్రిగా పదవీ బాధ్యతలు స్వీకరించి కొన్ని వ్యక్తిగత కారణాలపై రాజీనామా చేశారు. 81 నుంచి ఆయన పార్టీ పటిష్టతకు అవిరామంగా కృషిచేసి కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అధ్యక్షుడయ్యారు. తుదిశ్వాస విడిచేవరకు కాంగ్రెస్ పార్టీకి తమ జీవితాన్ని అంకితం చేసిన యిటువంటి మహనీయుడులేని లోటును భర్తీ చేయటం అంత సులభతరం కాదనటం అతిశయోక్తి కాదేమో!

కలబోసిన స్త్రీ ప్రసూన. ఆమె విలువ తెలుసుకోలేని ఆ పశువులాంటి మొగుడి మీద చెప్పలేని కోపం కలిగింది.

"నాతో వచ్చెయి" అన్న మాటకు తల అడ్డంగా వూపింది ప్రసూన. యధార్థాన్ని దాచి తల్లిని మధ్యపెట్టి వూహల్లో బ్రతికించిన ప్రసూన పరిస్థితిక నిజంగా జాలివేసింది. అక్కడికి వచ్చే ముందు కంటె మనస్సు మరింత భారంగా వుంది. ప్రసూన గురించిన చేదు నిజం మనస్సును దొలిచేస్తూంది.

నెమ్మదిగా రోడ్డుమీదకు వచ్చాడు. ఎదురుగా వస్తున్న లారీని ఆపి మిగిలిన ప్రయాణం పూర్తిచేశాడు. మజిలీ ప్రయాణం చూపిన ప్రసూన జీవితం కళ్ళకు కట్టినట్లు కనబడుతూనే వుంది.

ఎప్పుడైనా ఆమె వద్దనుండి ఏ వుత్తరమైనా రావచ్చునని ఆశగా వుంది.

యధార్థం యింత బాధాకరంగా వుంటుందన్న విషయం అనుభవం అవుతూంది శ్రీధర్‌కు.

రెండునెలల అనంతరం మళ్ళీ ప్రసూన కోసం అక్కడకు వెళ్ళాడు. రాత్రి చీకటి వేళల్లో జ్ఞప్తికి తెచ్చుకుంటూ దరిద్రానికి సంకేతంలా వున్న ఆ పాడుపడిన వెంకుటిల్లు సమీపించాడు. ప్రసూనను ఏ పరిస్థితుల్లో చూడాల్సివస్తుందోనన్న సంశయం మనస్సులో పీకుతూనేవుంది.

పెచ్చులూడి అసహ్యంగా నూనె చారికల్లాంటి గోడలున్న ఆ ఇల్లు తలుపులు వేసి వున్నాయి. పెద్ద తాళం ఆ యింటికి వేళ్ళాడుతూ శ్రీధర్‌ను వెక్కిరిస్తూ వుంది. దగ్గర్లో వున్న వ్యక్తిని పిలిచి అడిగాడు ఆ యింట్లో వుండేవాళ్ళు ఎక్కడికెళ్లారని.

ఆ మనిషి ఎగాదిగా చూసి, "2నెలలయింది బాబు ఇక్కడ్నుంచి వెళ్లి! ఎక్కడికెళ్ళారో ఏం తెలియదు. అయినా మీరెవరు?" అడిగాడు.

"తెలిసిన వాళ్ళు" అన్నాడు.

ఎక్కడికి వెళ్ళివుంటారని వెతకాలి. అయినా వాళ్లమధ్య తన సంబంధం ఏమిటి? అనుకున్నా పూర్వమెరిగిన ప్రసూన పరిచయం, అభిమానం ఆమె బాగోగులకోసం ఆత్రుత పెంచుతూనే వుంది. చేసేదేంలేక వెనక్కు తిరిగి వూరు చేరాడు. తన ప్రయత్నం ఏదైనా వృధా అవుతూనే వుంది. చాలాకాలం తరువాత మధ్యలో కనబడిన ప్రసూన రూపురేఖలు కలల ప్రపంచంలోంచి వాస్తవంలోకి తెచ్చాయి. సంవత్సరాలు తిరగబడుతున్నాయి. కాల ప్రవాహంలో శ్రీధర్ జీవనవేగం నెమ్మదిగా సాగుతున్నట్లుంది.

ఉద్యోగంలో ప్రమోషన్ వచ్చింది. ఆర్థికంగా బాగా నిలదొక్కుకున్నాడు. సంఘంలో కొద్దిగా గుర్తింపు వచ్చింది. కాని ఒంటరితనం అతనిని వదలలేదు. మానసికంగా పరిపూర్ణత పొందినా శ్రీధర్‌కు ఇంటివాడనవుదామన్న ఉత్సాహం, ఆసక్తి లేకపోవడంతో దూరంగానే వున్నాడు.

"టెలిగ్రాం సార్"పోస్టుమాన్ అందించిన టెలిగ్రాం అందుకున్నాడు.

"ప్రసూన సీరియస్! స్టార్ట్." అడ్రస్సు ఇస్తూ ఇచ్చిన టెలిగ్రాం అందుకోగానే ప్రసూన కళ్ళముందు నిల్చింది.

చల్లని వెన్నెలలాంటి రూపు, హాస్యం మిళితం చేస్తూ సంస్కారవంతమైన భాష, ఎదుటి మనిషిని ప్రేమించే సున్నితమైన సంస్కారం కలబోసిన ఆమెకు పట్టిన గతి తల్చుకుంటే నిజంగా కళ్ళమ్మట ధారలాగ నీళ్ళు ఆగలేదు.

అసహాయంగా వున్న ఆమెకి సహాయం చేసి ఆదుకుందామనుకున్న శ్రీధర్‌కు ఈ వార్త అశనిపాతంలాగానే వుంది.

వెంటనే ఆఫీసుకు సెలవుపంపి బయల్దేరాడు. ఎడ్రస్సు వెతుక్కుంటూ బయల్దేరిన శ్రీధర్‌కు ప్రసూన హాస్పిటల్లో ఉందన్న విషయం తెలిసి అక్కడకు వెళ్ళాడు.

"నీవు వస్తావని తెలుసు. నీకోసమే ఇంకా మిగిలివున్నాను." అసహాయంగా హీనస్వరంతో పలికింది.

వళ్ళంతా కాలిపోయివుంది. మరణబాధతో ఆ స్థితిలో వున్న ప్రసూనను గతంలోనే ఈ కూపం నుండి తీసుకువెళ్ళి రక్షించలేకపోయినందుకు విచారం కలిగింది శ్రీధర్‌కు. ధారగా కారుతున్న కన్నీళ్లు ఆపుకోవడం కష్టంగానే వుంది.

"ఏడుస్తున్నావా! నాకోసం పరితపించేది నువ్వుకాక ఇంకెవరు? నాకోసం బాధపడే నీకోసం నేనేమి చెయ్యలేకపోయాను! కల్మషం ఎరుగని చిన్నతనం మళ్ళీ రాదు" నెమ్మదిగా అంది ప్రసూన.

"ఎక్కువగా మాట్లాడకు" వారించబోయాడు.

"నన్నెవ్వరూ ఆపలేరు. ఇప్పుడిక నాకు శృంఖలాలు లేవు. గౌర మర్యాదలకు అతీతమైన పరిస్థితి నాది. నన్ను మాట్లాడనియ్యి."అంది ప్రసూన.

చుట్టూ చూశాడు. జనరల్ వార్డు కామోసు. భయంకరమైన బాధననుభవిస్తూ బ్రతకడానికి విఫలప్రయత్నం చేస్తున్న రోగుల మూల్గులు, మందు వాసనలతో అదొక ప్రపంచంలా వుంది.

నడివయస్సామె ప్రసూన దగ్గరగా వచ్చి "అమ్మాయ్! నిన్ను ఇంటికి తీసుకు వెళ్ళవచ్చున్నారు. నువ్వు ఎదురుచూస్తున్న మనిషికూడా వచ్చారుగా! డాక్టరుగారితో చెప్పి వచ్చాను!"

హడావిడిగా చెప్పింది.

పేలవంగా నవ్వింది ప్రసూన.

శ్రీధర్‌ను ప్రక్కకు పిలిచి "ఈమె పరిస్థితి చాలా గడ్డుగా వుంది. ఇక మందులతో పనిలేదు. గంటో, రెండు గంటలో అన్నారు. అందుకని ఆమెను మీ సహాయంతో ఆమె ఇంటికి చేరుద్దాము!" గంట 2 గంటల్లో పువ్వులాంటి జీవితం రాలిపోతుందనే నిజం ఎంత బాధాకరమైనది.

తీయని కలగా మనస్సులో మిగిలిన ప్రసూన జీవితం శాశ్వతంగా మూతపడుతుందనే నిజం ఎంత దారుణమైనది.

శ్రీధర్ మనస్సు మూగగా రోదిస్తూనే వుంది.

ప్రసూన కా విషయం చెప్పకపోయినా ఆమె వూహించుకోగలదు.

కేసు రచ్చకెక్కకుండా అనుకోని పరిస్థితిలో చీర కొంగు అంటుకుందన్న ప్రసూన వాంగ్మూలంతో కొంత అలజడి తగ్గింది.

ఆమె భర్త జాడ ఎక్కడా లేదు.

రిక్షాలో ప్రక్కామె సహాయంతో సందులు, గొందులు తిరిగి ఒక పాకలోకి ప్రసూనను చేర్చారు.

ఒంటిగది అది. మరీ అధ్వాన్నంగా వుంది. పెద్దగా సామాన్లు కూడా ఏమీ లేవు. ఒక ప్రక్క మాడి మసి అయిపోయిన గుర్తుగా తాటాకుల్లోని ప్రదేశం, అక్కడ్నుంచి ఆకాశం కన్పడుతూంది.

చాపమీద పడుకోబెట్టారు. గ్లూకోజ్ నీళ్ళు కాస్త దాహంగా పుచ్చుకొంది.

"శ్రీధర్! నాదగ్గర కూర్చో!" ఆ స్థితిలో ప్రసూనని చూస్తానని శ్రీధర్ ఎప్పుడూ అనుకోలేదు. యవ్వనం తొలి దశలో వసంతాలు పూయించిన ఆమెతో చెలిమి, ఆ చల్లదనం ఈనాడిలా మసి అయిపోతాయని వూహకు అందలేదు ప్రక్కనే కూర్చున్నాడు.

"నా కథ ఆనాడు అడిగావు కాని కొన్ని భయాలు వాస్తవాల్ని దూరంగా వుంచడానికి ప్రయత్నం చేస్తాయి. అట్లాటి పరిస్థితిలో నేనున్నాను అప్పుడు. ఇప్పుడు చెప్తాను" ఎంతో ప్రయత్నంచేసి మాట్లాడుతూంది. వద్దని వారిద్దామన్నా మళ్ళీ ఆమెకా అవకాశం రాదు అని సరిపెట్టుకున్నాడు.

"పెళ్ళి జరిగిన మూడు నెలలు ముచ్చటగా జరిగింది నా సంసారం. నేను తెచ్చిన డబ్బు, అమ్మ ఇల్లు అమ్మి ఇచ్చిన డబ్బు అన్నీ హారతి కర్పూరంలా ఖర్చయ్యాయి. ఎక్కువ గొప్పలకుపోయి వున్నది పోగొట్టుకున్నాము. అతనికి వ్యాపారంమీద లాభంకంటే నష్టమే ఎక్కువ. నేను కాక నాకంటే ముందు ఒకామెతో అతనికి పెళ్ళి జరిగింది. పిల్లలు కూడా వున్నారు. నాకు ఆ రహస్యం చాలాకాలానికి తెలిసింది. సకల లక్షణాలు మేళవించి వ్యసనపరుడైన భర్తను భరించే ఓపిక నాకు భగవంతుడే ఇచ్చివుంటాడు.

ప్రేమతో నువ్వు పలికిన ఆహ్వానం, నీవు పరిచివుంచిన సింహాసనం అధిష్టించేందుకు నాకు అర్హత నేనే పోగొట్టుకున్నాను ప్రేమకు, డబ్బుకు ముడిపెట్టుకొని డబ్బు వైపే తల ఒగ్గిన నాకు తగిన శాస్తి జరిగింది.

అతనితో జీవితం ముళ్ళబాటలా వుంది. అమ్మకి విషయం తెలిస్తే మరిక బ్రతకదు. ఆమెకా పరిస్థితి రాకుండా నా స్థితిని కప్పిపెట్టుకొని మభ్యపెట్టాను. ఒక్కో మెట్టు దిగజారుతున్నాను.




ఒకరోజు ఇద్దరు వ్యక్తుల్ని నా దగ్గరకు తీసుకువచ్చి తను బయటకు వెళ్ళాడు. వేళకానివేళ వరమాంసం రుచి మరిగిన ఆ నీచుల ఆకలికి బలికాక తప్పలేదు. దాని ప్రతిఫలంగా నా భర్త డబ్బు తీసుకున్నాడు. భార్య విలువ వాడికర్థంకాదు. రోజూ అదొక అలవాటుగా మారింది. ఎంత ప్రతిఘటించినా నాకాస్థితి తప్పలేదు. సభ్య ప్రపంచంలో స్థానంకోసం భర్త చాటున అన్నీ భరించాను.

ఊరూర్ల తిరిగాము. అతనికంటూ వ్యాపకం లేదు. త్రాగుడు ఎక్కువైంది. ఆర్థికంగా పతనం చెందాక అన్ని అలవాట్లు పులులలాగ మీదపడి పీకడం మొదలుపెట్టాయి. నానా హింసలతో నా ఒంట్లోని నెత్తురును డబ్బుగా మార్చి తీసుకున్నాడు. భర్త స్థానంలో నాకు పిశాచిలాగ కనిపించేవాడు. ఎప్పుడైనా నిన్ను తలుచుకున్న క్షణకాలం సంతోషం అనిపించేది

2రోజులక్రితం కొవ్వొత్తిలా కరిగిపోయిన ప్రసూన మీద తీరని కోపంతో కిర్సనాయిలుపోసి అంటించిన ఆ ఘనమైన భర్త పరారీ అయ్యాడు. దీనావస్థలో ప్రక్కవాళ్ళ సహాయంతో హాస్పిటలుకు చేర్చబడిన ప్రసూన ప్రస్తుత పరిస్థితి శ్రీధర్ కళ్ళెదుటే కనబడుతూంది. మాట్లాడే శక్తి కూడా క్రమంగా కోల్పోతోంది. ప్రక్కనే నిల్చున్నామెకు సంజ్ఞచేసి ఏదో అడిగింది వెంటనే ఆమె బయటికి వెళ్ళి బోసినవ్వులతో ముద్దుగా వున్న ఏడాది పాపను ఎత్తుకొనివచ్చి ప్రసూన చేతుల్లో పెట్టింది

లేని శక్తిని తెచ్చుకొని ఆ చిన్ని పాపను దరికి చేర్చుకొని ముద్దులతో ముంచెత్తింది.

కళ్ళనిండా నీళ్ళతో వణుకుతున్న గొంతుతో "శ్రీధర్, దగ్గరకు రా!" ప్రసూన పిలిచింది.

దగ్గరకు వచ్చిన శ్రీధర్ చేతిని పుచ్చుకొని ఒక్కసారి కళ్ళకానించుకొంది.

"నీకు నామీద ప్రేమ, అభిమానం చెదిరిపోలేదని నా నమ్మకం. నాకోసం నిన్నొక సహాయం కోటుతున్నాను. ఈ చిట్టి తల్లిని నీ చేతుల్లో పెడుతున్నాను. తండ్రి ఛ్ఛాయ దీనికి తగలనివ్వక నీ అభిరుచికి అనుగుణంగా పెంచగలవా? ఇది నీకు శక్తికి మించిన బరువే అయినా నా కోరిక తీరుస్తావు కదూ. ఇందుకోసమే నేను ఇంకా బ్రతికి వున్నాను."

అయోమయంగా వున్నా ఏదో నిశ్చయంతో ఆ చిన్నారి కోసం, కేరింతలతో సర్వం మర్చిపోయిన ఆ అమాయక ప్రాణి కోసం, ప్రసూన చేతిలోంచి పాపను తీసుకొని "పాప విషయంలో నీకు భయం వద్దు. నీవు కోరుకున్న విధంగానే పెంచుతాను. కాని నువ్వు కోలుకోవాలి."అసందర్భమైన విషయమైనా ఆమె ధైర్యంకోసం ఆ మాట అన్నాడు.

తృప్తిగా చూసింది ప్రసూన

క్రమంగా కళ్ళలో కాంతి తగ్గింది.

భారంగా ఊపిరితీస్తూంది.

నిమిష నిమిషానికీ ఎక్కిళ్ళతో పాపకేసే చూస్తూ ప్రసూన ఈ లోకం విడిచి వెళ్ళింది.

ఎన్నో ఆశలతో అత్తవారింట అడుగుపెట్టిన ఆ కుసుమ కోమలి అనుకోని విధంగా అన్యాయంగా బలైపోవడం శ్రీధర్‌కెంతో దుఃఖమనిపించింది.

మానవత్వంలేని మనిషిరూపంలో వున్న రాక్షసుడి జాడ ఎక్కడా లేదు.

అతని అవసరం కూడా లేదు.

పాపని తీసుకున్నాడు.

ప్రసూన ఎంతో నమ్మకంతో ఆ బాధ్యత తనకప్పగించింది. ఆమె నమ్మకాన్ని వమ్ము చెయ్యకూడదు. మిగిలిన కార్యక్రమం అంతా తనే పూర్తిచేశాడు. ప్రసూన అనాధప్రేతం కాదు. ఆమెకు తనున్నాడు. ఆ ధైర్యంతోనే ఆమె చివరి శ్వాస వదిలింది.

అన్నీ పూర్తి చేసుకొని చిన్న పాపను చేతుల్లోనికి తీసుకొని బరువైన భారాన్ని భుజస్కంధాలపై నిలువుకొని తిరిగి వెనక్కు ప్రయాణమైనాడు శ్రీధర్.

మనిషికి ప్రేమ, సానుభూతి మృగ్య




## జీవన హేల

మైపోతే జీవితంలో సర్వస్వం కోల్పోయినట్లే బాధపడతాడు.

అందరూ వుండి అంతా లోటుతో జీవితం పూర్తిచేసుకుంది ప్రసూన.

ఆమె గుర్తులు, జ్ఞాపకాలు మాత్రం శాశ్వతాలు. అలవాటులెని పని కావడంతో చేతుల్లో చిన్ని పాపకు ఉక్కిరిబిక్కిరిగా వుంది

వుండి, వుండి ఏడుస్తోంది. ప్రక్కామె కలిపి ఇచ్చిన పాలసీసా నోటికందించి ప్రయాణం పూర్తి చేశాడు. తల్లిజాడకోసం ఏడ్చే వయస్సు కాదది. ఎదుటి వ్యక్తి నైజంతో పనిలేదు.

నవ్వులు చిందిస్తూ పువ్వులు పండించే ఆ పాపకు ఇంక తానే దిక్కు. పెద్ద బాధ్యతే. అవసరంలేని బంధుత్వాలు అనుబంధాలై కాళ్ళకు బంధాలు వేసి శ్రీధర్‌ను బాధ్యతల వలయంలో నిలబెట్టాయి.

ఆఫీసు పనితో పాపను సాకడం చాలా కష్టంగానే వుంది.

నా అనే వాళ్ళులేని శ్రీధర్ జీవితంలోకి పాప ప్రవేశం ఎంత విచిత్రంగా జరిగినా అంతే ఆనందాన్ని పంచి ఇస్తూంది.

పాప ఆలనా పాలనా కోసం పనిపిల్లను ఏర్పాటుచేశాడు.

తెలిసిన వాళ్ళకి బ్రహ్మచారి శ్రీధర్‌కు పాప బాధ్యత ఆశ్చర్యం కలిగించింది.

ఆ వూరునుండి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాడు. రోజులు గడిచి సంవత్సరాలుగా మారుతున్నాయి. పాపకి నడిచే వయస్సు దాటింది. మాటలు వచ్చిన దగ్గరినుండి శ్రీధర్‌ను తండ్రిగా భావిస్తూంది. తల్లిలేని లోటు తెలియకుండానే పెంచుకున్నాడు. ప్రసూన తన జీవితంలో మిగిల్చిన తీయని గుర్తు పాప.

పాప స్కూలు చదువు పూర్తి చేసింది.

పెళ్లి కాకపోయినా తనది కాకపోయినా ఒక పాపకు తండ్రిగా పూర్తి బాధ్యత వహించాడు.

శ్రీధర్ నీడలో పాప కాలేజీ చదువు కూడా పూర్తి చేసింది.

శ్రీధర్ ఉద్యోగంలో ఒక్కొమెట్టు పైకెక్కుతూ ప్రధమ స్థాయిలోకి చేరాడు.

పరిపూర్ణమైన తండ్రి పాత్ర నిర్వహణలో శ్రీధర్ కృతకృత్యుడయ్యాడు అని చెప్పడంలో సాహసం ఏమీలేదు. సంఘంలో శ్రీధర్ కూతురుగానే చెలామణి అవుతున్న పాపకు తన పుట్టుక తెలియదు. సంగీత సాహిత్యాలలో ప్రవేశం పొందింది.

విద్యావతి, సంస్కారవంతమైన యువతిగా పాపను రూపొందించడానికి శ్రీధర్ కృషి ఎంతో వుంది. యోగ్యుడైన యువకుడికి భార్యగా సంసారజీవితంలోకి అడుగుపెట్టింది. ఎన్నో ఏండ్ల అనుబంధంతో శ్రీధర్ తండ్రిగా పాప ఎడబాటుకు తల్లడిల్లిపోయాడు.

* * * *

చెప్పడం ఆపాడు రావు. శ్రోతలిద్దరూ అదమరచి వింటున్నారు. తన సమస్యకు ఈ కథలో పరిష్కారం ఏమిటో అనంత్ హృదయానికి తాకలేదు.

శకుంతల మనస్సు ప్రేమ పూజారి శ్రీధర్ పట్ల, జీవితాన్ని పూర్తిగా అనుభవించకుండా మధ్యలోనే మరణించిన ప్రసూన పట్ల అభిమానం కలిగింది.

సమయం వాళ్ళ కాలక్షేపానికి అడ్డురాలేదు. తెల్లవారినట్లు గుర్తుగా తూర్పున సూర్య కిరణాలు ప్రకాశవంతంగా పైపైకి వస్తున్నాయి. పక్షుల కిలకిలారావాలతో క్రొత్త ఊహలు రెక్కలు విప్పుకున్న విధంగా మంద్రంగా వినిపిస్తున్నాయి.

నిద్ర లేమి వాళ్ళను బాధించలేదు.

"నా సమస్య మీరు పూర్తిగా అర్థం చేసుకోవాలి. కొన్ని అనుమానాలు అబద్ధాలుగా మిగిలిపోవాలి. శకు పుట్టుకలోని యదార్థం నాకు కావాలి. ఆమె మీ అక్రమ సంతానం అని ఈ మధ్యనే తెలిసింది. అపురూపంగా ప్రేమించినా ఆమె తల్లి ఒక వ్యభిచారిణి అని తెలియగానే నాకు తెలియకుండానే ఆమెపట్ల విముఖత

ఏర్పడింది. కొన్ని విషయాలు పెళ్ళికి ముందు మిమ్మల్ని నిర్బంధించి అడుగ లేదు. ఎందుకంటే ఆమె మీ ముద్దుల కూతురు అన్న ఆలోచన నాకా సంశయం కలిగించలేదు.

ఈ మధ్యనే నాకు ఒక వ్యక్తి ద్వారా ఈ సమాచారం అందింది. ఆయన మిమ్మల్ని నా పెళ్ళిలో చూశాడు. తరువాత నన్ను కలిసి పై విషయాలు చెప్పడంతో నా ఆనందం భగ్నమైంది.

ఏ వ్యక్తి అయినా మలినమైన చరిత్ర కల భార్యను ప్రేమగా స్వీకరించలేదు. కనుక యథార్థం మీరు తెలియపర్చగలరని ఆశిస్తూ-

-అనంత్

ఉత్తరంలోని సారాంశం రెండురోజుల నుండి నెమరువేస్తున్నట్లు అనిపించినా ఈ రోజు తేలికగా హాయిగా ఊపిరి పీల్చు కోగలుగుతున్నాడు. వ్యర్థమైన విషయం కాకపోయినా చెప్పాల్సిన అవసరం ఇంత వరకూ రాలేదు. కనుక శకుంతల పుట్టుక అనంత్ చెవిన వెయ్యలేదు. అనుమానం మహావృక్షం కాకముందే అన్ని విషయాలు చెప్పడం మంచిది అన్న నిర్ణయంతో శ్రీధర్ కథను పూర్తిచేశాడు రావు.

"అనంత్! శ్రీధర్‌గా నా పాత్రలో ఔచిత్యము, ప్రసూనగా శకుంతల తల్లి మలిన చరిత్ర, పసికందుగా వున్నప్పుడే తల్లిదండ్రులను కోల్పోయిన అనాధగా శకుంతలను నీకు పరిచయం చేశాను.. నిర్ణయం నీకే వదిలేశాను." అన్నాడు రావు.

"డాడీ! నేను నీ కూతుర్ని కానా! మన వెనుక ఇంత చరిత్ర దాగుందా!" నివ్వెరపోయింది శకూ. ఏనాడూ తండ్రికంటే మిన్నగానే లాలించిన రావు తనకి తండ్రి కాదు అనుకోవడం ఆమెకు ఏమాత్రం ఇష్టంలేదు. తల్లిని ఫోటోలో మాత్రం చూసింది.

అక్రమ సంతానంగా వూహించుకొని రావు వ్యక్తిత్వాన్నే అవమాన పరిచేవిధంగా ప్రవర్తించినందుకు అనంత్‌కు ఎంతో సిగ్గుగా వుంది.

ఉన్నత శిఖరాలనందుకున్న రావు వ్యక్తిత్వానికి అనంత్ ధన్యవాదాలర్పించాడు. విధివంచిత ప్రసూన జీవితచరిత్ర తాలూకు మసి శకుంతలకు ఏవిధంగానూ అంటదు. జీవితంలో అందరికి ఎందరో వ్యక్తులు తారసపడుతుంటారు. వాళ్ళలో కొందరు మాత్రమే వారి వారి జీవితాలను ప్రభావితం చేస్తారు.

విధి మనిషి జీవితంలో ముఖ్యపాత్ర వహిస్తూ కనిపించని నాటకం ఆడుతుంది. విధి చేతిలో మనిషి కీలుబొమ్మ కాకతప్పదు. శ్రీధర్‌రావుకి జీవితంలో 'విధి' నిర్వహించిన ఆట ఎందరో వ్యక్తులతో అనుబంధాన్ని ఏర్పరిచింది. అనుబంధం బంధంగా మారి తమందర్నీ ఈ విధంగా కలిపింది అని తెలుసుకున్న అనంత్‌కు పూర్తి జ్ఞానోదయమైంది.

అవసరంలేని అపోహలన్నీ మనస్సు శోధించి పారద్రోలి శకును హృదయంలో పదిలంగా దాచుకోవాలని నిర్ణయించుకున్నాడు. రావు జీవితం తన కాదర్శంగా భావించిన అనంత్‌తోబాటు శకు కూడా వంగి రావు కాళ్ళకు నమస్కరించింది.

రెండు చేతులను వారిద్దరిచుట్టూ వేసి ప్రేమతో దగ్గరకు తీసుకున్నాడు శ్రీధర్‌రావు.

(అయిపోయింది)

**-అంకితం-**

శ్రీరామలింగేశ్వర స్వామికి భక్తితో-

-రచయిత్రి

---

## సాహితీ పజిల్

గెల్చుకోండి రు. 200



## గళ్లనుడి కట్టు - 30

### ఆధారాలు

**నిలువు**

1 వీడి పేరుతో రామాయణంలో అరణ్యం
3 శంతనుడి మామ
4 దరువును కొద్దిగా మార్చండి కొయ్య వస్తుంది
8 చెంచులక్ష్మి బంధువులు
9 రావణుడు చేసిన అనాధ చుప్పనాతి
10 అతిబలలో స్త్రీ
11 తిథి నియమం లేకుండా వస్తాడు
14 దనుజులకు శత్రువు విష్ణువు
15 మందర పర్వతం మోసింది
17 మేఘాలు చూస్తే చాలు నృత్యం చేస్తుంది

**అడ్డం**

2 దారమునకు ఒక అక్షరం ముడివేస్తే పంది
5 పాషండుడు కాదు నపుంసకుడు
6 బరువుకు దీర్ఘం ఇస్తే పుట్టి
7 మరీ అంతపరాకైతే ఎలా ఆలోచించండి
12 9 నిలువులోనే ఉన్నది
13 భల్లూకరాజు కూతురు కృష్ణుని భార్య
16. ఆజానుబాహువులవాడు రాముడు
18 కర్మము కాదు కవచము
19 సుమతికి వ్యతిరేక పార్టీ
20 సముద్రం వారిది, పొరపాటుదిద్దండి

ఆధారాలున్నాయి. నుడి కట్టు గళ్లు నింపండి! ఈ కూపన్ కత్తిరించి మీ చిరునామా రాసి పంపండి. ఆల్ కరెక్టు సొల్యూషన్ పంపిన వారికి రు. 200/-లు బహుమతి లభిస్తుంది-ఒకరి కన్నా ఎక్కువ మంది కరెక్టు ఆన్సర్లు పంపితే వారికి బహుమతి మొత్తం పంచడం జరుగుతుంది. తుది నిర్ణయం సంపాదకునిదే.

-ఎడిటర్

**ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక**

పంపినవారి పేరు.............................................

పూర్తి చిరునామా..........................................

.................................................పిన్ కోడ్.......................

ముగింపు తేది 25-10-'90






అడ్వొకేట్: **బి.భాస్కరరావు** ఎం.ఎ.,ఎల్.ఎల్.బి.

రాఘవేంద్ర, రామపురం (శ్రీశైలం).

ప్రశ్న: నాకు ఐ.ఏ.ఎస్. పరీక్ష వ్రాయాలని వుంది. కాని మా అమ్మ వాళ్ళు పాలిటెక్నిక్‌లో చేర్చుతాము అంటున్నారు. ఒకవేళ అది చదివితే ఐ.ఏ. ఎస్. వ్రాయవచ్చునా? ఐ.ఏ.ఎస్ వ్రాయడానికి ఏమి అర్హతలు కావాలి? ఎంత వయస్సు ఉండాలి? ఒ.సి. వారికయితే ఏ అర్హత ఉండాలి? పుస్తకాలు ఎచ్చట దొరకును? వివరంగా తెలుపుతారని ఆశిస్తున్నాను.

జవాబు. ఐ.ఏ ఎస్ పరీక్షకు వెళ్ళాలని అనుకుంటే మీరు గ్రాడ్యుయేట్ అయి వుండాలి. వయస్సు ఈ 1990 సంవత్సరంలో 28 సంవత్సరాలుగా భారత ప్రభుత్వం నిర్ణయించారు. కాని సాధారణంగా గరిష్ఠ వయస్సు 26 సంవత్సరాలు మాత్రమే. మీరు పాలిటెక్నిక్ పరీక్ష ప్యాసయి ఐ ఏ ఎస్. పరీక్షకు వెళ్ళడానికి అవకాశం లేదు. పోలిటెక్నిక్ తర్వాత బి.ఇ ప్యాసయి ఐ.ఏ. ఎస్. పరీక్షకు వెళ్ళవచ్చును. పోస్ట్ గ్రాడ్యుయేట్లు అయితే మెయిన్ పరీక్షలో బాగా మార్కులు తెచ్చుకొనవచ్చును ఇంటర్వ్యూలో కూడా మంచి మార్కులు తెచ్చుకొన వచ్చును. సివిల్ సర్వీసెస్ ప్రిలిమినరీ పరీక్ష ముందుగా ప్యాస్ అవ్వాలి. అందులో ఎక్కువగా మార్కులు వచ్చిన వారు మెయిన్ పరీక్షకు పిలువబడతారు. ప్రిలిమినరీ పరీక్షకు రావ్స్ ఐ.ఏ ఎస్. స్టడీ సర్కిల్ వారికి, 26/18-ఈస్ట్ పటేల్ నగర్, న్యూఢిల్లీ-8 ఎడ్రస్‌కు వ్రాసి గైడ్ పొందవచ్చును. ఇంకా మంచి ప్రచురణ కర్తలు ప్రచురించిన గైడ్లు కూడా పుస్తకాల షాపులలో దొరుకును.

శ్రీ కొండనవీన్, గూడూరు.

ప్రశ్న: భారతదేశంలో న్యాయమూర్తులు సరియైన వేతనాలు లేక సరియైన న్యాయముతో తీర్పులు చెప్పలేకపోతున్నారు. నిజమేనా?

జవాబు: మీ అభిప్రాయము సరియైనది కాదు!

సీరియల్

# మోహినీ తాండవం

డా. కొత్త రవీంద్రబాబు

**ఇంతవరకూ సాగిన కథ 8 :** ప్రణవనాథ్‌ను మోహిని హత్య చేస్తుంది. మాతా మోటారు కంపెనీలో పనిచేసే తారానాథ్, రుస్తుంజీ ప్రయాణిస్తున్న మొబైక్ పెట్రోల్ టాంకు విస్ఫోటనకు గురై ఇద్దరూ మరణిస్తారు. మోహిని గురించి వివరాలు ఆరా తీయాలనుకున్న నందికేశ్వరకు చావుదెబ్బ తగుల్తుంది. ప్లూటోగా పిలువబడే రవితేజను కలుసుకొనేందుకు రేఖ వెళ్తుంది. రేఖ తండ్రికి సహాయపడేందుకు రవితేజ తన గురూజీ అయిన నానాసాహెబ్ అనుమతి తీసుకుంటాడు.

ఫ్యాక్టరీ కట్టారు. ముడిసరకు నుండి అల్యూమినియం గిన్నెలు, రేకులు, స్తంభాలు, తీగలు ఏ రూపంలో కావాలంటే ఆ రూపంలో తయారు చేయడంతో ఫ్యాక్టరీలో రద్దీ ఎక్కువైంది.

ఫ్యాక్టరీ నుండి వెలువడే మురికి పదార్థాలను,ద్రవాలను పొడుగాటి పైపుల ద్వారా దగ్గర్లో వున్న సరసులోకి వదిలే ఏర్పాట్లు చేసారు. వర్షాకాలం సరస్సులోకి నీరు ఎక్కువగా వచ్చినప్పుడు సరసులోని నీరు పైకి ఉబికి చుట్టుపట్ల పల్లపు ప్రాంతాలను జలమయం చేసినప్పుడు సరస్సులోని కాలుష్య పదార్థాలు పల్లపు ప్రాంతాలలోకి రాసాగాయి.

ఫ్యాక్టరీ నుండి వెలికి వచ్చే వ్యర్థ, మురికి పదార్థాలతో పాదరసం వొకటి స్వల్ప పరిమాణంలో వ్యర్థ పదార్థాలతో పాటు సరసులో జేరే పాదరసం నీటితో కలసి యితర మురికి పదార్థాలతో సంయోగం చెంది అత్యంత ప్రమాద భరితమైన మెర్క్యురిక్ ఆక్సైడ్‌గా రూపాంతరం చెంది పల్లపు ప్రాంతాలలో జేరసాగింది

సరసులో నుండి వచ్చే వొండ్రుమన్ను ఎక్కువ సారవంత మని ప్రజలు భావించి పల్లపు ప్రాంతాలలో కూరగాయలు పెంచేవారు.

వొండ్రు మన్నుతో పాటూ కొద్ది కొద్దిగా విషపదార్థమూ సరసు నుండి కొట్టుకువచ్చి సారవంతమైన భూమిని విషతుల్యంగా మార్చటానికి ఎంతో కాలం పట్టలేదు.

ఇంతలో లాభాలెక్కువగా రావడంతో ఫ్యాక్టరీ కెపాసిటీని రెట్టింపు చేసారు

మామూలుగా అయితే పండిన కూరగాయలను బళ్లమీద ఉదయపూర్ తోలుకు వెళ్లేవాళ్లు ఆ ప్రాంత ప్రజ కూరగాయల మీద ఆదాయంతో నే ఎక్కువ ఖర్చు గడిచిపోతుండేది. కాని ఫ్యాక్టరీ పెట్టిన తర్వాత పల్లెలోని ప్రతి వ్యక్తికీ పని దొరికి తగినంత ఆదాయం దొరకడంతో నిరుపేద జీవితాని కలవడ్డ వ్యక్తులు అదివరకు అలవాటు లేని కొత్త సుఖాలకు మోజు పడసాగారు.

ఫలితంగా ఇది వరకు ఉదయపూర్ వెళ్లిన కూరగాయలలో ఎక్కువ భాగం పల్లెలో నే ఖర్చుకాసాగాయి

ఆ ఏడు వర్షాకాలం చెరువులోని చేపలు, తాబేళ్లు మొసళ్లు చచ్చి నీటిమీద తేలుతూ వొడ్డుకు రావడంతో జనంలో అలజడి మొదలైంది.

."ఏకలింగ్‌జీకి కోపం వచ్చింది."

"పూజలు చేయకపోతే ఏమవుతుంది?"

"కొలుపులు చేసి నాలుగేళ్లయింది."

జనం కొలుపులు చేసారు. శివుడికి అభిషేకాలు చేసారు. సంతర్పణ చేసారు.

విపరీతంగా వాన కురిసి సరసులో నీరు పొంగి పొరలి పోయాయి. వరద నీరు విషపదార్థాలను తనతో తీసుకు వెళ్లింది

మళ్లీ సరసులో చేపలు కనపడ్డాయి. జనం వూపిరి పీల్చుకున్నారు.

కాని కొద్ది నెలలు గడచినవో లేదో ఫ్యాక్టరీలో కార్మికుడికి చేతులు కాళ్లూ లేని మగశిశువు పుట్టాడు. "గర్భిణితో వుండగా గ్రహణం చూచింది" అన్నారు పెద్ద ముత్తయిదువులు.

"భార్యా భర్త మేనత్త మేనమామ బిడ్డలు అందువలన యిలా జరిగింది" అన్నాడు వూర్లో చదువుకున్న యువకుడు.

"సింగినాదం గాదూ? శివుడి ఆజ్ఞ లేంది చీమైనా కుట్టదు! అంతా వాడి ప్రభావం" శివాలయం వైపు తిరిగి నమస్కరిస్తూ అన్నాడు వొకవయో వృద్ధుడు.



"అంతా వాడి ఖర్మ- నుదుటి వ్రాత తప్పించలేం" అన్నారు. అందరూ వికృత శిశువును గూర్చి మరచి పోయారు.

మూడు నెలలున్నాక మరో కార్మికుని భార్య కళ్ళులేని, ఆడ శిశువును ప్రసవించింది.

"కళ్ళు లేని కబోది దీన్నెవరు చేసుకుంటారు" అని అంతా దిగులు పడ్డారు.

మరో రెన్నెల్లకు తలలేని శిశువు జన్మించింది. "అమ్మో- ఏదో ప్రళయం రాబోతున్నది. తల లేని రాక్షసి పుట్టింది" పల్లె అంతా గగ్గోలు పుట్టింది.

పల్లెలో పుట్టిన గగ్గోలు ఫ్యాక్టరీ యజమానికి తెలిసింది. ఆయన పంపిన సైంటిస్టులు వచ్చి సరసులోని నీటిని పరీక్షించి వెళ్ళారు. వాళ్ళు ఆయనకేం చెప్పిందీ ఎవరికీ తెలియదు!

అసలు ఫ్యాక్టరీ నుండి వెలికి వచ్చే వ్యర్థ విషపదార్థాల వలన కలిగిన అనర్థమే వికృత శిశు జననం అన్న సంగతి ఆ మారుమూల పల్లె ప్రజలకు తెలియలేదు

ఆ విషయం తెలిసిన ఫ్యాక్టరీ మేనేజర్, సేట్ ప్రజలకు నిజంతెలియనివ్వలేదు.

వికృత శిశువులు పుడుతూనే వున్నారు. ఆ సమయంలో డాక్టర్ కిషన్ డాక్టర్ మీరా దంపతులకు ఏకలింగాలయం సమీపంలోని పల్లెలో వికృత శిశువులు జన్మిస్తున్నారన్న విషయం తెలిసింది.

కరాటే మాస్టర్ యోగ సాధకుడు నానాసాహెబ్ కుమార్తె అల్లుడు అయిన డాక్టర్ దంపతులు ఉదయపూర్ నుండి రోజూ పల్లెకు వచ్చి ప్రజలను పరీక్షించ సాగారు.

నిరక్షరాస్యులు అజ్ఞానులు అయిన పల్లె ప్రజలకు బోధపడని విషయం డాక్టర్ దంపతులకు శీఘ్రంగా తెలిసిపోయింది.

ఫ్యాక్టరీ స్థాపించక ముందు ఆ పల్లెలో వికృత శిశు జననాలు బహు అరుదు. ఫ్యాక్టరీ స్థాపించాక వికృత శిశుజననాలు అధికతరం అయ్యాయి అన్న వాస్తవం గుర్తించారు.

కిషన్ తన స్నేహితుడు రాంస్వరూప్‌ను పిలిపించాడు. రాంస్వరూప్ కెమికల్ యింజనీర్.

ఫ్యాక్టరీ నుండి వెలికివచ్చే వ్యర్థ పదార్థాలను క్షుణ్ణంగా పరిశీలించి అనేక సూచనలను యిచ్చాడు రాంస్వరూప్.

అతని సూచనలను ఫ్యాక్టరీ యజమానికి అందజేద్దామని వెళ్ళాడు కిషన్.

సేట్ కిషన్‌ను ఎంతో మర్యాద చేసాడు. "అరే భాయ్- నువ్వింత కష్టపడి యింత పరిశోధించి పల్లె ప్రజల ఆరోగ్యం

విషయంలో యిన్ని సూచనలిచ్చావు నీకు నేనెంతో రుణపడి వుంటాను.

నీ సలహాలు తప్పక పాటిస్తాను. నా ఫ్యాక్టరీలో పనిచేసే వారి యోగక్షేమాలను మెరుగు పరచడం కంటే కావలసిందేముంటుంది?"

సేట్ యింటి నుండి ఎంతో సంతోషంతో బయటకు వచ్చాడు కిషన్.

పల్లె ప్రజలను వేధిస్తున్న సమస్యకు త్వరలో పరిష్కారం లభించనున్న దన్న సంగతి అతనికి ఎంతో ఆనందానిచ్చింది

"మీరా కీవిషయం తెలిస్తే ఎంత సంతోష పడుతుంది" ఉదయపూర్‌లో వున్న మీరా మీద కతని ఆలోచనలు పోయాయి. మీరా గర్భిణితో వుంది. మొదటి కాన్పులో పుట్టిన మగపిల్లవాడు చంద్రహాస చిన్నపిల్లవాడు.

"మలిచూలు ఆడపిల్ల పుట్టాలి" అని మీరా పదేపదే అనటం గుర్తొచ్చింది.

"మీరాకు అంజూర పళ్ళంటే యిష్టం!" మార్కెట్‌లో అంజూర పళ్ళు కొనుక్కుని వస్తుండగా జరుగగూడని అనర్థం జరిగిపోయింది!

మనసు ఆనందంతో నిండివుండటంతో

## మోహినీ తాండవం

చకచకా నడుస్తున్న కిషన్ ఎదురుగా వస్తున్న పెనుభూతంలాంటి లారీని మరీ దగ్గరకు వచ్చాకగాని గమనించలేదు

పక్కకు తప్పుకో బోయాడు గాని తత్తరలో కిందపడి పోయాడు లారీ మీదుగా వెళ్ళి శరీరం నుజ్జయి అక్కడికక్కడే మరణించాడు కిషన్. మీరా కోసం అతను కొన్న అంజూర ఫలాల పొట్లం మాత్రం చెక్కుచెదరకుండా పక్కన పడివుంది

చుట్టూర గుమిగూడిన జనాన్ని తోసుకుని వచ్చిన కాన్‌స్టేబిల్ కిషన్ నాడి చూచి "మర్‌గయా" అన్నాడు.

"లారీ నంబర్ చూసారా?!" అని అడిగాడతను. "చూడలా" అంటూ జనం వొక్కొరూ తప్పుకున్నారు

నెండు చూలాలు మీరా భర్త దుర్మరణాన్ని భరించి కాలం గడపసాగింది.

పదిహేను రోజుల తర్వాత నొప్పులు వచ్చి సుఖప్రసవ మైంది.

డాక్టరమ్మ నర్సులు ముఖముఖాలు చూచుకోవడం చూచి "ఏమయింది? ఎందుకలా వున్నారు?" అని అడిగింది

"ఏం లేదు మీరా" అంటూ అవతలకు వెళ్ళి పోయింది డాక్టరమ్మ.

హడావిడిగా వెళ్ళున్న నర్సును పిలిచి "ఆడపిల్లేనా?" అని అడిగింది.

అవునన్నట్లు తలూపి వెళ్ళిందామె

"సిస్టర్ వొకసారి పాపను చూపిస్తారా?" మరో నర్సును అడిగింది మీరా.

తల వూపి వెళ్ళిందే గాని నర్స్ తిరిగిరాలేదు!

నర్స్‌గాని డాక్టరమ్మగాని గది వైపుగా రాకపోయే సరికి మీరా మనసులో ఆదుర్దా కల్గింది.

"పాప చనిపోయిందా ఏం? లేకపోతే ఎందుకు చూపరు?" ఉండబట్టలేక అరచి కేకలు పెట్ట సాగింది.

"నా పాపను తెచ్చిచూపండి" అంటూ.

డాక్టరమ్మ, నర్స్ వచ్చారు డాక్టరమ్మ సైగ చెయ్యగా పాపను చూపింది నర్స్

పాపను చూస్తూనే కెవ్వున అరచి మూర్ఛ పోయింది మీరా.

కడిగిన ముత్యం లాంటి చక్కని పసిపాప- కాని ఆమె కళ్ళు తెల్లగ్రుడ్లు మెరసి పోతున్నాయి. కనుపాపలు లేవు!

"నో నో నా పాప గుడ్డిదికాదు!" ఏడ్చి గగ్గోలు పెట్టింది మీరా.

మీరాను ఎలా ఓదార్చాలో తెలియక నానాసాహెబ్‌కు కబురంపారు డాక్టరమ్మగారు.

నానాసాహెబ్ వచ్చేసరికి మీరా మతిభ్రమించి వెర్రికేకలు పెడుతున్నది.

"ప్యూర్పరల్ సైకోసిస్" అన్నారు మానసిక వైద్యులు. ఎంతో కష్టపడి వైద్యం చేయించాక మీరా మానసికంగా కొంచెం కుదుట పడ్డట్లనిపించింది గాని అంతలో అతిసార వ్యాధి ఆమెను బాధించ సాగింది.

అతిసార వ్యాధికి కారణం డాక్టర్లెవరూ కనుక్కోలేక పోయారు.

నెల రోజులు తీసుకుని మరణించింది మీరా. మీరాను పొట్టను పెట్టుకున్న అతిసార వ్యాధి లాటిదే వచ్చి ఏకలింగాలయం దగ్గర పల్లెలోని ప్రజలు కొందరు చిక్కి శల్యమై తీసుకుని తీసుకుని మరణించ సాగారు!

కొంతమంది వృద్ధులు కంటి చూపుపోయి అలమటించ సాగారు.

మీరా మరణించిన తర్వాత రెండు నెలలకు ఉదయపూర్ వచ్చాడు రాంస్వరూప్.

విదేశీ పర్యటనలో వుండడం వలన మిత్రుని అంత్యక్రియలకు హాజరు కాలేక పోయాడతను.

జరిగిన సంఘటనలను గురించి విశ్లేషించి చూచుకున్నాక అతనికి ఏమయింది అర్థం అయింది.

"అంకుల్- మీతో ఏకాంతంగా మాట్లాడాలి" అన్నాడు నానాసాహెబ్‌తో.

తలూపాడు నానాసాహెబ్... తలుపులు వేసి వచ్చాక సంభాషణ మొదలైంది.

"పాపకు ఏం పేరెట్టావంకుల్."

"తెల్లగా మంచుబిందువులా మెరుస్తున్నదని హిమబిందు అని పెట్టాను!"

"హిమబిందు జాత్యంతకు మీరా మరణానికి కారణం మెర్క్యురిక్ ఆక్సైడ్."

"ఏమిటి బాబూ నువ్వనేది?"



"మెర్క్యురిక్ ఆక్సైడ్! ఏకలింగాలయం సమీపంలోని అల్యూమినం ఫ్యాక్టరీ నుండి వెలువడే వ్యర్థ పదార్థాలు అక్కడవున్న సరసునూ సమీప పల్లపు ప్రాంతాలనూ కలుషితం చేసాయి.

సరసులోని చేపలలోను పల్లపు భూమిలో వొండ్రు మన్నులో పెరిగే కూరగాయలలోను మెర్క్యురిక్ ఆక్సైడ్ వున్నది. అవి తిన్న పల్లె ప్రజలు అతిసార వ్యాధికి లోనయి అవస్థలు పడుతున్నారు. చనిపోతున్నారు. కొంతమంది గుడ్డి వాళ్లవుతున్నారు. పల్లెలోని గృహిణులకు వికృత శిశువులు జన్మించ టానికి కారణ మదే!"

"బాబూ యీ విషయం కిషన్‌కు తెలుసా?"

"తెలుసంకుల్."

రెండు నిముషాల పాటు ఆలోచించి 'స్వరూప్-'నువ్వు నాకు చెప్పిన విషయం యితరు లెవరికీ చెప్పకు! చెబితే నీ ప్రాణాలు దక్కవు!" అన్నాడు.

"అంకుల్ అయితే కిషన్ మరణం ప్రమాద వశాత్తు జరిగింది కాదంటారా?"

అవునన్నట్టు తలూపాడు నానాసాహెబ్. తల్లి తండ్రి లేని చంద్రహాసను, హిమ బిందును తల్లీ తండ్రీ అయి పెంచ సాగాడు నానాసాహెబ్. పల్లె ప్రజలను దేముడినీ మోసపుచ్చుతూ అల్యూమినా ఫ్యాక్టరీ దినదినాభి వృద్ధి చెందసాగింది!

ప్రాణం మీద తీపితో కాకుండా పసిపిల్లలు అనాథ లవుతున్నారన్న భయంతో కక్ష తీర్చుకోవటానికి తటపటాయించాడు నానాసాహెబ్.

కాని కూతురు అల్లుడు మరణించ టానికి కారణ భూతమైన మెర్క్యురీ ఆక్సైడ్ గుర్తుగా ధూళి మేఘావృత మైన ఏకలింగాలయం ఫొటో యింట్లో అట్టే పెట్టుకున్నా డాయన.

రవితేజను శిష్యునిగా జేర్చుకున్నాక కొన్నాళ్లకు అతన్ని తన యింట్లో వుండమని ఆహ్వానించాడు నానాసాహెబ్.

"బిందు, చంద్ర- రవి మీకు సొంత అన్న అని అనుకోండి. చంద్ర అన్నలు లేని నీకు రవి అన్నగా దొరికాడు. ఇక నుండి కరాటే శిక్షణ అన్నదగ్గరే సుమా!" అన్నాడు నానాసాహెబ్.

"ముందొచ్చిన చెవులకంటే వెనుక వచ్చిన కొమ్ములు వాడి అని సొంత మనుమడిని నేనుండగా యీ రవిగాడిని హెచ్చు చేసి చెబుతాడేం తాతయ్య" అని మనసులో కోపం పెరిగి చంద్ర చాలా రోజులు రవితో సరిగ్గా మసలుకునే వాడుకాదు.

కాని ఓర్పుతో నేర్పుతో చంద్రకు కరాటే మెలుకువలు నేర్పసాగాడు రవి.

"చంద్ర నీ శరీరంలో స్పీడు వుంది! కొన్ని కదలికలకు స్పీడు ప్రాణం పోస్తుంది. నీ శరీరానికి యీ కదలికలు

# గుర్తుంచుకోండి, పోషణపరంగా సమతూకమైన ఆహారం తినిపించకపోతే, మీ పాపాయికి తగినంతగా బరువు పెరిగేందుకు అవసరమైన ప్రోటీన్లు లభించవు.

## "అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

మీ డాక్టర్‌ని అడగండి, ఆయన మీకు రెండు ముఖ్యమైన విషయాలు చెబుతారు. ఒకటి, ప్రోటీన్లు మీ పాపాయి కండరాలు, శరీర కణాలు పెరగడంలోను, రక్తం ఏర్పడటంలోను తోడ్పడతాయన్నది. రెండవది, సరయిన ప్రోటీన్లు లభించాలంటే మీ పాపాయికి ప్రతిసారి ఆహారం యిచ్చినప్పుడు పోషణ రీత్యా సమతూకమైన ఆహారం అవసరమన్నది. ఇటువంటి ఆహారం ప్రతి రోజూ తినిపించాలి. చాలా మంది తల్లులకు సంప్రదాయమైన ఆహారంతో యీ పని సాధ్యం కాకపోవచ్చు.

దీనికి పరిష్కారం ?

సెరిలాక్. ఎందుచేతనంటే ప్రోటీన్లు పుష్కలంగాగల రెండు ఆహార పదార్థాలు పాలు, గోధుమ సెరిలాక్‌లో ఉన్నాయి. ఇందులో కార్బొహైడ్రేట్లు (పిండి పదార్థాలు) కొవ్వు పదార్థాలు, విటమిన్లూ, ఖనిజాలు, ఇనుము, క్యాల్షియం సరైన పాళ్ళల్లో ఉన్నాయి. ఇది మీ పాపాయికి 4వ నెల నుంచి, అంటే పాలు ఒక్కటే సరిపోని వయసు నుంచి, తినిపించేందుకు ఘన రూపంలోని సమతూకమైన పోషకాహారం. అదీకాకుండా, సెరిలాక్ చాలా రుచిగా ఉంటుంది. పిల్లలకు అది చాలా యిష్టమైనది.

అందుచేత పోషణ రూపేణా సమతూకమైన సెరిలాక్ వల్ల ఉండే లాభాలన్నింటిని మీ పాపాయికి అందించండి. పాపాయికి 6 నెలల వయసు వచ్చినప్పటి నుంచి, వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్, వీట్-వెజిటబుల్ యొక్క అదనపు లాభాన్ని కూడా సమకూర్చండి.

**ప్యాక్ మీద యివ్వబడిన సూచనలను దయచేసి పాటించండి.**

**ఉచితం సెరిలాక్ బేబీ కేర్ బుక్**
వ్రాయండి : సెరిలాక్, పోస్ట్‌బ్యాగ్ నం. 21, న్యూ ఢిల్లీ-110 029

నెస్లె వారి నాణ్యమైన ఉత్పాదన






## మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

## చీకటి చీల్చు వెలు_్తరు

బుద్ధి దీపాలు
గుడ్డిగా వెలుగుతున్నాయి
కటిక చీకటిని పారదో లటానికి-
చిటికెడు బలంతో,
కొండంత ఆశతో.
లంక వారధికి ఉడుత ప్రయాసలా
అయినా చీకటి తొలగనంటోంది
అది అభాగ్యుల కాలే కడుపుల
ఆకలిలా ఉంది
మొండిగా - ఎండకూ, వానకూ చెదరని
బండలాగుంది.

చీకటికి బూటకపు మాట లెక్కువ
చీకటికి - నాటకపు చేష్ట లెక్కువ
ఆకలికి - ఆవేశపు కేక లెక్కువ

ఆకలి కేకల మాటున
నూకలు చాలని బతుకుల
క్షుదార్తులు, వ్యధార్తులు
చూసి, చూసి,
ఆగీ వేగీ
క్షమ నశించి
తుఫాను ముందర ప్రశాంతిలా

గుండెలు మండి
ఆవేశపు అగ్ని పర్వతం బద్దలైపోతే,
లావా బయటికి ఎగజిమ్మితె

ఆ వెడి దావానలంలో
ఆ వెలుతురు ప్రవాహంలో
చీకటి తోక ముడువదా?
మాడి మసైపోదా-?

-పుల్లూరు సదానందం

బాగా సూట్ అవుతాయి "కరాటే శిక్షణలో మెలకువలు చెప్తా" అనేవాడు రవి

పట్టుదలగా ప్రాక్టీస్ చేయసాగాడు చంద్ర. మొదట్లో వంట్లోని కండరాలన్నీ నుజ్జు నుజ్జయినట్లు విపరీతమైన బాధ కల్గి కళ్ల వెంట నీళ్లు తిరిగేవి

కాని మధ్యలో శిక్షణ ఆపితే తాత నవ్వుతాడనే భయంతో పళ్లబిగువున ప్రాక్టీస్ కొనసాగించాడు చంద్ర

ఏ కదలిక వలన ఏం ప్రయోజనం కల్గుతుందీ, ఏ కదలిక వలన తక్కువ శక్తితో ఎక్కువ ఫలితం వస్తుందీ, చంద్ర శరీరానికి ఏ ఏ కదలికలు బాగా నప్పుతాయి అన్న విషయాలు విపులంగా వివరించేవాడు రవి.

కోపం ఆశ్చర్యంగా, ఆశ్చర్యం అభిమానంగా, అభిమానం ప్రేమగా మారటానికి సంవత్సరం పట్టింది

సంవత్సరం అయ్యేసరికి రవిని సొంత అన్న కన్న మిన్నగా పరిగణించ సాగాడు చంద్ర.

బిందు సంగతి చెప్పనే అవసరం లేదు. బిందును చూడగానే రవి హృదయంలో కల్గిన అవ్యాజ సోదర వాత్సల్యాన్ని కనుచూపు లేని బిందు త్వరగా గ్రహించ గల్గింది.

చంద్రకన్న రవిని మిన్నగా ప్రేమించ సాగిందామె!

తల్లి తండ్రి లేని రవికి చంద్ర బిందు ఎంతో ఆప్తులయ్యారు. నానాసాహెబ్

### మోహినీ తాండవం

సరేసరి. రవికి తల్లి తండ్రి గురువు దైవం అన్నీ ఆయనే అయ్యాడు.

గత స్మృతుల నుండి వెలికి వచ్చిన రవితేజ భారంగా నిట్టూర్చాడు "తాత్కాలికంగా నైనా ఉదయపూర్‌ను వదలి వెళ్తున్నాను. ఇన్నాళ్లు నన్ను గుండెల్లో పెట్టుకు కాపాడిన గురూజీ రుణం తీర్చుకోవాలంటే మళ్లీ తిరిగి రావాలిక్కడకు. అంకుల్ కిషన్, అంటీ

మీరాల మరణానికి కారణ భూతుడైన సేట్‌జీ ఫ్యాక్టరీ మూసివేయించాలి. అతని మీద పగ సాధించాలి" ధృఢ సంకల్పంతో పిడికిళ్లు బిగించాడు రవితేజ.

* * * * *

ఉదయపూర్ విమానాశ్రయం లాంజ్‌లో కూర్చుని హేండ్ మిర్రర్‌లో మేకప్ సరిచేసుకో సాగింది రేఖ.

మిర్రర్‌లోంచి లాంజ్‌లోకి వచ్చేవాళ్ళు కనపడే విధంగా ఎడ్జస్ట్ చేసింది.

"రాడేమో?" అన్న అనుమానం మొలకెత్తింది. ఢిల్లీ వెళ్లే విమానం బయల్దేర టానికి వ్యవధిలేదు విమానం బయల్దేర బోతుందన్న ఎనౌన్సు మెంట్ అంతకు ముందేవిన్నది

ఉస్సురంటూ లేచి విమానాశ్రయం లో పలకు నడిచి వెళ్లసాగింది

"ఇంత దూరం వచ్చి ఇంతకష్టపడి రవితేజను వెతకి, మాట్లాడి ఇప్పుడతను లేకుండా వొంటరిగా తిరిగి యింటికి వెళ్లి డాడీ ముఖం ఎలా చూసేది?"

"ఒకవేళ రవితేజ భయపడ్డాడేమో?"

"హ్హ నాతో భయపడడమా?" రకరకాల ప్రశ్నలు సమాధానాలతో మనసు ఉక్కిరిబిక్కిరి కాసాగింది.

"హలో మేడం- పళ్ళు నొప్పి పుట్టడం లేదుగదా?" ఉలిక్కిపడి చూచింది రేఖ.

పక్కనుండి నడిచి వెళ్తున్న సిక్కు- వయోభారంతో వంగిపోయి చేతికర్ర ఆధారంతో నడుస్తున్నాడు. తల మీద పాగ, నల్లటి గుడ్డ చుట్టిన గడ్డంనుండి

### దేవుళ్ళంతా మనవాళ్ళే

"సావాసగాళ్ళు" - "చిలిపి కృష్ణుడు" - "అన్నా- చెల్లెలు" - "ప్రతిజ్ఞ" లాంటి హిట్ చిత్రాలకు దర్శకత్వం వహించి, ప్రస్తుతం "పుట్టింటి పట్టుచీర" చిత్రానికి దర్శకత్వం వహిస్తోన్న యువదర్శకుడు బోయిన సుబ్బారావు- "అందరు దేవుళ్లకు మొక్కుతాను ఏ పనైనా సిన్సియర్‌గా చేయడమే నా సెంటిమెంటు" అంటారు అతని పూజా మందిరంలో వినాయకస్వామి, లక్ష్మీదేవి, వెంకటేశ్వరస్వామి, శ్రీకృష్ణుడు, సరస్వతీదేవి, మురుగన్‌స్వామి, ఆంజనేయస్వామి నిత్యపూజ లందుకుంటూ వుంటారు శ్రీ సుబ్బారావు వయస్సు 43

—సాధన

నెరసిన వెంట్రుకలు కన్పడుతున్నాయి అంత వయోవృద్ధుడూ "తాదూరగంత లేదు మెడకోడోలు" అన్నట్లు పెద్ద సూట్‌కేసును మోసుకు వస్తున్నాడు

"తాతా- నేను తెచ్చి పెడ్తాలే సూట్‌కేస్ యిలా యివ్వు" అప్రయత్నంగా అంది రేఖ.

"నీ వంటి అందమైన ఆడపిల్లకు నే నెంత దూరంగా వుంటే అంత మంచిది"

అప్పుడు గాని అర్థం కాలేదు రేఖకు అతనెవరయినదీ మనసులో ఎగసి, పడుతున్న ఆనందాన్ని పైకి కనపడకుండా జాగ్రత్త పడుతూ చకచక నడచి వెళ్లి విమానంలో కూర్చుంది.

తర్వాత రెండు నిముషాలకు ఎయిర్ హోస్టెస్ సాయం పట్టి అతన్ని మెట్ల మీదుగా విమానంలోకి ఎక్కించి సీట్‌లో కూర్చోపెట్టి సూట్‌కేసును పక్కన అరలో వుంచింది.

ఎయిర్‌హోస్టెస్ సీట్ బెల్ట్ అతని నడుము చుట్టూ బిగించుతుండగా "హి హి హి చక్కలిగిలిగా వుంది" అన్నాడు

అతని మాటలకు చిన్నగా నవ్వుతూ లేచి నిలబడి "యువర్ ఎటెన్షన్ ప్లీజ్ గుడ్ ఆఫ్టర్ నూన్ టు ఆల్ ఆఫ్ యు యువర్ సీట్ బెల్ట్ టైటెన్ ద ప్లేన్ విల్ టేక్ ఆఫ్ యిన్ ఎఫ్యూమొమెంట్స్" అని స్పీకర్‌లో ఎనౌన్స్ చేసింది.

జరుగుతున్నదంతా చూస్తున్న రేఖ మనసులోని కుతూహలాన్ని అసూయ మింగి వేసింది.

లేకపోతే ఆఖరులో ప్లేన్‌లో ఎక్కిన యువకుడిని చూసి వుండేది!

## మీరానాయర్ మరో చిత్రం

'సలాంబాంబే' చిత్రంతో అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన భారతీయ చలనచిత్ర కారిణి మీరానాయర్ మరో చిత్రాన్ని నిర్మించాలని తలపెట్టారట దక్షిణ మెరికాలోని రాష్ట్రంలో జరిగే జాత్యంతర ప్రేమగాథ ఈ చిత్రానికి మూలమట ఈ చిత్రం పేరు 'మిసిసిపి మసాలా' ఈ చిత్రంలో ఆస్కార్ అవార్డుగ్రహీత డెంజిల్ వాషింగ్టన్ ప్రధాన పాత్ర పోషిస్తున్నాడు కథానాయిక పాత్రను నూతన నటి సరితా చౌదరి పోషిస్తుంది

సలాంబాంబే చిత్రానికి పని చేసిన సాంకేతిక నిపుణులలో పలువురు ఈ చిత్రానికి పని చేస్తున్నారు

ఫుల్ సూట్‌లో వున్న ఆ యువకుడి దండ కండరాలు కోటు నుండి అస్పష్టంగా కన్పడుతున్నాయి.

ప్లేన్ వాకిలి వద్ద నిలబడి లోపల కూర్చున్న ప్రయాణీకులను పరీక్షగా చూసాడతను.

వృద్ధ సిక్కు ముందుగా వెళ్తూ "రవితేజా" అని పిలిచాడు మెల్లగా

సిక్కు నుండి ఏవిధమైన ప్రతిస్పందన రాక పోవడంతో వెళ్లి వెనుక సీట్‌లో కూర్చుని ప్లేన్‌లోని ప్రయాణీకులను పరీక్షగా చూస్తూ వుండిపోయాడు

వృద్ధ సిక్కు రమ్మని సైగ చేస్తే దగ్గరకు వచ్చింది ఎయిర్ హోస్టెస్ రూప.

"చూడమ్మా కూర్చో ఓ విషయం చెప్పాలి"

పక్క సీట్లో కూర్చుంది రూప.

"పెద్దవాడినయిపోయాను- ఇప్పుడు రూల్సు మారిపోయాయేమో? వెనుకటి రోజుల్లో అయితే పిస్టల్ తీసుకు వచ్చిన వాళ్లను ప్లేన్‌లో ఎక్కనిచ్చే వాళ్లు కాదు"

"ఏమిటి తాతా నువ్వనేది?"

"నెమ్మదిగా మాట్లాడు. ఈ మధ్య మనదేశం విమానాలను హైజాక్ చేసుకుని లాహోరో, కరాచీనో తీసుకు వెళ్తున్నారని విన్నా! ఆఖర్లో విమానం ఎక్కాడే అతన్ని సోదా చేస్తే"

"ఉండు తాతా వెళ్లి"

"అయ్యో పిచ్చి తల్లీ ఆడకూతురువు నీ వలన ఆ పని అవుతుందా?" అంటూ ఆ అమ్మాయి చెవిలో గుసగుస లాడాడు

రూప లేచి వెళ్లింది క్యాబిన్‌లోకి.

రేఖ సిక్కు వంక కోపంగా చూచి తల పక్కకు తిప్పుకుంది.

విమానం ఇంజన్ స్టార్టయిన శబ్దం ప్రొపెల్లర్ గిర్రున తిరుగుతున్న శబ్దం వినవచ్చింది.

క్యాబిన్ నుండి రూప తిరిగి వచ్చింది. ఆమె వెంట నలుగురు యువకులు, ఇద్దరు సెక్యూరిటీ గార్డులు ఇద్దరు స్టెవర్ట్‌లు వచ్చారు

"హేండ్సప్" మెషీన్ పిస్టల్ గురి చూపుతూ ముందుకు వచ్చాడు ఫుల్ సూట్‌లో వున్న వ్యక్తి.

"నో నో" అరచింది రూప

మరుక్షణం పిస్టల్ గుండ్లు తల నుండి



దూసుకు వెళ్ళి కుప్పకూలి పడిపోయింది

శివశివ వెనుక కూర్చున్న ఆమె వణికి పోతూ అనడం వినపడింది సిక్కుకు

కామోష్– ఎవరూ కదల వద్దు గర్జించాడు ఫుల్‌సూట్ యువకుడు

స్ట్రైపర్ట్స్ సెక్యూరిటీ గార్డులు చేతులెత్తారు

ఊ! నలుగురూ నాలుగు వైపులకు కదలండి పాసింజర్లు నందరి చేతులూ కాళ్ళూ కట్టి వేయండి

నైలాన్ తాళ్ళు ఆ సూట్‌కేస్‌లో వున్నాయి

విమాన ప్రయాణీకులందరి కాళ్ళూ చేతులూ కట్టి వేసారు ఎబ్బంది!

ఊ! ఆ ముగ్గురి కాళ్ళూ చేతులూ కట్టి వేయి బిక్క పలచని సెక్యూరిటీ గార్డు మీద అరిచాడు ఫుల్ సూట్ వ్యక్తి అతను చెప్పినట్టు చేసాడు గార్డు

ఊ! కూర్చో గార్డు సీట్లో కూర్చున్నాడు అతన్ని సీటుకు కట్టి వేసి చేతులు కాళ్ళూ కదలకుండా బందించాడు

## మోహినీ తాండవం

క్యాబిన్ తలుపు తీసుకుని లోపలకు వెళ్ళిన యువకుని వంక ఆశ్చర్యంగా చూచారు పైలట్లు

నేను చెప్పినట్టు విన్నారా బతికిపోతారు లేకపోతే రూపకు పట్టిన గతే మీకు పడుతుంది

రూపకేమయింది? అడిగాడో పైలట్ ఆదుర్దాగా

రెండో పైలట్ సైగ చేయటంతో ఆగిపోయాడతను

విమానం లాహోర్ జేర్చాలి

తెల్లముఖా లేసుకుని చూడసాగారు పైలట్లు 'కమాన్ బి హేవ్ యువర్ సెల్ఫ్' పిస్టల్ గురి చూపుతూ అరిచాడు ఫుల్‌సూట్ యువకుడు

పైలట్ల చేతి వేళ్ళు యాంత్రికంగా కదిలాయి విమానం గాలిలో కెగురసాగింది

అరగంట తర్వాత వైర్‌లెస్‌లో మాట్లాడసాగాడు ఫుల్‌సూట్ యువకుడు

రెహమాన్ స్పీకింగ్ ఫ్రం హెవెన్

కోడ్ నంబర్

ఆపరేషన్ దండర్ బోల్ట్ 110

ఓ కె ప్రొసీడ్

పక్షిని గూటికి తెస్తున్నా

ఒకె రన్ వేక్లియర్ అవుతూంది

**వాట్ ఎబవుట్ ప్లూటో?**

ప్లూటో రెహమాన్ మాటలు **పూర్తవక ముందే అతని మెడమీద** బలంగా పడ్డ కరాటే చాప్‌తో కుప్పకూలిపోయాడు

వృద్ధ సిక్కు సైగ చెయ్యడంతో అతని వెంట వచ్చిన రేఖ రెహమాన్ కాళ్ళూ చేతులూ కట్టివేసింది

హలో రెహమాన్ ఆపరేషన్ దండర్ బోల్ట్ 110 వైర్‌లెస్ నుండి వస్తున్న ధ్వనులు విని నవ్వుకున్న సిక్కు రెహమాన్ యాజ్ స్లీపింగ్ వెల్ అని గొణిగి వైర్‌లెస్ అవతల పెట్టి వేసి పైలెట్లతో విమానం వెనక్కు తిప్పండి' అన్నాడు

(ఇంకా వుంది)